This book is published with the financial

assistance of

**Tirumala Tirupathi Devasthanams**

under their scheme

Aid to Publish Religious Books.

★ ★

ముద్రణ ద్రవ్యసహాయమునకు కృతజ్ఞతగా వేంకటేశ్వరుని
గూర్చి చెప్పిన పద్యము.

ఇలపయి భక్తకోటుల కభీష్ట గుణంబుగ వేలదైవముల్
వెలసిరి, అందునీవొకడివే - శరణార్థుల యార్తి యార్చి వా
రల నిలువెల్లగైకొని, విరక్తుల జేయ సహంబు మూలమౌ
తల నునుపొందజేసి సంఘమును దారికి తెత్తువు వేంకటేశ్వరా!

# విశ్వనాథ వారి

## భక్తి - దేశభక్తి

(మాస్వామి, ఆంధ్రప్రశస్తుల ఆధారముగా)

కృతి స్వీకర్త

సౌజన్య సేవధులు

**శ్రీమాన్ శీలం రామచంద్రరావు**

శీలంవారి సావరం

రామచంద్రపురం

తూ॥ గో॥ జిల్లా

కృతి కర్త

తెలుగు విశ్వవిద్యాలయ ఉత్తమ నాటక రచన
బహుమతి గ్రహీత

భాషా ప్రవీణ

డా॥ పంపన సూర్యనారాయణ ఎం. ఏ: ఎం. ఫిల్:
ఆంధ్రోపన్యాసకుడు పి. హెచ్. డి.
మహారాణీ కళాశాల, పెద్దాపురం.
తూ. గో. జిల్లా.

ప్రథమ ముద్రణ. 1990
ప్రతులు 1000



వెల రు. 35_00

ప్రతులకు
వంపన లక్ష్మి
శ్రీపాదవారి గృహము
ప్రభుత్వ ఆసుపత్రి వెనుకవీధి
పెద్దాపురం - 533 437
తూ॥ గో॥ జిల్లా.



ముద్రణ -
కిరణ్ ప్రింటింగ్ వర్క్స్
పెద్దాపురం.

# పూర్వాపరాలు

విశ్వనాథ సాహిత్యపీఠము పోటీకి ప్రకటించిన విషయము మాస్వామి - ఆంధ్రప్రశస్తి. విశ్వనాథవారంటే సరేసరి, 'ఆంధ్ర ప్రశస్తి' నాకు ఆత్మాభిమానమువంటిది. అదీకాక పోటీ అనగానే ఏనుగని కాని, ఎలుకపిల్లనికాని ఉండదు. సరికదా! ఉత్సాహముతో ఉరకలు వేస్తుంది నామనస్సు, గడువు స్వల్పమైనా రచన కుపక్రమించాను. గ్రంథనామము రచయితయే నిర్దేశింపవలెనను పీఠ నిర్ణయానుసారముగా 'విశ్వనాథవారి భక్తి - దేశభక్తి' అని పేరు పెట్టి గ్రంథము పూర్తిచేయునప్పటికి సమయము నిండుకొన్నది. అయితే మాత్రము - 'అదృష్టముంటే అరు నూరౌతుంది' అను సామెత ప్రకారముగా తిరుపతి దేవస్థాన పండితుల పరీక్షకు నిల్చి ముద్రణ సౌభాగ్యమునకు నోచుకొన్నది.

స్వల్పమైన సకాలములో సమాప్తముచెయ్యాలనే సంకల్పము కారణముగా ఆధార గ్రంథములనుండి వాక్యాలకు వాక్యాలు దుముదారుగా వచ్చిపడుటతోపాటు రచనలో బిగింపు కూడ సడలినది.

ఈ నాయజ్ఞమునకు అధ్వర్యవము వహించిన మహానుభావులు శ్రీమాన్ మధునాపంతుల వేంకట పరమయ్యగారు. అల్లంరాజు లక్ష్మీపతిగారు. ద్వివేది సత్యకవిగారు, దొంకాడ సత్యనారాయణ మూర్తిగారు. గవరసాని గోపాలకృష్ణమూర్తిగారు.

ఈ కృతి స్వీకృతి కంగీకరించిన మదీయ బాల్యగురువులు శ్రీమాన్ శీలం రామచంద్రరావుగారికి అభివందన పూర్వ కాభి నందనలు. అభిప్రాయము వందించిన గంగోత్తుంగ తరంగ సదృశ వాగ్విన్యాస పాత్రులు ఆచార్య బి.వి.యస్. పాత్రుడుగారికి నమోవాకములు. నాకు ఎన్నో విధాల సహాయపడిన సన్నిధానం నరసింహశర్మ గారికి, గ్రంథ మండలి విషయమునకు తగినట్లుగా అట్టమీద చిత్రమును సంతరించిన శ్రీ నగేష్ గారికి కృతజ్ఞతలు.

చరిత్ర జ్ఞానమంతగాలేని నేటి పండితులకు ఈ గ్రథము కొంతైన ఉపయోగపడుతుందని నా విశ్వాసము.

# అంకితము

ఓ బాల్యగురువర్య! యుష్మదాగమ ఫలం
బీ జీవన పథాన కెట్టిదనిన

అంధకారాంధ్రి కాస్యాన నాంగ్లంపు బొ
ట్టిడు కందుకూరి జన్మించుటయ్య

బ్రహ్మసమాజపు పరిమళ రత్నంబు
కృష్ణ శాస్త్రికి లభియించుటయ్య

శిష్యవాత్సల్యుడౌ చెళపిళ్ళ మాటవి
ల్వైన విశ్వనాథ పెంపొందుటయ్య

స్వార్థరహిత భక్తియుత జీవనులు మీకు
తగ్గ భక్తిగ్రంథము నంకితంబు సేయ
నాదు చిరకాల వాంఛ, ఈనాటికిట్లు
వేంకటేశ్వర కృప నెరవేరెనయ్య.



# కృతి స్వీకర్త



పరమార్థ సంపాదనైక పరాయణులు
శ్రీమాన్ శీలం రామచంద్రరావుగారు
శీలంవారి సావరం
రామచంద్రపురం.

ఆచార్య బి. వి. యస్. పాత్రుడు
భాస్కరనగర్,
కా కి నా డ — 3

# అ భి ప్రా య ము

విశ్వసాహితీ జగత్తులో విశ్వనాథకు విశిష్టస్థానమున్నది. సాహితీరంగంలో ఆయన చేపట్టని ప్రక్రియలేదు. పట్టినదెల్ల బంగారము చేయక వదలలేదు. శతకసాహిత్య ప్రక్రియకు 'మాస్వామి' తలమానిక మయితే చారిత్రిక ఖండకావ్యప్రక్రియకు 'ఆంధ్రప్రశస్తి' కొలమానిక.

పుంభావ సరస్వతీ స్వరూపులైన విశ్వనాథవారి సాహిత్యాన్ని మథనం చేయడం సామాన్యులకు సాధ్యంకాదు. పంపన వారు ముందడుగువేసి పై రెండు గ్రంథాల చారిత్రిక నేపథ్యంలో జరిగిన యథార్థ సంఘటనలను సునిశితంగా అధ్యయనం చేసి, సువ్యక్తమొనర్చుటతోపాటు సందర్భాన్ని పురస్కరించుకొని విశ్వనాథవారి వ్యక్తిత్వాన్ని, 'ఆంధ్రపౌరుష' గ్రంథవైశిష్ట్యాన్ని ఔచిత్యభాసురముగా నుగ్గడించి యోగ్యులనిపించుకొనినారు.

విశ్వనాథవారి అంతర్గత భావాలకు వీరి వ్యాఖ్యలు దర్పణం పడుతున్నవనడంలో సందేహంలేదు. కవితారూప తపస్సు చేసిన ఆ మహానుభావుని కవితా వైభవాన్ని, భక్తిభావాలను, దేశభక్తిని కన్నులకు గట్టినట్లు చిత్రించడం ఆంధ్రుల అదృష్టం.

చివరగా శ్రీ పంపనవారి మాటల్లో 'చరిత్ర జ్ఞానమంతగా లేని నేటి పండితులకు ఈ గ్రంథము కొంతైన ఉపయోగపడు తుందని నా విశ్వాసం' అన్నది యథార్థం.

ఇట్లు
భవదీయుడు

18-3-1990
కా కి నా డ

ఆచార్య బి. వి. యస్. పాత్రుడు

సన్నిధానం నరసింహశర్మ
సాంబశివరావుపేట.
రాజమహేంద్రి.

# సహృదయ దృగ్దర్శనము

పంపనవారు - 'విశ్వనాథ వారి భక్తి - దేశ భక్తి' అను అంశముపై పరిశోధనాత్మక గ్రంథము వెలువరించుట సముచిత ప్రయోజనాత్మక కార్యము. విశ్వనాథవారి విశ్వరూప సాక్షాత్కారమున నిదియొక ప్రముఖ ద్వారము.

సత్యనారాయణగారి బహురచనలు హిమాలయ పర్వత శ్రేణులవంటివి. అందు రామాయణ కల్పవృక్షము కావ్యౌన్నత్యమున గౌరీశంకర సదృశమే అయినను ప్రాకృతిక దృష్టిలో సృష్టిలో ఏ పర్వతమున కాపర్వతమే స్వీయౌన్నత్య సౌందర్యప్రస్ఫుట కారకము లైనట్టివి.

నాదృష్టిలో పరిశోధకులు పర్వతారోహకులు. కొంతవరకు నధిరోహించువారుందురు. ఆవైపునుండి కొందరు. ఈ వైపునుండి కొందరు ఆయా కోణములలో దర్శించెదరు. ఎవరి దిగ్దర్శనములు వారివి. ఎవరి దృగ్దర్శనములు వారివి. చివరకు పతాకనెగుర వేయువారే విజేతలు. ఒకరధిరోహించినది మరియొకరధిరోహించకూడదను నియమ మేదియులేదు. వుండకూడదు.

పంపనవారు పర్వతద్వయారోహకులు భక్తిద్వయ గ్రంథ పర్వత ద్వయముపై పతాకను ఎగురవేసినవారు.

విశ్వనాథవారి ఆత్మయే బిందువుగా వెలువడిన మాస్వామి, ఆంధ్రప్రశస్తులను రామాయణరచనకు సాధనరూపములుగా పాండిత్య బలప్రదర్శకములుగా తెలుపుట మంచి అంచనాగానున్నది.

'వెలుంగర్చింతు విశ్వేశ్వరా!' అనునది చర్చించు సందర్భములో భర్తృహరి తేజస్సునర్చించుట మొదలగునవి చూచినప్పుడు శ్రీ పంపన వారి బహుగ్రంథ పరిజ్ఞానము వెలుగులీనును.

అగస్త్యుడాంధ్రుడని విశ్వనాథవారు వ్రాయుటను చరిత్రకారుల నిర్ణయముండుట వలన పంపనవారు సరిపెట్టుకొనిరి. కాని వాల్మీకిని ఆంధ్రునిగా విశ్వనాథవారు భావించి ఆ కాలమున వ్రాయుటను సరిపెట్టుకొన లేకపోయిరి. కారణము విశ్వనాథ వ్యతిరేకత కాదు. చరిత్రకారులు వాల్మీకిని ఆంధ్రుడని నిర్ణయించకుండుటయే. ఇట్టి సత్యదృష్టితో పంపనవారి గ్రంథముండుట ప్రశంసనీయము. ఇటువంటి వనేకములు గలవు.

విశ్వనాథ వారి రచనా వ్యక్తిత్వములను దిగ్దర్శనము చేయుటలో తన రచనావ్యక్తిత్వమును నిలుపుకొనుట పంపనవారు చేసినపని.

ఉద్ధృత పద్యోదాహరణములు సద్వ్యాఖ్యాన సమన్వితములై పరిశోధక శ్రామికుని లోతుచూపులు చూపించునట్టివిగా నున్నవి.

'సాగతీత' లేక ఎంతవరకు చెప్పవలయునో అంతవరకు చెప్పుట పంపన వారి ప్రత్యేకత. ఆంధ్రప్రశస్తి యందలి చారిత్రక పురుషుల గూర్చిన తర్జన భర్జనలు చూచినవారికి పంపనవారి చారిత్రక పరిజ్ఞానము బహుగ్రంథశోధనమని తెలిసి తీరును.

విశ్వనాథవారి సాహిత్య విజ్ఞాన సర్వస్వమును ప్రజలకు పంచుటలో ఈ గ్రంథమునందుండి పంపనవారు నిర్వహించిన పాత్ర గుణస్తోత్రార్హమైనట్టిది.

★ ★ ★

# విషయ సూచిక

# మా స్వామి - ఆంధ్ర ప్రశస్తుల అంతస్సూత్రము

మా స్వామి శతకము, ఆంధ్ర ప్రశస్తి చారిత్రక ఖండ కావ్య సంపుటము. మొదటిది భక్తికవితకు, రెండవది దేశభక్తి కవితకు పట్టుగొమ్మలు. ఒకటి ఆధ్యాత్మిక ప్రవృత్తికి, మరియొకటి జాతీయతా ప్రతిపత్తికి దోహదహేతువులు. ఆధ్యాత్మిక చింతన అంటే అలసతను పెంచునది కాదు; జనత జడతను పోగొట్టి ఆత్మశక్తిని పెంపొందించునది. అట్లే దేశభక్తి యనగా జాత్యహంకారమును రేపునది గాదు; ఆత్మ విశ్వాసమును, ఐక్యమును కలిగించుట ద్వారా జాతి పురోగమనాభివృద్ధికి తోడ్పడునది. ఒకటి పరమేశ్వరుని తత్త్వమును వ్యక్తీకరించునది; ఇంకొకటి జాతితత్త్వమును వెల్లడించునది. వ్యక్తిగతమైన ఆవేదనకు 'మాస్వామి' ఎట్టిదో, సమాజగత వేదనకు 'ఆంధ్ర ప్రశస్తి' అట్టిది. అనగా ఒకటి తనలో కలిగిన కలతను తొలగించుకొనుటకు, మరియొకటి జాతికి కలిగిన దాస్యమును తొలగించుటకు రచింపబడినవి. 'మాస్వామి'లో లోకమునందలి అవినీతిని, ఆంధ్రప్రశస్తిలో తెలుగువారి అస్వతంత్రతా దౌర్భాగ్యమును అధిక్షేపించినారు. శతకమున విశ్వేశ్వరం స్వామితో అవసరమయితే "నిన్నే తెగనమ్మెద" ననిన విశ్వనాథ ఖండకావ్యమున "నదులువొంగి తెలుగునేల మ్రుగించని" మ్మనినారు. తొలి కృతి విశ్వనాథవారి ఇలవేలుపు విశ్వేశ్వరస్వామి విలాస పేటిక; మలి కృతి పూర్వాంధ్రరాజుల కథా మంజూషిక.

జడప్రాయమై నిర్వీర్యమైయున్న జాతికి ఓజస్సును తేజస్సును తెచ్చుటకు విశ్వనాథ వారొనర్చిన కవితారూపమైన తపస్సే ఈ గ్రంథ ద్వయము. ఈ రెండింటికి వేదనా సూత్రమొక్కటియే. అందును, ఇందునుకూడ విశ్వనాథవారి భావావేశము కట్టలు త్రెంచుకొనినది. రెండింటి యందును తొల్లింటి మహోన్నత దశకును, నేటి నికృష్ట స్థితికిని గల అంతరమును గూర్చి వగచినారు. కవిగారి హృదయమును దహించు తీవ్రవేదనా స్ఫులింగములు రెండింటి యందుగల ప్రతి వాక్యమునందును ప్రస్ఫుటముగా గోచరించును.

రెండును విశ్వనాథవారి కైతబ్రతుకున బారెడు ప్రొద్దు పొడుపులో పుట్టినవే, సాహిత్య సౌందర్య మాధుర్యమును సంతరించు కొన్నవే. ఆత్మ నాయకమైన భావ స్రవంతి అంతర్లయగా ప్రవహించిన ఈ రెండు గ్రంథములు రామాయణ రచనకు పూర్వము విశ్వనాథ వారొనర్చిన సాధన రూపములు. శతకమునందే గాక ఖండ కావ్య సంపుటి యందును గల పద్యములు చాల వరకు ఓజోగుణ భూయిష్ఠము లగుటయే గాదు, పాండిత్య బల ప్రదర్శకములు కూడ.

అంతస్సూత్ర మొక్కటియే అయిన మాస్వామి - ఆంధ్ర ప్రశస్తులలోని పైన చెప్పబడిన వివిధ విషయముల నుదాహరణ పూర్వకముగా విశదము గావించుటయే ఈ వ్యాస లక్ష్యము.

విశ్వనాథ వారి ఆత్మయే బిందువుగా వెలువడిన ఈ గ్రంథ ములను పరిశీలించుటకు ముందు తన్నేపథ్యమగు జీవిత విశేష విషయముల గూర్చి కూడ తెలిసి కొనుటావశ్యకము.

## విశ్వనాథ జీవన ప్రస్థానము - వ్యక్తిత్వము

అందరు అన్ని విషయాలకు స్పందించరు. స్పందించిన వారందరు కలమును కదుపలేరు. కదిపిన వారందరు కవులు కాలేరు. ఆ కవులలో కూడ కొందరే వర్ణ్యవస్తువును అల్పాక్షరములలో సమగ్రముగా ప్రదర్శింపగలరు. స్పందన హేతువైన వస్తువు నూహించుట యందును, దానిని ప్రదర్శించుట యందును వ్యక్తి యొక్క సంస్కారబలము, చదివిన చదువు ప్రాధాన్యము వహించును. కనుకనే ఒకే వర్ణ్య వస్తువునందు కూడ కవుల దృక్పథములు భిన్న ములుగా నుండి వాటిని విభిన్న ప్రక్రియల యందు వెలువరించుట జరుగు చున్నది. ఈ భిన్నత్వమునకు దోహదము గావించు చదువు, సంస్కారముల వెనుక తల్లిదండ్రుల ప్రభావము, పుట్టి పెరిగిన వాతావరణము, గురువర్యుల ముద్ర ఇవియన్నియు ప్రబలముగా

పనిచేయును. కనుక ఒక కవియొక్క కావ్యాలోకనము గావించు నపుడు ముందుగా అతడెదిగి వచ్చిన పరిస్థితులను గూడ తెలిసికొన వలసియున్నది. అప్పుడే కవి యొక్క సమగ్ర హృదయా విష్కారము జరుగును. ఈ విషయము పూర్వ కవుల కొకింత దూరముగా తొలగి నప్పటికిని ఆత్మానుభవ ప్రకటనకు ప్రాధాన్యము నిచ్చిన ఆధునికులకు నూటికి నూరుపాళ్ళు వర్తించును.

ఈ సందర్భమును గూర్చి చెప్పిన ఆచార్య ఖండవల్లి లక్ష్మీ రంజనం గారి వాక్యము లిచట ఉదాహరణీయములు.

"పూర్వకవులు అన్యవస్తువుల రహస్యములను, అన్య వ్యక్తుల జీవిత నాటకములను చిత్రించుట యందు రక్తులు. భావకవికి ఆత్మయే బిందువు. ఈ బిందువునుండి విశ్వవృత్తము నాతడు గీసికొనును. ఈ బిందువు నుండి యాతని కవితా రేఖలు బ్రహ్మాండ వృత్తము యొక్క పరిధివరకు వ్యాపించును. పూర్వ కవి యొక్క నామరూప రహస్యములు మనకవిదిత మైనను అతని కావ్యములు మన మన్వయించి యానందింప గలము. భావ కవి యొక్క జీవిత యవనిక తొలగించి చూడక మన మాతని కృతి యందలి రసమును సమగ్రముగ నొక్కొక్కప్పుడు చర్వణ చేయజాలము. ఇట్టివారల కాతని నిందించుట బాల్య చాపల్యము. మహా యోగికి వలె భావ కవికి "ఆత్మైవ బంధురాత్మనః" లక్ష్మీరంజనవ్యాసావళి పే 239

ఇదే విషయమును విశ్వనాథ వారు కూడ అంగీకరించిరి.

"నేడు కొందరు చెప్పు చున్నారు 'కవి యొక్క జీవితానుభవ ములను తెలిసి కొన్నచో వాని కవిత్వము మన కెక్కువ యర్థ మగును' అని. ఇది నిజమే" ఆత్మకథ, పే 3.

మొత్తము మీద కవితా వైశిష్ట్యము తెలిసికొనుటకు తత్కవి జీవితానుభవములను అరయ వలెననునది తేలిన సారాంశము.

నందమూరు కృష్ణా జిల్లా యందలి ఒక గ్రామము. దాని ఆయకట్టు ఆరు వందల ఎకరములు. ఈ ఊరును కట్టినవారు విశ్వనాథ వంశీయులు. కట్టినవారనగా అక్కడ మొట్టమొదట ఇళ్ళు నిర్మించుకొనిన వారు. తరువాత ఎవరెవరినో తీసికొని వచ్చినారు. కాపురము పెట్టించినారు. రోజులు గడువగా ఆరు వందల గడపగల గ్రామ మైనది.

ఆ గ్రామమునకు విద్యాదాత, జ్ఞానదాత విశ్వనాథ శోభనాద్రి గారు. ఆయనమాట ఊరి వారికి వేదవాక్కు. భారత భాగవత రామాయణముల కథాకథనమున నిష్ణాతులు. చాటుపద్యాలకు నిధి. వ్యవహార దక్షతగల వ్యక్తి. మీదు మిక్కిలి మిక్కిలి దాత. అనగా చేతి కెముక లేని వ్యక్తి. ఆయన భార్య పేరు పార్వతి. వారి తొలి, మలికాన్పులు ఆడపిల్లలు. మూడవ కాన్పు మన కవి సమ్రాట్టు విశ్వనాథ సత్యనారాయణ.

నందమూరులో మన్మథ నామ సంవత్సర భాద్రపద బహుళ షష్ఠీ మంగళవారము నాడు ప్రొద్దుటి పూట విశ్వనాథవారు జన్మించి నారు. వారి జన్మ నక్షత్రము కృత్తిక. ఈ నక్షత్ర జాతకుడు తినుట ఎక్కువ, అరిగించు కొనుట తక్కువ. అంతంత మాత్రమైన ఆరోగ్యము. దానికి తోడు వట్టి యభ్భనాకారి. ఉన్నదొకే ఒక గొప్ప తనము _ అది బుద్ధి కుశలత.

ఐదవ యేడున అక్షరాభ్యాసము. అక్షర మాల, గుణింతాలు నేర్చుకొన్న వెంటనే సుమతీ శతకము, కృష్ణ శతకము, నరసింహ శతకము. ఆంధ్రనామ సంగ్రహము-ఆపైన పెద్ద పుస్తకము పట్టుట. ఇది ఆనాటి విద్యాభ్యాసక్రమము. కవిత్రయ భారతము, పోతన భాగవతము, భాస్కర రామాయణము _ ఈ మూడింటికి పెద్ద పుస్తక మని పేరు. ఇది యంతయు సామాన్యునకు నాలుగేండ్లు, కుశాగ్ర బుద్ధియైన విశ్వనాథకు రెండేండ్లు మాత్రమే.

గ్రామమునకు జ్ఞాన ప్రదాతయైన శోభనాద్రిగారు పురాణ మును జెప్ప నప్పుడు వినిన విశ్వనాథకు భారత రామాయణ కథలు కరతలామలకములైనవి. తండ్రిగారు ఆడించిన నాటకములు, చెప్పించిన హరికథలు తనయునకు ఒంటబట్టినవి. కూచిపూడివారి నాటకములు, పగటి వేషములు విశ్వనాథవారి హృదయమునకు హత్తుకొనినవి. ఆయన లోగల ఆర్ద్రతా లక్షణమును ఇవి యన్నియు ఇబ్బడి ముబ్బడి గావించినవి. వీటి యొక్క దోహదమును గూర్చియు, ఆ గ్రామ విశిష్టతను గూర్చియు విశ్వనాథ వారే ఇట్లు వ్రాకుచ్చినారు.

"నాకు ప్రధానముగా కవిత్వము వచ్చుటకు కవి నగుటకు అనంత కల్పనలు చేయగలుగుటకు నిరాఘాటముగా వర్ణనలు సాగించుటకు పలుచోట్ల యథాతథముగా వర్ణించునట్లు కన్పించుటకు నాకిది యంతయు పునాదియైనది. ఇచ్చట నొక్క ప్రశ్న యున్నది. నీ తమ్ములున్నారు. నీ పినతండ్రి కొడుకులున్నారు. మరి మీయూరిలో చాలమంది యువకులున్నారు. వారెందుకు నీ వలె కాలేదు. ఇక్కడ, జీవ లక్షణమని చెప్పబడునది. నాజీవ లక్షణములో కవితాశక్తి యున్నది. కల్పనాశక్తి యున్నది. ఆంధ్రభాషా సాహిత్య శక్తి యున్నది. నాకివి యన్నియు దోహదములైనవి. వారికి కాలేదు. ........... పరమేశ్వరుని దయచేత నెవని జీవన సంపుటిలో కవితా శక్తియు నార్ద్రతయు నుండునో అట్టివాడు మా గ్రామములో పుట్టినచో మహాకవి కాక చచ్చునా!!" ఆత్మకథ. పే 12,16

ఏడేండ్లు వచ్చునప్పటికే ఇప్పటి లెక్క ప్రకారము విశ్వనాథ పెద్ద పండితుడు. అంటే పెద్ద బాల శిక్ష కంఠతః వచ్చును. ఆంధ్ర నామ సంగ్రహము. ఆంధ్రనామ శేషము వారికి హృత్కవిలె. భారత భాగవత రామాయణములు చదువగలరు. చాల భాగము అర్థము చేసికొన గలరు. పద్యమును శ్రావ్యముగా చదువు నేర్పున్నది.

నందమూరు చుట్టుపక్కల గ్రామాలలో కూడ ఇంత తెలివి గలవాడు లేడను మాట వ్యాపించినది. ఈ తెలివికి తోడుగ సద్యః స్ఫురణ మెక్కువ. మాటలలోని యర్థమును విరిచి చమత్కరించుట వెన్నతో బెట్టిన విద్య. అనగా ఒక విలక్షణముగా ఊహించుట. అ విరిచిన మాటలు సూదులు. వాడితన మంతయు విషయములో నున్న సూక్ష్మతను పురస్కరించికొని యుండును. సూక్ష్మతయే తెలియునుగాని చిన్నతనమగుటచే అది పరులనెట్లు బాధించునో యన్న పరిజ్ఞానము వారి కిసుమంతయు లేదు.

అహంకార మనునది జన్మతో నుండును; పెంపకముతో నుండును; విద్యతో నుండును; ధనముతో నుండును; అధికారముతో నుండును. వీటిలో చిట్టచివరది తప్ప అన్నియు సమకూడినవి. ఇక అహంకారమునకు కొదువేమున్నది? జన్మ లక్షణమనగా జీవగతమైన లక్షణము. తరువాతి అహంకారమును గూర్చి వారి మాటలివి.

"ఆ కొద్దిలో మేము ప్రభువులము. ఆ గ్రామము మాది. ఈయా కారణముల చేత మాకుదురులో నొక దురహంకారము— ఒకరీవి—ఎవడన్నను లెక్కచేయని లక్షణము, చప్పున మాట తూలుట— మన మాటయే సాగవలయు నన్న యొక యహంకారము కలవు. ఈ లక్షణములు నాలో క్రమక్రమముగా వృద్ధి పొందినవి........

అన్నిటి కంటె మించి విశ్వనాథ శోభనాద్రిగారి కుమారుడను. మా బంధుత్వములో మాయెరిగి యున్న యూళ్ళలో నేనల్లారు కూచిని........నే నెచ్చటికి పోయినను నన్ను వేయి కండ్లతో చూచెడి వారు. చెప్పితిని గదా! నా నెత్తురులో నున్నది దురహంకారము. నా నోటికి వచ్చినది మాటాడెడివాడను, నే నన్నచో ముద్దు. మా నాయనగారన్నచో గౌరవము. అందరును సహించెడి వారు. ఈ రీతిగా నా వాక్కునకు నియమము లేకుండ నేను పెరిగితిని."

ఆత్మకథ, పే 9,19

ఇట్లని అహంకారమును ప్రదర్శించుటయే కాని దుర్జనత్వమును వహించుట యుండదు.

శోభనాద్రిగారికి పెద్ద యాస్తి యున్నదని మున్నే చెప్పితిని. ఆ కారణముగా 'మన పిల్లలు వ్యవసాయము చేసికొనియే బ్రతుకగలరు'. అను భావ ముండెడిది. అయితే సత్యనారాయణగారికి పండ్రెండేండ్లు వచ్చునప్పటికి అది పటాపంచలైనది. అప్పటికి వారి యాస్తి యంతయు శోభనాద్రిగారి దాతృత్వ ప్రభావమున హారతి కర్పూర మైనది. అందుచే కుమారునకు ఇంగ్లీషు చదువు చెప్పింపవలెనను తహతహ శోభనాద్రి గారిలో పెరగ నారంభించినది. తత్ఫలితమే విశ్వనాథవారు బందరు వచ్చుట; అచ్చట చెళ్ళపిళ్ళ వారి వద్ద అంతేవాసిత్వము లభించుట జరిగినది.

వీరికి బందరు రాక పూర్వమే తొమ్మిదవయేట వివాహమైనది. పదునూడవయేట నందమూరునకు సమీపమునగల వెలినూతల గ్రామమున గుడిపూడి వీరభద్రయ్యగారు గణయతి ప్రాసలు నేర్పినారు; పద్య రచనను గూర్చి వివరించినారు; మనుచరిత్రలోని అవతారికా పద్యము లన్నియు పాఠము చెప్పినారు. ఇదియే మన విశ్వనాథవారి కవితా కల్ప వృక్షమునకు బీజము.

బందరు వచ్చిన పిమ్మట విశ్వనాథవారి జీవిత గమనమునకు అడ్డు మాకలేదు. అల్లరి ఎక్కువైనది. తిరుగుట పెరిగినది. చెట్టు స్నేహములకు లోటులేదు. నాటక ప్రియత్వము పుదిరినది. వీటి యన్నింటి ఫలితము దివారాత్ర సంచారము. అయితే పాఠశాలకు పోయి ఉపాధ్యాయులు చెప్పినది జాగ్రత్తగా వినుటయను లక్షణ మొకటి గాఢముగా నున్నది. దానికి తోడు విపరీతమైన జ్ఞాపక శక్తి, ఇదియే పైవాటి నన్నింటిని కప్పివేసి, ప్రతి పరీక్షలో ఆయన ఏ ఫారము చదివినచో ఆ ఫారములో మార్కులధికముగా వచ్చిన మొత్తము మొదటి ముగ్గురిలో ఒకరిని జేసినది.

ఇంటివద్ద పుస్తకము పట్టిన పాపాన పోనప్పటికిని వీథి బడులలో చదివిన ఆరేండ్లును చూచివ్రాతను నిరంతరముగా వ్రాసి యుండుట కారణముగా విశ్వనాథ వారికి చక్కని దస్తూరీ అలవడినది. వ్రాసిన అక్షరములు పులు కడిగిన ముత్యములుగా నుండెడివి. అయితే రాను రాను లలాట లిఖిత కవితారేఖ బయల్పడిన కొద్ది చేతి వ్రాత చెడి పోయినది.

ఛందస్సు అభ్యసించిన నాటి నుండి పద్యములు వ్రాయుట ప్రారంభించినారు. ఆ పద్యములు తండ్రి శోభనాద్రిగారి కంట బడి నవి. ఆయన కొడలు మండిపోయినది. ఆనాటి సంఘటన విశ్వనాథ వారి మాటలలో నిది.

"ఆయనకు కోపము వచ్చి నా పద్యములు చింపివేసి నీవొక న్యాయవాదివో యొక రాచరికపుటుద్యోగివో యగుదువని నీకు నేనింగ్లీషు చదువు చెప్పించుచుండగా నీకీ తెలుగు కవిత్వమేమిరా! భట్రాజు ముండాకొడుకు వగుదువా?' యని నన్ను కొట్టలేదు గాని కొట్టుటయే మంచి దన్నంత చేసినాడు. ఆయన శాంతించిన తరువాత నేను చెప్పికొన్నాను. నేనొకసారి చదివిన పుస్తకమును రెండవసారి చదువలేను. "నేనే ఫారము తప్పినచో నా ఫారముతో నా చదువు మాన్పించుము. ఇదే షరతు"...... ఆయన యిట్లన్నాడు. "నీవే ఫారము తప్పినచో అప్పటితో నీ చదువు పూర్తి." రెండవది "నీవు వ్రాసినచో రామాయణము వ్రాయుము. ఈ పిచ్చి కవిత్వము వద్దు" అని మా నాయనగారు. నే నంగీకరించితిని. కాని యిట్లంటిని. 'ఈ పద్యాలతో రామాయణము వ్రాయుట యెట్లు? నేను కొన్ని యేండ్లు పరిశ్రమ చేయవలయును. నిరంతరము వ్రాయు చుండవలెను. అది యేండ్ల మీద జరుగవలసిన పని. నేను కవిత్వము వ్రాయు చుండగా నీవూరకుండవలెను. నాకు భగవంతు డాయుర్దాయము నిచ్చినచో నేను రామాయణమును వ్రాయుదును. మన స్వామికి

అన్నపూర్ణాంబికా సహిత విశ్వేశ్వరున కంకిత మిత్తు' నని చెప్పితిని. ఆయన దయతో నంగీకరించినాడు." ఆత్మకథ. పే ౫౬

విశ్వనాథ ఆరవ ఫారము పూర్తి చేసి కళాశాలలో అడుగు పెట్టునప్పటికి వారి కున్న భాషాజ్ఞానము సామాన్యమైనది కాదు. ఎన్నో ప్రయోగములు, ఎన్నో శబ్దముల యొక్క స్వరూపములు, ఎన్నో తెలుగు పద్యరచన లోని సొగసులు ఆకళించికొనినారు. వీటితోపాటు సంగీతములోని లోతులు తెలిసి కొనినారు. ఈ సంగీత పరిజ్ఞానము చాలవరకు నాటకముల పిచ్చివలన కలిగిన లాభము. దీనికి వారి మాటలే ప్రమాణములు.

"నా యందు రెండు లక్షణములు చిన్నప్పటి నుండి యుండెడివి. ఒకటి కవిత్వము వ్రాయుట. రెండవది సంగీతమును పాడుట. తరువాత తరువాత చదువుకొని ఫరవాలేదు వీడు కవియే యనిపించుకున్నాను. సంగీతము మాత్రము పది పదేనేండ్ల క్రిందటి వరకు గాలి సంగీతమే. ఎంత గాలి సంగీతమైనను పాతిక ముప్పది రాగములు గొంతెత్తి పాడెడి వాడను. నాటకములలో వేషములు వేసెడి వారి కన్న బాగుగా పాడెడి వాడను. నేను బి.యే.లో నుండగా మా యింటి ప్రక్కనే వాగ్గేయ కారకులు శ్రీ త్యాగరాజా పరావతారము శ్రీహరి నాగభూషణముగారు కాపుర ముండెడి వారు. నేను గొంతెత్తి పాడుచుండగా వారు విని 'సత్యనారాయణ సంగీతము చక్కగా పాడగలడే' అన్నారట. ఆ మాత్రము సంగీత జ్ఞానము నాకు నాటకములు తెగ జూచుట వలన నాగభూషణముగారి కచేరీలు కనీసము వంద యైనను వినుట వలన వచ్చినది." ఆత్మకథ. పే ౫౫

ఈ సంగీత పరిజ్ఞానము పద్య పఠనమున విశ్వనాథవారి కొక వైయక్తిక వైశిష్ట్యమును చేకూర్చిపెట్టినది. సమాసమును దొర్లించుట, విరుచుట, రాగమును ప్రస్తరించుట — ఒక ప్రత్యేక బాణీ వారిది.

పైన చెప్పిన చిన్నప్పటి నుండియే అంటే పదునాలుగేండ్ల వయస్సు నుండి యని అర్థము. అప్పటి నుండి పద్య రచన ప్రారంభించిన విశ్వనాథ ఎన్నో కొకిబికి పద్యములు వ్రాసి చింపివేసి, 1917లో ఎఫ్. ఎ. చదువులో చేరగానే 'ఆంధ్ర పౌరుషము'ను ప్రకటించినారు. ఇది వారి స్వీయ దేశాభిమాన పౌరుషములకు ప్రతీక.

ఆంధ్రుల పూర్వోన్నత్యమును కొనియాడి, ప్రజలను ఉత్సాహవంతులను జేయుటయే గాక ఆసేతు హిమాచల మట్టుడికి పోయిన సహాయ నిరాకరణోద్యమమున కనుకూలముగా కళాశాల చదువుకు స్వస్తి చెప్పినారు. తరువాత 1929 నాటికి యం.ఏ. పట్టము నందుకొనినారు. వీరు కొంత కాలము నిరుద్యోగ జీవితమును గడిపినారు. ఈ సమయమందే తెలుగు సీమ నలుమూలలందుపన్యాసము లిచ్చి వాగ్మివతంసునిగా ప్రశంస లందుకొనినారు. 1934 నాటికే దేశము పట్టనంత కవియని ప్రశస్తి పొందినారు.

విశ్వనాథవారి బహుముఖీనమైన ప్రతిభకు తోడుగా అవిచ్ఛిన్నమైన అభ్యాసము వెన్నంట నున్న వ్యుత్పత్తిని గూర్చి డా. దివాకర్ల వారి వాక్యములివి.

"సర్వతో ముఖమైన విశ్వనాథవారి ప్రతిభకు వారి వ్యుత్పత్తి వైవిధ్య మెంతో వన్నె చేకూర్చినది. వారు బందరులోనే శ్రీ కంభంపాటి రామమూర్తి శాస్త్రిగారి దగ్గర కొంత సంస్కృత వ్యాకరణమును, శ్రీ పరిమి నరసింహశాస్త్రిగారి దగ్గర సూత్ర భాష్యమును, శ్రీ కానుకొలను త్రివిక్రమరావుగారి దగ్గర వేదాంత ప్రకరణములను అభ్యసించిరి. ఆ సమయముననే వారు సంస్కృత కావ్యనాటకాదులను కూడ పరిశీలించిరి. గుంటూరులో శ్రీ కల్యాణానంద భారతీ మాంతాచార్యుల యొద్ద ఉపనిషద్భాష్యములను పఠించిరి. సంస్కృతాంధ్ర గ్రంథములతోపాటు వారాంగ్ల గ్రంథములను సైత మనవ

రతము పఠించుచునే యుండిరి. ఆంగ్లమున ప్రసిద్ధములైన నవల లన్నియు వారు చదివిరి ... ఆంగ్లము నందలి ఆధునిక శాస్త్ర గ్రంథ ములు సైతము వారి కపరిచితములు కావు. ఆంధ్ర కవులలో శిల్ప దృష్ట్యా నన్నయ, తిక్కన, నాచన సోమన, పెద్ద నాదులును, శైలి దృష్ట్యా తెనాలి రామకృష్ణ, కృష్ణరాయ, నాచన సోమన పెద్దనాదు లును వారికి మేలు బంతులు.... మమ్మటానందవర్ధ నాభినవగుప్త పండితరాయాదుల సాహిత్య సిద్ధాంతములను వారు పలుమార్లవ లోడించి స్వాయత్తము చేసికొని యుండిరి." ప్రతిభాలహరి పే 83

బందరు హిందూ కళాశాలలోను, గుంటూరు ఆంధ్ర క్రైస్తవ కళాశాలలోను, విజయవాడ యస్. ఆర్. ఆర్. కళాశాలలోను అధ్యా పకత్వమును నెరపి శిష్య పద్మాలకు నిత్య మార్తాండ మూర్తులై వెలిగినారు. ఆంధ్రప్రదేశ్ రాష్ట్ర శాసన మండలి సభ్యత్వం, కరీం నగర్ కళాశాల అధ్యక్షత, ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ ఉపాధ్య క్షత్వము ఇవియన్నియు వారి ఔన్నత్యమునకు పట్టిన గౌరవ హారతులు

వీరి గ్రంథరచన బహు విచిత్రమైనది. ఒక్క రోజులోనే ఒక నవల వ్రాయగలరను ప్రతీతి అట్లుంచగా, ప్రయాణములోనే తమ రచనా ప్రణాళిక రూపురేఖలు దిద్దుకొనుటయే గాక, రచింపబోవు కావ్యములోని సంఘటన గూర్చి ఇరువది, ముప్పది పద్యము లూహించుకొని, ధారణ పట్టి, గూటికిచేరిన పిమ్మట వ్రాసికొనుట వారికొక హేల.

ఆయన గ్రంథ రచన గూర్చి పేరాల భరతశర్మగారి మాటలు విన దగినవి.

"ఏ గ్రంథం వ్రాసినా ఆశువుగా చెప్పగా మా బోటి వారము వ్రాసి పెట్టేము. ఎన్ని గ్రంథాలు వ్రాసినా ఆయన నాలుగు తలుపులూ బిడాయించుకొని ఏ మారుమూల గదిలోనో తననెవరూ

పలకరించ కుండా ఉండేచోట కూర్చొని వ్రాసినవి కావు. పంచలో కూర్చుండే వారు. వ్రాయడానికి నేనో ఇంకెవరో ఉంటాము. కూర లమ్మేవాళ్ళు వస్తారు. పనివాళ్ళు వస్తారు. ప్రెస్సునుండి ప్రూపులు వస్తుంటాయి. ఎవరో పండితులో కవులో చూచి పోడానికి వస్తూనే వుంటారు. ఎవరెవరో ఎందరెందరో 'ఆయన ఏదో గ్రంథం వ్రాసు కుంటున్నారు మనం పలకరించడ మెందు'కని వారనుకోరు. వారను కొన్నా యీాయన వూరుకొనే వారు కాదు. కూర లమ్మే వాణ్ణి కూడా చమత్కారంగా పలకరిస్తూ కూరలు కొంటారు. చెప్పుకు పోతున్న నవలో, నాటకమో, వ్యాసమో ఆ క్షణాల్లో అపుతారు. మళ్ళా వచ్చి వెనక ఏమి చెప్పింది చదవమనకుండా క్రొత్త వాక్యం మొదలు పెడతారు. అక్కడ సందర్భానికి సరిగా అదేవాక్యం చెప్పాలి. అలాగే చెప్తారు. విషయ సూత్రం తెగదు. ఎన్నిసార్లు ఆపినా సరే అయన వ్యగ్రతకు భంగంరాదు. ఆ నాడు చెప్పదలచిన భాగమంతా చెప్పేసే వారు.

ఈ బాహ్య విషయాల మీద ఆయన ఎంతో ఆసక్తితో కన్పించే వారు. లోపల గ్రంథం గూర్చిన ఆలోచన అది అలాగే వుండేది కాబోలు! గ్రంథం దగ్గరకు వస్తే ఆధారణ చూచి ఆశ్చర్యపోయే వాణ్ణి. ఆయన శరీరం నేల మీద ఒక మోటారు. ఆయన మనస్సు ఆకాశంలోని ఒక విమానం" విశ్వనాథ శారద. ప్రథా. పే 16

ఇదే సందర్భంలో చతుర్వేదుల లక్ష్మీ నరసింహంగారి మాటలు కూడ వినుట సమంజసము.

"శ్రీ విశ్వనాథ ప్రచురించిన నవల లన్నీ యిలా చెప్పగా లేఖకులు వ్రాసినవే - వీరవల్లడు, జేబుదొంగలు, కడిమిచెట్టు, బద్దన్న సేనాని వారు చెప్పగా వ్రాసే అదృష్టం నాకూ దక్కింది.

ఆయన చెప్పగా వ్రాస్తూ ఉండటం అదొక అసిధారా వ్రతం.

వక్క పలుకులు నవుల్తూ సుదీర్ఘ సమాసాలు దొర్లించుకుంటూ పోతూ ఉంటే ధారణతో వ్రాయాలి. విషయం లేఖకుడు పట్టించుకోకుంటే వ్రాయటం అసంభవం. పాత్రల పేర్లు కాస్త ఓదాని కొకటి చెప్పి నప్పుడు సందర్భాన్ని పట్టి మార్చుకొని వ్రాయాలి.

నవలలో కథావస్తువు రేఖామాత్రంగా పూర్వ నిర్ణయం చేసి, చెప్పుకుంటూపోతూ సర్వాంగ సౌందర్యం సంతరించటం జరుగు తుంది. పాత్రలపేర్లు అప్పటి కప్పుడే నిర్ణయం. జేబుదొంగలు, కథా నాయకునికి నా పేరు పెడ్తే నేను వ్రాయలేదు. ఒకరికి 'చతుర్వేది' అని ఉంచి ఉభయులం రాజీ పడ్డాం.

పద్య రచన ఆయనే చేసేవారు. అంటే మానసికంగా అంతా నిర్మించి చరచరా వ్రాయటమే. కల్పవృక్ష రచనా అంతే."

విశ్వనాథ శారద. ప్ర.భా. పే 31, 32.

అవును, అలా కాకుండగా ఆంధ్ర విశ్వవిద్యాలయము వారు పెట్టిన నెల గడువులోపల వేయి పేజీల 'వేయి పడగలు' నవల ఎలా పూర్తవుతుంది! ఆయన సిద్ధాంతముల కాకరమై ఆంధ్ర విజ్ఞాన సర్వస్వ మనదగిన దానిని సడలని బింకముతో సూత్ర విచ్ఛిత్తి జరుగ కుండగా పండిత కీర్తనీయుడైన తమ్ముడు వేంకటేశ్వరులు వ్రాయు చుండగా ఏకధాటిగా రెడ్డికము వేసికొని వక్కాణించిరి.

ఇక వారి పద్య కావ్య రచనలను గూర్చి తెలుసుకొందము. ఈ రచనలకు ప్రబోధకములు మూడు విషయములు. మొదటిది ఎవరో వచ్చి మాకీ కావ్యములను వ్రాసి పెట్టుమని యడుగుట రెండవది అంతః ప్రబోధము. మూడవది, మనసులో కొన్ని భావ ములు పేరుకొన వానికొక గ్రంథరూప మీయవలె ననుకొనుట.

ఎవరో వచ్చి మాకీ కావ్యములు వ్రాసిపెట్టుమను సంఘటన లను గూర్చి విశ్వనాథవారి మాటలనే ఉదాహరింతును.

"ఎవరికో ఒకతనికి వారము దినములలోనొక పద్యప్రబంధము కావలసి వచ్చెను. ఈ యూరిలో చాలామంది కవులు, వారం దినములలో మాకు చేతకాదన్నచో మాకు చేతకాదన్నారట. ఆ విశ్వనాథ సత్యనారాయణ ఉన్నాడు. ఆయనకు వారము దినములు కూడ అక్కరలేదు. ఆయన దగ్గరకు పొమ్మన్నారు. వచ్చాడు. కథ ఝాన్సీరాణి. కనీసము నాలుగైదు వందల పద్యాలైనా వ్రాయవలెను. నాలుగు దినములకన్న నెక్కువలేదు."

"మరియొకరు కుమారస్వామి కథను గూర్చి వ్రాసిపెట్టుమన్నారు. ఆయనకు నేనా కావ్యమును వ్రాసిపెట్టినచో సంతానము కలుగునని యాశ. వ్రాసితిని; అంకితమిచ్చితిని. ఆ గ్రంథము పేరు కుమారాభ్యుదయము. తృణమో పణమో పుచ్చుకొంటిని."

విశ్వనాథ కవితా వైభవము— పే. 48, 49.

ఇట్టివనేకములు "విశ్వనాథ పంచశతి" అనునది 500 పద్యములు గల గ్రంథము. దానిని కేవలము నాలుగు దినములలో వ్రాసిరట. ఈ అన్నియు వారి రచనా వేగమునకు తార్కాణములు.

వారేమి వ్రాసినప్పటికిని ఆ రచనలందు వేదాలు, ఉపనిషత్తులు, భాష్యాలు, తర్కాలు, వ్యాకరణాలు—అటు నిదాఘ హారములు లేకుండగా సంపాదించిన పాశ్చాత్య విజ్ఞానము రాశీభూతమై యుండును. చదివినది ఒంటబట్టించుకొని దానియొక్క భాష్యప్రాయముగా లోతులను వ్యక్తీకరించుట విశ్వనాథ వారికి వెన్నతో బెట్టిన విద్య.

తాము చదివిన చదువును గూర్చి వారే యిట్లు వ్రాకుచ్చినారు.

"నేను ఏది చదివినను సర్వంకషముగా దానిలోని లోతు లన్నియూ నా మనస్సునకు తృప్తికలుగునట్లు చదివెదను. అట్లే ఇంగ్లీషు, తెలుగు, సంస్కృతము – మూడు భాషలను చదివితిని.

అక్షర మెచ్చటనుండి పుట్టుచున్నది? ఎట్లు పుట్టుచున్నది? ఏ భాష యొక్క వర్ణసమామ్నాయ మెట్లున్నది? దేనిశక్తి యెంత? ఇక్కడి నుంచి అక్కడ వాల్మీకి-వ్యాసులు, ఇక్కడ నన్నయ - తిక్కనలు, అక్కడ హోమర్ - వర్జిల్ - షేక్స్పియర్లదాకా పరమేశ్వరుడు నాకిచ్చిన శక్తినిబట్టి (ఇది అల్పమని నేననుకొనుటలేదు) తరచి తరచి చూచితిని." విశ్వనాథ కవితా వైభవము-16

సంస్కృతమును చదువుటయేకాదు; అందు విశ్వనాథవారికి గల భాషా వైదుష్యమునకు తార్కాణముగా 'అమృత శర్మిష్ఠ, గుప్తపాశుపతమ్, దేవీ త్రిశతి మొదలగు గ్రంధములు రచించిరి.

విశ్వనాథవారికి భగవంతునియందు చెక్కు చెదరని విశ్వాసము. అట్టి ఆస్తిక్యభావముతోడనే వారు రచనలు గావించిరి. ఈ విషయమును దెలుపు విశ్వనాథవారి మాటలివి:

"చిన్నప్పటినుంచి నా జీవితములో జరిగిన యిట్టి యనేక ఘట్టములు నాకు భగవంతుడున్నాడన్న విశ్వాసమును గాఢతమముగా జేసినది. తరువాత తరువాత ప్రస్థానత్రయ భాష్యమును చదివినను అద్వైత మత రహస్యమును సంపూర్ణముగా తెలిసికొనినను, పరమార్థము 'అహం బ్రహ్మాస్మి' యైనను భగవంతుడున్నాడు లేనిచో నీ సృష్టి జరుగదు. ఇది రహస్యము. ఈ రహస్యము తెలిసిన శంకర భగవత్పాదులే యంత యద్వైత మతమును స్థాపించి భగవంతుడైన నారాయణుడున్నాడని చెప్పెను" ఆత్మకథ-పే.27

"నా స్వగ్రామమైన నందమూరిలో, శివకేశవాలయములు రెండును గలవు. శివాలయము మా నాయనగారు నిర్మించిరి. మా స్వామి వారి పేరు విశ్వేశ్వరస్వామి, విష్ణ్వాలయములో నున్నసామ్మి వేణుగోపాలస్వామి. మా ఇద్దరు స్వాములు నన్ను పెంచినవారు; పెద్దవానిని చేసినవారు, నా దారిద్ర్యములో నన్నాదుకొన్నవారు,

నన్ను బాగుచేసినవారు, నాకు సర్వ జ్ఞానమును కుదిర్చినవారు, నాలో కవితా భావమును నింపినవారు. "ఆ స్వామి నాకు స్వప్న ములో కనిపించి యొక వాగ్దానము చేసినాడు" "నా ఉపాస్య దైవ ములు నాకు ఎక్కువ యాధ్యాత్మికముగా, తక్కువ లౌకికముగా ఉపయోగింతురు" విశ్వనా కవితాథ వైభవము-పే. 50,51

ఇక వారి శ్రీమద్రామాయణ కల్పవృక్షము ఆధ్యాత్మిక తత్త్వమునకు మహా భాష్య రచన యనదగినది.

చివరకు కల్పవృక్షాంతమున "తుది జన్మగ జేయుము దీని ధూర్జటీ" అని ప్రార్థించినారు.

ఇట్టి విశ్వనాథవారికి జరిగిన సన్మానములు కోకొల్లలు. 1935లో బందరు సన్మాన సభలో వారిని "కవిసమ్రాట్" బిరుదము వరించింది. 1942లో గుడివాడలో గజారోహణము. 1964లో ఆంధ్ర విశ్వ కళా పరిషత్తు "కళాప్రపూర్ణ" బిరుదు ప్రదానము 1971లో జ్ఞానపీఠం వారి పారితోషికము. ఇంకను ఆస్థాన కవి పదవి మొదలగునవెన్నియో!

విశ్వనాథ వారెంత కవులో అంత విద్వాంసులు. ఎంత విద్వాంసులో అంత విమర్శకులు, ఎంత విమర్శకులో అంత వాగ్మివతంసులు, ఎంత వాగ్మి వతంసులో అంత హాస్య చమత్కార విశిష్టులు, వారు చేపట్టని ప్రక్రియలేదు, పట్టినదానిని పసిడిచేయక విడువలేదు.

ఆచార్య దివాకర్ల వేంకటావధానిగారనినట్లు నన్నయవలె నుభయ భాషా కావ్య రచనాభిశోభితులు, తిక్కనవలె రసాభ్యుచిత బంధ ప్రవీణులు, ఎర్రనవలె సూక్తివైచిత్రి శోభితులు. పోతనవలె భక్తాగ్రగణ్యులు. విశిష్ట సభ్యుల ప్రశంస. పే 67

ఇకవారి భక్తాగ్ర గణ్యత్వమునకు పరమ ప్రమాణమైన 'మాస్వామి' శతకమును గూర్చి తెలిసికొనుటకు ముందు శతకసాహిత్య

మును పర్యాలోచించవలసియున్నది.

## శతక సాహిత్యము - భక్తి శతకములు

'శత' శబ్దమునకు పరిమాణార్థమున 'కమ్'అను తద్ధిత ప్రత్యయము చేరగా 'శతకము' అనురూపము సిద్ధించును. నూరు పద్యముల గ్రంథమని దీని కర్థము. ఏక సూత్రత కలిగిన ముక్తక సమూహము శతకము.

భారతీయ భాష లన్నింటిలోను తెలుగున శతక సాహిత్యము విశిష్టస్థాన మాక్రమించు కొన్నదని విజ్ఞుల అభిప్రాయము. ఈ ప్రక్రియ తెలుగు సాహిత్యమున శాఖోపశాఖలుగ విస్తరించి అవిచ్ఛిన్న ధారా పాతముగ సాగుచున్నది. కొన్ని సాహిత్య ప్రక్రియలు కొన్ని యుగములకు మాత్రమే పరిమితములు. శతక సాహిత్యమున కొక యుగముతో నిమిత్తము లేదు. అది జీవన స్రవంతి. ప్రతి యుగమునందును కవి పండితులు శతక ప్రక్రియకు బొట్టు పెట్టిరి. ప్రజలు వాటిని పుక్కిట బట్టుచుండిరి. సంఖ్యా బాహుళ్యమున దీనిని మించిన ప్రక్రియ కానరాదు.

శతక కవులు పలుమంది ప్రజలకు సుపరిచితమైన భాషలో పద్యరచన గావించుట ఈ ప్రక్రియ వ్యాప్తికి దోహద పడినది. ఇందు వాడిన వ్యవహార భాష జనాదరణను పెంచినది.

ఇది కొందరకు తమ కవితా పరిపక్వతకు చేసిన ప్రయత్నము స్వీయావేదనాది భావ నివేదనమునకు సాధనము.

శతకము లన్నయు ఏదో ఒక ప్రయోజనమును సాధించుటకు రచించినవే. కేవలము శతక రచన చేతనే ప్రసిద్ధులైన కవులుండుట దీని గొప్పతనము చెప్పక చెప్పుచున్నది. సమకాలిక పరిస్థితులకు ప్రతిబింబములైన శతకములు చరిత్రాంశములకు నిలయములు. చరిత్రాంశ నిరూపణమున వీటి ప్రాధాన్య మనల్పమైనది.

ఇట్టి శతకముల ఆవిర్భావమును గూర్చి తెలిసికొందము.

ప్రాకృత సంస్కృత ప్రక్రియల ననుసరించి వెలువడి క్రమముగా విశిష్టతను సంతరించుకొనినదీ ప్రక్రియ. అయితే తెలుగు నందలి పెక్కు శతకములు మకుటైకము లగుటచే కొందరు విమర్శకులు దీనిని స్వతంత్రముగా వెలసిన దేశి ప్రక్రియగా భావించిరి. అది సరికాదని డా. కే. గోపాల కృష్ణరావుగారు తమ ఆంధ్ర శతక సాహిత్య వికాస పరిశోధన గ్రంథమందు నిరూపించిరి.

సంఖ్యా నియమము, మకుట నియమము, రస, వృత్తనియమము మున్నగునవి తెలుగు శతకమునకు ముఖ్య లక్షణములు. ఈ లక్షణములను తెలుగు శతక కర్తలు సంస్కృత శతకముల నుండి గ్రహించిరి.

భిన్న సంప్రదాయముల ననుసరించి సంస్కృత శతక కర్తలు శత, అష్టోత్తర శతాది సంఖ్యా నియమమును పాటించిరి. కొందరు తెలుగు శతక కర్తలీ నియమము నతిక్రమించిరి.

మకుట నియమము సంస్కృత స్తోత్రములందును, శతకములందును పాటించుట కనిపించుచున్నది. వేదస్తుతులలో "సజనాః ఇంద్రః", వాల్మీకి రామాయణమున "దుఃఖ మతోవనమ్", బాణ భట్టారకుని చండీ శతకమున "సాస్తుదేవీ శ్రియే వః" వంటి మకుటములు గలవు. తెలుగు శతకమునకు మకుటము ప్రధాన లక్షణము. అట్లని నిర్మకుట శతకములు లేకపోలేదు.

తెలుగు శతకములలో వృత్తమకుట నియమములు బరస్పరాశ్రితములు. మకుటమును బట్టి వృత్తమును గ్రహించుట తప్పదు.

సంస్కృత స్తోత్రములు భక్తి ప్రబోధమునకు తోడ్పడిన విషయమును గుర్తించిన శివ కవులు శివ భక్తిని చాటుటకు స్తోత్రములు,

వచనములు, శతకములు రచించిరి. మరియు తెలుగు కవులపై శైవముతోపాటు కన్నడ కవుల స్తోత్ర శతకముల ప్రభావ మున్నది.

నన్నయ భారతమున ఉదంకుడు నాగరాజులను స్తుతించు సందర్భమున "మాకు ప్రసన్నుడయ్యెడున్" అను మకుటముతో నున్న నాలుగు పద్యములు, నన్నెచోడుని కుమార సంభవమున "దారిద్ర్య విదారణా" అను మకుటముతో నున్న తొమ్మిది పద్యములు తెలుగు శతకములకు బీజప్రాయములని కొందరి మాట.

పదురెండవ శతాబ్దమున జీవించిన శైవమతాచార్యుడైన మల్లికార్జున పండితారాధ్యుడు 'అజా!, రుద్రా!, శివా! మహేశా!' మున్నగు మకుటములతో సుమారైదు వందల పద్యముల వరకు వ్రాసి వాటికి 'శివ తత్త్వసారము' అను పేరు పెట్టినాడు. దీనికి శతక మను పేరులేదు. కాని యిందలి పద్యములు సర్వ విధముల శతక పద్య లక్షణములను పోలి యున్నవి. 'శివ తత్త్వసారము' శతకమను విషయమున వాద ప్రతి వాదము లెట్లున్నను విమర్శకులు దీనిని ప్రథమాంధ్ర శతకముగా పరిగణించిరి. సర్వ లక్షణ సంపన్నమైన శతకము పాల్కురికి సోమనాథుడు రచించిన 'బసవా!, బసవా!, బసవా!, వృషాధిపా!' అను మకుటముతో నున్న వృషాధిప శతకము. తరువాత అన్నమయ్య మొదలగువారు తమ ఇష్ట దైవతముల సంబోధించుచు పెక్కు శతకములను రచించినారు. ఈ శతకములతో 'నీతి శాస్త్ర ముక్తావళి, సుమతి శతకము, దేవకీ నందన శతకము, నారాయణ శతకము, రఘువీర శతకము, వేంకటేశ్వర శతకము మొదలగునవి ప్రసిద్ధములు. వీటిని భక్తి, నీతి, శృంగార, వైరాగ్య, అధిక్షేప, తత్త్వ, చారిత్రక, కథాత్మక, శాస్త్ర, సంకలన, సంకీర్ణ, ప్రహేళికా, వివిధ వస్తుక, అనువాదములను విధముగా విమర్శకులు విభజించిరి.

ప్రస్తుతము మనము భక్తి శతకములను గూర్చి తెలిసికొనుట అవసరము.

'భజ' ధాతువునకు సేవార్థమున 'క్తిన్' అను కృత్ప్రత్యయము చేరగా 'భక్తి' అను రూపము సిద్ధించును. భగవంతుని యెడ మానవ హృదయ మందేర్పడు అనురాగ రూపమైన విశిష్టభావమే భక్తి. మత సిద్ధాంతముల ననుసరించి దీనికి విభిన్నమైన మార్గము లేర్పడినవి. పరమేశ్వరుని చేరుటకు కర్మ, జ్ఞాన, భక్తి మార్గములలో ఆద్య సాధనము భక్తి. ఇది ఒక్కొక్క దశలో ఒక్కొక్క విధముగా నుండును. సాధన దశలో భక్తుడు పరమాత్మునికొక రూప కల్పన మొనర్చుకొని ఆరాధించును. ఇది ద్వైత దృష్టి. సర్వ సృష్టియందు భగవంతుని జూచుట అద్వైత దృష్టి. ఇట్టి వివిధ దశలలోని భక్తుని మానసిక స్థితి అక్షర రూపమున వెల్వడినచో నది భక్తి రచన.

భక్తి శతకములతో ఆంధ్ర శతక వాఙ్మయ మోంకారము పలికినది. ఈ భక్తి శతకములతో నామగుణ కీర్తనము, భగవల్లీలాభివర్ణనము, పశ్చాత్తాప వ్యక్తీకరణము, వైరాగ్య ప్రకటనము, మోక్షాభిలాష అనునవి ప్రధానముగా కనిపించు చున్నవి.

తెలుగున వెలసిన శతకములలో ఎక్కువగా హరి హరులకు సంబంధించినవి, బ్రహ్మను గూర్చి శతక మొక్కటియే కనిపించు చున్నది. అది జొన్నలగడ్డ శారదాంబ రచించిన శారదాపతి శతకము. విష్ణువును గూర్చి ఆయన అవతారముల పేరు మీదుగ అనేక శతకములు రచింపబడినవి. శివునకు అవతార విశేషములు లేక పోయి నప్పటికిని శైవ భక్తి శతకము లధికముగా నున్నవి.

తెలుగున తొలి శతకములు శివ భక్తి ప్రధానములు. శతక కవిత్రయముగ ప్రశస్తి వహించిన మువ్వురును శివభక్తి శతకములు వ్రాసిన వారే. వారు మల్లికార్జున పండితుడు, పాలుకురికి సోమనాథుడు, యథావాక్కుల అన్నమయ్య. శివ తత్త్వ సారము, వృషాధిప శతకము, సర్వేశ్వర శతకము వారల గ్రంథములు. వీటి తరువాత వచ్చిన శైవ శతకములలో కాళహస్తీశ్వర శతకము, భక్త చింతామణి

శ్రీ విశ్వనాథ శతకము, భీమేశ్వర శతకము మొదలగునవి ప్రసిద్ధములు. ఈ శతకములయందు పరమశివుని నామగుణ కీర్తనము, శివభక్తి పారమ్యము, శివభక్తుల మహిమ, సుప్రసిద్ధ శైవక్షేత్ర మాహాత్మ్యము, ఈశ్వరుని స్థూల, సూక్ష్మస్వరూపము, అష్టమూర్త్యాత్మకమగు రూపము మొదలగునవి తెలుపబడినవి.

ఈ నాటివరకు వెలువడిన శివభక్తి శతకము లైదారింటిలో ఒకటిగా పేర్కొనదగిన శతకమును కవి సమ్రాట్ విశ్వనాథ సత్యనారాయణగారు రచించిరి. దాని పేరు 'మాస్వామి'. ఆ స్వామినిగూర్చి తెలిసికొందము. (ఈ ప్రకరణమును రచించుటకు డా. కె. గోపాలకృష్ణరావుగారి 'ఆంధ్ర' శతక వాఙ్మయ వికాస ముపయోగపడినది)

## మాస్వామి - ఆవిర్భావము :-

మన కవిగారి తండ్రిపేరు శోభనాద్రిగారని ఇంతకుముందే పేర్కొంటిని. ఆయన నందమూరులో శివాలయ నిర్మాణము గావించిరి. అనగా కాశీనుండి శివలింగమును తెచ్చి ప్రతిష్ఠించినారు. కనుకనే కల్పవృక్ష గ్రంథావతారికలో తండ్రినిగూర్చి విశ్వనాథ వారిట్లు వ్రాసినారు.

> అ నా తండ్రియునన్ దధీచి శిబి కర్ణాదుల్ పునారూప సం
> స్థానంబందిన కర్మయోగి సిత చంద్రప్రౌఢ కాంతిచ్ఛటా
> స్నానంబాడిన స్వచ్ఛలింగము యునిన్ సాధించి మానందమూర్
> లోనన్ నిల్పిన భక్తరాజు సుజన శ్లోకుండుదారుండొగిన్

శ్రీ మద్రామాయణ కల్పవృక్షము — అవతారిక ప.8.

శివాలయ నిర్మాణ సందర్భమున శిఖర సంప్రోక్షణమును గూర్చి విశ్వనాథ వారి మాటలు వినదగ్గవి.

"శివాలయ నిర్మాణము జరిగినది. మొదటి ధర్మకర్త మా

తండ్రి. విమానము మీద శిఖరమును పెట్టవలయును. అది యిత్తడితో చేసిన కిరీటము వలెనుండి పైన త్రిశూలాకృతి. దానికి పీటల మీద కూర్చుండి యంకురార్పణజేసి ప్రతిష్ఠించవలెను. ఆ పని చేసిన వారు తరువాత చాల కాలము బ్రతుకరట. కనుక నా సంప్రోక్షణ వృద్ధులచేత చేయింతురు. మా అమ్మగారి తల్లిదండ్రులున్నారు. వారిద్దరు చాల వృద్ధులు...... ఈ శిఖర సంప్రోక్షణము ఈ మా తాతయ్య అమ్మమ్మల చేత మా నాయనగారు చేయించిరి. వారిద్దరు నేడాది తిరుగకముందే చనిపోయిరి. మాకు విశ్వేశ్వర స్వామి కులదైవత మైనాడు. 'మా స్వామి' యన్న పేరుతో నేను విశ్వేశ్వర శతకమును వ్రాసితిని."

ఈ విశ్వేశ్వర స్వామిపై విశ్వనాథవారికి విపరీతమైన భక్తి. అందుచేతనే ఆ స్వామివారిపై అనేక పద్యములు వ్రాసిరి. వాటిలో మధ్యాక్కరలతో నున్న 'మా స్వామి' అను శతకమొకటి. కల్ప వృక్షము-ఆ స్వామికే అంకితమీయబడినది. కల్పవృక్షమందలి ప్రతి ఖండాంతమునందును విశ్వనాథ ఈ స్వామినే స్తుతించినారు. "నందమూరున నన్నపూర్ణా సనాథుడై యేలికొను విశ్వనాథ శివుడ"ని వ్రాసికొన్న సందర్భములున్నవి.

ఆ స్వామి వారిపై నెంత భక్తి విశ్వాసములున్నవో చెప్పుటకు ఈ క్రింది వారి వాక్యములే ప్రమాణములు.

"మా స్వామి వారి పేరు విశ్వేశ్వరస్వామి, విష్ణ్వాలయములో నున్న స్వామి వేణుగోపాలస్వామి, మా ఇద్దరు స్వాములు నన్ను పెంచినారు; పెద్దవారిని చేసినవారు; నా దారిద్ర్యములో నన్నాదుకొన్నవారు; నన్ను బాగుచేసినవారు, నాకు సర్వజ్ఞానము కుదిర్చినవారు, నాలో కవితాభావమును నింపినవారు."

విశ్వనాథ కవితావైభవము. పే. 50

ప్రస్తుతాంశమైన 'విశ్వేశ్వర' మకుటముతోనున్న ఈ 'మా స్వామి' శతకము విశ్వనాథనారు 1925 లో వ్రాసినారు. అప్పటి కాయనకు ముప్పదేండ్లు. మనస్సునకు ఏదో వెట్టపుట్టగా వ్రాసిన గ్రంథమిది. ఈ వేడిమి, వయస్సులో నున్న వాడిమి గ్రంథమందలి ప్రత్యక్షరములోను అహమహమికతో ప్రత్యక్షమగుచున్నవి.

## పండితుల ప్రశంసలు :-

నిజానికి ఆధునిక కాలములో వెలువడిన ఉత్తమమైన శతకముల సంఖ్య ఎక్కువలేదు. ఆ వెలువడిన వాటిలో మేటియైనది. 'మా స్వామి' శతకము. శతకములు సాధారణముగా స్వానుభవమును పండించుకొని అనుభూతి పరముగా వెలువడి నప్పటికిని నిందు జీవుని జీవన వేదనా తీవ్రత ప్రధాన స్థానమాక్రమించుట దీని ప్రత్యేకత. పూర్వ శతకములలో నెక్కువగా భక్తి శతకములందు పౌరాణిక వస్తువు చోటు చేసికొన్నది. 'మా స్వామి'యందు మాత్రము స్వీయానుభవము ప్రధానపాత్ర వహించినది. ఆధునికతకు. ప్రత్యేకతకు అది సంకేతము. ఈ విషయమును గమనించియే డా. శ్రీ పాదగోపాలకృష్ణమూర్తి గారిట్లనినారు.

"ఇది ఆధునికముగా ఎందుకని లెక్కించావూ అని అడిగితే, చెప్పే పద్ధతి మీదకంటె చెప్పే వస్తువు—అదన్నీ తమ అనుభవము మీదనే కవిగారు ఎక్కువ పూతము పెట్టి యుండటమువల్లనని జవాబు. దుష్కర ప్రాసలూ దీర్ఘ సమాసాలూ ఉన్న పద్యాలలోనూ కవిగారి వేదనా సూత్రము స్ఫుటంగా కనబడుతూంది. పౌరాణిక వస్తువును వాడి తద్వారా కూర్చిన గొప్ప ఉన్నప్పటికీ. పరిమాణంలో కవి స్వానుభవానికి చాలదు."

అర్ధ శతాబ్దపు ఆంధ్రకవిత్వము — శతకాలూ-ముక్తకాలూ

సంసార బాధా నివారణకోసము వ్రాయబడిన ఈ శతకము

నందు లోకపు కడగండ్లు చోటుచేసికొనకుండగా నుండవు. అట్టివాని ప్రాధాన్యమును బట్టి ఆధునికత ఆధారపడి యుండుననుట తేట తెల్లము.

ఇట్లీ ఈ శతకమును గూర్చి పలువురు ప్రశంసలు కురిపించిరి. వాటిలో కొన్నింటిని ఉటంకించుచుంటిని.

"భక్తుడు భగవంతునికి ఆత్మ వేదనాన్ని నివేదించుకుంటున్నట్లుంటుంది విశ్వనాథ శతక కవిత్వం. ఆవేదనలో అవస్థలు అనంతాలు"
డా. జి. వి. సుబ్రహ్మణ్యం. విశ్వనాథ కవితావైభవము- పే. 17

"మా స్వామిలో శ్రీ కాళహస్తీశ్వరస్వామియును,కాశీవిశ్వేశ్వర స్వామియు వచ్చి లీనమై యుండగా, ఆ పద్యముల మాధుర్యములో ధూర్జటి శ్రీనాథులు లీనమైయుండక యేమగుదురు!"
శ్రీ మల్లంపల్లి శరభయ్య-విశ్వనాథశారద-పే. 53

విశ్వనాథవారి కులదైవము విశ్వేశ్వరస్వామి. మా స్వామి అను పేర వీరిదివరకే విశ్వేశ్వర శతకమును రచించిరి. అందువారి అనుభూతులు "ధిషణాహంకారపు" ముసుగు దాల్చినవి. విశ్వనాథ వారు తమ ఇలువేలుపు విశ్వేశ్వరుని లీలా విశేషముల నతిప్రౌఢ రీతిలో వ్యక్తీకరించిరి."
డా. కే గోపాలకృష్ణరావు - ఆంధ్రశతక సాహిత్యవికాశము-పే.189

"శ్రీ విశ్వనాథవారి 'భక్తి రచన'లలో నిది అగ్రగణ్యమని కొందరి అభిప్రాయము. 'మధ్యాక్కరల' యందు శైలి ప్రసన్న మధురమై యుండగా, నీదలి శైలి జటిలమై, దీర్ఘ సమాసభూయిష్ఠమై శ్రీ విశ్వనాథవారి పాండిత్య ప్రకర్షకు నిదర్శనముగా నున్నది. అచ్చటచ్చట సరళత లేకపోలేదు ...... .... ఇట్లు ప్రసాదగుణ భాసురములైన పద్యములందు కొన్ని యెడల నున్నను, చాలవరకు ఓజో గుణమే యిందు ప్రాధాన్యము వహించుచున్నది.

విశ్వనాథవారు మహాకవులేకాదు. మహాభక్తులుకూడ. భక్తిభావ నిర్భరమగు వీరి కవితాస్రోతస్విని. యీ శతకమున పొంగిపొరలు చున్నది."

శ్రీ కాకర్ల వెంకటరామనరసింహం-ఆధునికాంధ్ర కవితాసమీక్ష-పే.380

'నందమూరు' లో ఉన్న శివుణ్ణి ఉద్దేశించి 'విశ్వేశ్వరా' అనే మకుటంతో వారు రచించిన 'మా స్వామి' లో ఉన్న పద్యాలన్నీ ఆధ్యాత్మిక తత్త్వ ప్రదర్శకాలే!"

డా. శివలెంక ప్రకాశరావు-భావకవులు-ప్రతిభావిస్ఫూర్తి.

"జాతీయ కళాశాలలో నుద్యోగించునప్పుడు కలిగిన కలతలను తొలగించుటకై విశ్వనాథవారు తమ యిలవేల్పు విశ్వేశ్వర స్వామిని గూర్చి కావించిన ప్రార్థన విశ్వేశ్వర శతకమై జాలు వారినది. భావములలో, శయ్యాసౌష్ఠవములో, భక్తిభావ ప్రకటనలో ఈ శతకము సాటిలేనిది............ ఈ శతకము నందలి పద్య మొక్కొక్కటి యొక్కొక్క రత్నము. వాని నుపహారముగా పొందిన స్వామి యందలి యుజ్వల భావరోచిత సౌందర్యమున కెంతగా మురిసి పోయెనో!" డా. దివాకర్ల వేంకటావధాని-ప్రతిభాలహరి. పే-88

ఈ ప్రశంసల యందలి యాథార్థ్యమును బరిశీలించుట ప్రస్తుత కర్తవ్యము.

## ప్రార్థన పద్యములు :-

శ్రీ మంజూషిక, భక్తరక్షణ కళా శ్రీ చుంచు, వానంద వ
ల్లీ మంజుప్రసవంబు, చిద్గగన ప్రాలేయాంశువున్, మోక్షల
క్ష్మీ మాణిక్య వినూత్న మేఖల, కటాక్షీభూత నీహారరుక్
శ్రీమంతంబయి పొల్చు వెల్గునొకడే సేవింతు విశ్వేశ్వరా!

కైలాసాచల సానువాసము, వృషస్కంధాగ్ర సంస్థాయి, త
త్ప్రాలేయాచల కన్యకా కుచతటీ పర్యంక నిద్రాగతం.
బాలోలాగ్ర జటావనీ ఘటిత నాకౌక స్సరిత్కంబు, దే
హాలంకారిత లేలిహానము, వెలుంగర్చింతు విశ్వేశ్వరా!

ప్రారంభమునగల ఈ పద్యద్వయమునకు ఒక ప్రత్యేకత యున్నది. అది విశ్వనాథవారి కవితాంభోనిధినుండి ఉద్భవించిన శ్రీ మద్రామాయణ కల్పవృక్షమునకు అవతారికా ప్రారంభమున జేర్పబడుట

ఈ రెండు పద్యములందును వెలుంగును సేవించుట, అర్చించుట జరిగినది.

భగవంతుడు తేజో రూపుడు గనుక 'వెలుగు' పదముతో నిర్దేశించుట జరిగినది.

ఉపనిషత్ ప్రతిపాద్యమైన వెలుగు త్రిమూర్తుల కతీతమైనది. మొదటి పద్యమున అద్వయమైన ఆత్మ యొక్క వెలుగును వర్ణించుట జరిగినది. రెండవపద్యమున శివుని తేజము వర్ణింపబడినది. కనుకనే మొదటి దానిని సేవింతుననియు, రెండవదానిని అర్చింతుననియు ననినారు. మొత్తముమీద రెండిటి ఫలితము మోక్షము.

"చిద్గగన ప్రాలేయాంశువున్" అనుసమాసమున 'న' గురువు-అగు నని కొందరు పండితులు పత్రికలలో తెగ గోలపెట్టినారు. నిజానికి రేఫతో కూడిన సంయుక్తమునకు ముందున్న అక్షరము అవసరమును బట్టి గురువగును. దీనికుదాహరణముగా 'ఎర్రన్న రచించిన భారతారణ్యపర్వమున 'గాండీవ' పవన ప్రేరిత' అను కంద పద్యమున 'ప్రే' అను దానికి ముందున్న 'న' గురువు కాక పోవుటను పేర్కొనవచ్చును. ఇవి రెండును ఒకే రకమగు ప్రయోగములు. ఎర్రన్నగారి కన్న ప్రామాణికులెవరు?

రెండవ పద్యమున ఈశ్వరుని గుణ రూపాది విశేషములు వెల్గునకు విశేషణములుగా వాడబడినవి. కైలాసవాసుడు, నంది వాహనుడు, లేలిహాన భూషణుడు (నాగభూషణుడు) మొదలగునవి. కనుక శివుని తేజమే వెలుగనుట స్పష్టము.

అసలైన చిక్కు మొదటి పద్యమునందే ఉన్నది.

మొదటి పద్యమున ఆత్మయొక్క వెలుగు వర్ణింపబడినదని వాకొంటిని. ఆత్మయనగా విశ్వాత్మయొక్క వెలుగు. దీనికి పద్యమునగల శ్రీ మంజూషిక. శ్రీ చుంచువు. ప్రసవంబు. ప్రాలేయాంశువు. మేఖల. శ్రీమంతంబు — ఈ ఆరును విశేషణములు.

శ్రీ మంజూషిక - శ్రీకి మంజూషిక (పెట్టె)

భక్త రక్షణ కళాశ్రీచుంచువు - భక్తులను రక్షించుటను కళా సంపదచే ప్రసిద్ధుడు.

ఆనంద వల్లీ మంజుప్రసవంబు - ఆనందమనెడు తీగయొక్క మనోహరమైన పుష్పము. లేక ఆనందవల్లి యనునది వేదమునకు సంబంధించినదిగా అన్వయించుకొనవచ్చును.

ఈ మొదలగువన్నియు విశ్వాత్మకు విశేషణములు. అవి విశ్వాత్మకు విశేషణములని నీవెట్లు చెప్పుచుంటివని నన్నడుగవచ్చును! దానికి సమాధానమిది.

ఈ విషయమును విశ్వనాథవారే స్పష్టపరచిరి. ఆ పద్యమిది.

శ్రీ వాణీ గిరిజాధినాథుల జగత్థ్సిత్యుద్భవాంత క్రియా
ప్రావీణ్యాత్ముల దత్తదాచరణ భారంబూనగా జేసి నా
నా విశ్వంబు లనంతగోళము లనంతాకాశ సంభ్రాంతముల్
గా విశ్వాత్మ! త్వదాత్మనీనములుగా గావింతు విశ్వేశ్వరా!

మనకీ పద్యము చదివిన వెనువెంటనే నన్నయ భట్టారకుని మంగళశ్లోకము గుర్తునకు రాకమానదు. ఆ శ్లోకములో బ్రహ్మ విష్ణు మహేశ్వరులు శ్రీ వాణీ గిరిజలను వక్షోముఖాంగములందు ధరించి లోక సృష్టి స్థితి లయములను అవిహతముగా గావించు చున్నట్లు చెప్పబడినది. 'విశ్వనాథ' అంతటితో సూరకుండలేదు. తన యిష్టదైవమును విశ్వాత్మగా అనగా పరమాత్మ – పరబ్రహ్మముగా చెప్పి అతడే త్రిమూర్తులను తత్ తత్ కార్యనిర్వహణమునకు నియమించినట్లు చెప్పి పరిపూర్ణతను నిరూపించినారు. త్రిమూర్తులు తత్తదేకైక కార్యనిర్వాహకులనియు, పరిమితిగలవారనియు వివరించుట జరిగినది. సర్వజగత్తులు, అనంతానంత నక్షత్రగ్రహతారకావళులు వాని వాని కక్ష్యలలో పరిభ్రమించునట్లు చేసితివి. అవి యన్నియు నీ ఆత్మ పరిధిలో నీ దివ్య చైతన్య స్ఫూర్తితోనే తిరుగుచున్నవని తెలిపినారు. ఆ విధముగా తన విశ్వేశ్వరుని అనాదిమత్త్వమును నిరూపించినారు. బ్రహ్మవిష్ణు రుద్రులకు గూడ ప్రళయమున్న దని మన సంప్రదాయము చెప్పుచున్నది. మరి విశ్వాత్ముడో! త్రిమూర్తులకు కార్య నిర్దేశము చేయువాడు. షడ్భావ వికారదూరుడు.

అట్టి విశ్వాత్ముడు జ్యోతి స్వరూపుడు. మానవ హృదయాంతరాళములందు ప్రకాశించు చుండునది ఆదివ్య తేజస్సే. అది తెలిసికొనుటకు విశ్వాసముతో కూడిన నిర్మలినమైన హృదయ మవసరము. ఆ వెలుగు నారాధించినారు విశ్వనాథనారు.

మన పూర్వకవులలో వెలుగు నారాధించిన వారు లేకపోలేదు.

'భర్తృహరి' 'సుభాషిత రత్నావళి'యను తన గ్రంథ ప్రారంభమున 'తేజస్సు' నర్చించినాడు.

దిక్కాలాద్యన వచ్ఛిన్నానన్త చిన్మాత్ర మూర్తయే,
స్వానుభూత్యేకమానాయ నమః శాన్తాయ తేజసే.

దేశకాలాది పరిమితిలేక జ్ఞానమాత్ర స్వరూపమై అనుభవము చేతనే ఎరుంగదగినదై శాంతమయిన తేజస్సునకు నమస్కారము.

నాగవర్మ తన 'కర్ణాటక భాషాభూషణమున' ఇట్లనినాడు.

"సర్వజ్ఞం తదహం వందే పరంజ్యోతి స్తమోపహమ్"

ధూర్జటి కాళహస్తులకు జ్యోతిలో సాయుజ్యం బొనగూర్ప జేసినాడు.

"తన సర్వవ్యాపక జ్యోతిలో. సాయుజ్యం బొనగూర్చె"

155 ప. ద్వి. ఆ. శ్రీ కాళహస్తి మాహాత్మ్యము.

భూమ్యాకాశాదులేర్పడని సృష్టికి పూర్వమొక్క ప్రకాశమే ఉండెడిదని పూర్వికుల తలంపు. ఆ ప్రకాశమునే వారు పరబ్రహ్మ మనినారు.

భగవద్రూప లీలాభివర్ణనము:-

నామ రూపాతీతుడయిన భగవంతునికి రూపకల్పన గావించి భక్తుడు ధ్యానించుచుండును. ఇది సాధనదశ. నిజానకు ఆ పరమాత్ముడు రూప గుణాతీతుడయినప్పటికి భక్తుని వైయక్తిక మానసిక స్థితికి అనుకూలముగా అనేక విధముల వ్యక్తీకరింపబడినాడు. దీని కారణముగా అమేయుడు.అప్రమేయుడైన అతని దివ్యాంశ త్రిమూర్తులు మొదలగు రూపములలో నావిష్కరింపబడినది. ఈ అనంతములైన రూపములననుసరించి నామగుణములు కూడ అనంతములైనవి.

శతకములందు భగవంతుని నామగుణ కీర్తనము గావించునట్లే కవులు రూపలీలాభి వర్ణనము నొనర్చిరి. శతకకవులు తమ శక్త్యనుసారము భగవంతునిరూపమును తమ మత సిద్ధాంతముల ననుసరించి పాఠకులకు కన్నుల గట్టినట్లు వర్ణించిరి. అట్లే ఆ పరమాత్ముని లీలలను గూడ తమ ఉక్తివైచిత్రిని ననుసరించి వ్యక్త మొనర్చిరి.

భక్తవశంకరుడైన శంకరుని విశ్వనాథవారు గుణకీర్తనము గావించిన పద్యమిది.

శ్రీ నీహార నగాధిరాజ తనయా స్నిగ్ధాననాంభోజ ని
త్యానందైక పరుండు, గాంగఝుర నిత్యస్నాత, రాకా నిశా
సూనాంగీశ శిరో విభూషణు డటంచున్ నిన్నుధ్యానించు భ
క్తానీకంబుల పైపయిన్ గరుణరాదా నీకు విశ్వేశ్వరా!

నీహార నగాధిరాజు-హిమవంతుడు. అతని కుమార్తె-పార్వతి ఆమె ముఖాంభోజ నిత్యానందైకపరుడు — శివుడు. ఆయన గాంగఝుర నిత్యస్నాత. గంగానదియందు నిత్యము స్నాన మొనరించు వాడనగా శివుడు తన జటాజూటమున గంగ నిముడ్చు కొనినవాడు. ఆ జటాజూటమునందే చంద్రుని ధరించినవాడు.

విశ్వనాథవారు శివుని రూపాభివర్ణనము జేయుటలో ఒక్కొక్క పద్యమున నొక్కొక్క సంఘటన దీపించు నొక్కొక్క వేసమును చక్కగా వర్ణించిరి.

ఆ వేషముతో శివుడు మన కెదురుగా నడయాడుచున్నట్లు ఉండును.

తలపై జాబిలి నెమ్మిపించియము వేదశ్వానముల్ ముందు న
మ్ములనున్ ముమ్మొనవింటి బద్దయు గరాంభోజాత యుగ్మంబునన్
మలరా కూతురు బోయసాని వెనువెంటన్ రాగ మాయామృగ
మ్ముల వేటాడు పుళిందరాజు నిను సంపూజితు విశ్వేశ్వరా!

ఈ పుళిందరాజు కిరాతార్జునీయములోని వాడుగా గన్పట్టు చున్నాడు. హరవిలాసములో శ్రీనాథుడు కిరాతుని వెంటవచ్చు కుక్కలను వేదమయమూర్తులుగా పేర్కొనినాడు. అంతేగాక వాటి అరుపులను వేదస్వరములైన ఉదాత్త, అనుదాత్త, స్వరిత స్వరములతో పోల్చుట జరిగినది.

కనుకనే విశ్వనాథవారు వేదశ్వానములనినారు. శివుడు పుళింద రాజు కాగా మలరా కూతురైన పార్వతి బోయసాని యైనది.

ఈ పద్యమున కిరాతవేషమున శివుడు కన్పింపగా, తరువాతి పద్యమున నటరాజు దర్శనమును కలిగించినారు.

చలి మిన్నేటి కెలంకులందు సొగసుం జాబిల్లి పూరేక వం
కలు పింగారముగా నమర్చి చెవులన్ గంపింపగా బాప పో
గులు మేనన్ బులితోలుపై చుకొని కొంగుల్ జార బేర్మింపుజూ
పుల సంధ్యాసతి జూచు నీ సొగసు మమ్మున్ బ్రోచు విశ్వేశ్వరా!

గంగానది. చంద్రవంక. పాములు. పులితోలు వీటి యన్నింటిని ధరించియున్న శివుడు-సంధ్యాసతిని జూచు సొగసు

సంధ్యా సమయమును సూచించుటయే తాండవ శివుని జూపించుట. పాప పోగులు చెవులన్ గంపించుట. కొంగులు జారుట ఆ దృశ్యము లోనివే.

భగవంతుని దివ్యమంగళ స్వరూపమును పరి పరి విధముల భావించుట సాధన దశలోని భక్తునిస్థితి. తమ దైవముల అభిమాన రూపములను వర్ణించుకొనుట శతక కర్తల పద్ధతి.

మరియొక వేషమును వర్ణించు పద్యమిది. అది ఈశ్వరుని ఆది భిక్షుక వేషము.

కరి తోల్పుట్టము కొంగుతో బునుక భిక్షాపాత్ర చేబూని సం
స్కరణంబించుక లేమి మైజడలు మూగన్ బొట్ట పెల్లాకటన్
సురుగన్ ముమ్మొనశేకరత్రితో దడుము కొంచున్ లచ్చిగేహంబు ముం
దర నిల్చున్ భవదీయ. భిక్షుకత కంతంబెప్డు విశ్వేశ్వరా!

శివుడాది భిక్షువు. బిచ్చగాని రూపము దరిద్రత మూర్తీభవించి నట్లుండును. లేనిచో నెవరును బిచ్చము పెట్టరు. ఆ విషయమును

శివుని సహజరూపమున కన్వయించునట్లు కవి సమర్థించుట చూడ వచ్చును. బిచ్చగాని కట్టు బట్టలు మాసి, తోళ్ళవలె నుండును. మఱి శివుడు గజచర్మాంబరధారి. బిచ్చగాని చేతిలో భిక్షాపాత్రముండును. శివుడు తన చేతితో బ్రహ్మపుర్రెనే పాత్రగా పట్టుకొన్నాడు. బిచ్చగాని జుట్టు పెరిగి తైల సంస్కారము లేక జడలుగట్టి ధూళి ధూసరితమై చెదరి యుండును. శివుడు జటాధారి. మహాయోగీశ్వరేశ్వరుడు కనుక అతని దృష్టి ఆత్మలగ్నమై జడలు పెరిగి యొడలిపై పడుచున్నది. బిచ్చగాని కడుపాకలితో నక నక లాడుచుండును. అట్లే శివుని ఆకలికూడ అపరిమితము, ప్రళయములో నెన్ని సారులు భూతములను కబళించినను దాని కంతము కనబడదు. బిచ్చగాడు చేయూతగా కర్రనానుకొనుచు నడచి కలవారి యింటి ముందు నిలిచి 'భవతి భిక్షాందేహి' యని బ్రతుకు వెళ్ళబుచ్చును. శివుడు షడ్గుణైశ్వర్యవంతురాలైన లక్ష్మి యింటిముందు నిల్చి బిచ్చమెత్తును అతడు ముమ్మొనవాలు (శూలము) చేత ధరించి యుండును. సత్త్వ రజ స్తమోగుణములను తన వశముందుంచుకొని వ్యవహరించును. కనుకనే కవి శివుని నీ భిక్షాటనమున కంతము లేదా యని ప్రశ్నించుచున్నాడు. మొత్తము మీద పద్యమున శివుని ఆది భిక్షుక రూపము సాక్షాత్కరించుచున్నది. అది ప్రతిభాధీనము. అట్టి ప్రతిభ విశ్వనాథవారికి అజానజము.

పరిహాసము:-

పై పద్యమునందు కొంత పరిహాసము లేకపోలేదు. అద్దాని ననుసరించియే ఇంకను పరిహసించుట చూడవచ్చును.

ఓ సామీ! అలకొండ కోయెతకు నీయొయ్యారమో బూది పూ
తే సర్వంబయి నీకు నాయమ సొబంగే నచ్చి కన్నారుత
య్యా! సంతానము. నేన్గుమోమొకడు వింతౌ నార్మొగాలొక్కడో
హో! సౌరాపద కాకయుండొకడదేమో కాని విశ్వేశ్వరా!

ఈ పద్యములో కవి 'ఓ హో హో! ఈశ్వరా! నీ సంసారమే వర్ణింపదగినది నీవేమో బూడిద బుస్సన్నవు. కొండలలో తిరుగు కోయపడతికి (పార్వతికి) నీ అందమే నచ్చి నిన్ను పెండ్లాడినది. నీకేమో ఆ కొండపడతి అందమే నచ్చినది సంతానము కూడ మీకు తగినట్టిదే కలిగినది, ఏనుగు మొగమువాడు (వినాయకుడు) మొదటివాడు. రెండవవాడేమో ఆరు మొగాలవాడు (కుమారస్వామి) మూడవవాడో దేవతలను పీడించువాడు (వీరభద్రుడు) 'అని పరిహసించినాడు.

అర్జునునకు పాశుపతాస్త్రము ప్రసాదించు సందర్భమున పార్వతీ పరమేశ్వరులు శబరరూపము ధరించినారు. అది దృష్టిలో పెట్టుకొనియే కవికొండకోయెతయని పార్వతి గూర్చి చెప్పినాడు. కోయలు కొండలలో తిరుగు ననాగరికులు. పార్వతి పర్వతరాజు కూతురు. పర్వతములలో అడవులలో తిరుగు ననాగరికురాలు పార్వతి. నాగరికతాగంధము లేనిది. అట్టిది నీకు నచ్చి కోరి పెండ్లాడితివను చున్నాడు. అది నిజమే! పార్వతి అపర్ణయై చేసిన అసాధారణ తపస్సునకు శివుడు ప్రత్యక్షమై ("అద్యప్రభృత్యావనతాంగి" తవాస్మిదాసః, క్రీతః తపోభిరితి వాదిని చంద్రమౌళౌ) 'నీ తపస్సునకు క్రీతుడనై పోయితి' నని కోరి పెండ్లాడినాడు. మరి పార్వతియో: మహా మహా దేవతల నందరిని కాదని శివునినే భర్తగా పొందవలెనని దారుణమైన తపస్సు చేసినది. వటురూపమున శివుడు వచ్చి పార్వతి మనస్సు పరీక్షించి, ఆమె అనన్య ప్రేమకు ముగ్ధుడై వివాహమాడి నాడు. అందుచే కవి, యే హాస్యధోరణిలో నన్నను పార్వతీ పరమేశ్వరుల దాంపత్యమున కదియేసాటి. గజానన మున్నను గణపతి ఆది పూజ్యుడు. కుమారస్వామి ఆరు మొగాల వాడైనను తారకాసుర సంహారగ మొనర్చి లోకశ్రేయస్సు కలిగించినాడు. ఇక వీరభద్రుడు 'శివారాధనము లేని యెంతటి యజ్ఞమైనను దాని నెంతటి దక్షుడు నిర్వహించినను అది నింద్యమే; అట్టి దాని కామో

దించినవారు, దర్శించినవారు దండ్యులే' యని యజ్ఞధ్వంసముచే దేవతల శిక్షచే నిరూపించినాడు.

మరియు నింతకన్నను పరిహాస విషయిమింకొకటి
నీవో యౌవనమూర్తివౌదు వసురానీకంబు మర్దించు శి
క్షా పైశద్యము పొల్చు నీ తనువు నీశా! అన్నపూర్ణాంబికా
దేవింజూచిన వృద్ధవోలె మదికిన్ దీపించు దాంపత్య మీ
భావం బెవ్వడెరుంగుశైల తనయా ప్రాణేశ! విశ్వేశ్వరా!

ఓ యీశ్వరా! రాక్షసులతో యుద్ధము చేసి చంపగల్గిన నీ శరీరమునకు అందుకు దగిన దృఢత్వము గలదు. లేనిచో రక్కసి మూకలతో యుద్ధములకు సిద్ధపడవు. మరి అన్నపూర్ణా దేవిని జూచిన పెద్దముత్తైదువుగా తోచును. మీ దాంపత్య రహస్యము మీకే తెలియును. ఇతరుల కవిదితము గదా యని కవిగారి డెకారింపు.

పార్వతీ పరమేశ్వరులాది దంపతులన్న భావము దృష్టిలో పెట్టుకొని యిట్లనుట. తరుణత్వ వృద్ధత్వములు కేవలము దేహభావ ములే. మరి వారో దానికి (దేహభావమునకు) అతీతులు. అయా సందర్భములను బట్టి ఆయా రూపములను దాల్చుచుందురని చెప్పుటయే కవి ఆశయముగా మనము భావించవచ్చును.

ఆ శివునిని ఇంత పరిహాసము చేసిన కవిగారికి హృదయము లలో జంకేర్పడినది. అది కారణముగా దానిని ఆ భగవంతుడు సైరించునని కవి అతని తోడనే మొరపెట్టుకొనుచున్నాడు.

ఓ సామీ!అది యేమి పాపమొకదా యూహించి యూహించి నీ
తో సయ్యాటము లాడెదన్ గృపణబంధూ! యెట్లొ సైరింతు వీ
దోసంబానిగ మాధ్యమొందుపనిషల్లో లాయతాక్షీ వరీ
హాసశ్రీ గను నీకు మత్కృతపరీహాసంబు విశ్వేశ్వరా!

దీన బంధువైన ఆ విశ్వేశ్వరుడు తన నయ్యాటమును సహింపగలడట. ఇట్టి నయ్యాటము లెన్నింటినో వేదములందు ఉపనిషత్తులందు చూచినవాడాయున. కనుక పాపమని, దోసమని తెలిసికూడ నయ్యాటము లాడిన కవిగారిని సహించును.

మండూక సూక్తమునందు, అథర్వవేదమునందలి కుంతాప సూక్తమునందు. శతపథబ్రాహ్మణమునందలి అధ్వర్యు సోమవల్లుల సంవాదమునందు. ఐతరేయ బ్రాహ్మణమునందలి హరిశ్చంద్ర వరుణుల సంవాదమునందు అధిక్షేపచ్ఛాయలు గోచరించుచున్నవి.

ఆ అధిక్షేపములను దృష్టిలోనుంచుకొనియే విశ్వనాథవారు వేదముల, ఉపనిషత్తుల ప్రస్తావన దెచ్చినారు.

శ్రీ కానుకొలను త్రివిక్రమరావుగారివద్ద వేదాంత ప్రకరణమును పఠించిన విశ్వనాథవారికి ఇవి యన్నియు కరతలామలకములు.

అధిక్షేపించుట తప్పని తెలిసికొని, ఇపుడు సర్వము నీవేయని ప్రార్థేయపడుచున్నారు కవిగారు.

ఇది మొదట జుట్టు పట్టుకొని తరువాత కాళ్ళబేరమునకు వచ్చుట వంటిది.

నామగుణ కీర్తనము:

అంతావ్యర్థము వట్టియాశ. పెనుమాయావల్లి. దివ్యంబు సీ
మంతిన్యర్థము నీదుమూర్తియొకడే మా తండ్రి! నిక్కంబు నా
కింతా తోచియు నీ మహార్థమెపుడేనీ రూఢికాలేదు శా
మంతీ కుట్మల వత్సుధాకర శిరోమాణిక్య! విశ్వేశ్వరా!

ఈ పద్యము చదివిన వెంటనే "అంతా మిథ్యతలంచిచూచిన" అను ధూర్జటి కాళహస్తీశ్వర శతకపద్యము గుర్తుకురాక మానదు.

'బ్రహ్మసత్యం జగన్మిథ్యా' అని చెప్పదలచుకొన్నాడు కవి. ప్రపంచ మాభాస మాత్రమే. లేని దున్నట్లనిపించుటయే ఆభాసము. జగత్తు ననుసరించుట యెండమావుల నీరు త్రాగవెంచుటయే. అందుచేతనే వ్యర్థమనుచున్నాడు. అది మాయావల్లి. మొదలు కనిపెట్టి అది త్రుంచిననే కాని కొనలు సాగుట మానదు. అట్లే ప్రకృతిగూడ. దాని మూలము తెలిసికొని జ్ఞాన మలవర్చుకొననిదే అభాసమడగి బ్రహ్మ భావన పట్టువడదు. అర్ధనారీశ్వరమైన నీ మూర్తియే సత్యము. ప్రకృతి పురుషునాధార మొనర్చుకొనియే సృష్టి స్థితి లయము లొనర్చుచున్నట్లు తెలియుచున్నది. ఈ విషయమింతయు కవికి శాస్త్రప్రమాణములవలన పెద్దల అనుభవమును బట్టియు తెలిసినది. కాని, యవి చాలదు. స్ఫుటమైన స్వానుభవము కావలయును. అది అంతంతగా తోచీతోచనట్లు ఉన్నది. 'బ్రహ్మవిత్ బ్రహ్మైవభవతి' అన్న నిరంతరానుభవము కలుగుటయే పరమార్థము. 'శామంతీ కుట్మల వత్సుధాకర శిరోమాణిక్య' అన్న సంబోధన మత్యంత మనోజ్ఞ మధురము. చేమంతి మొగ్గవలెనున్న చంద్రుడు మూర్ధాలంకారముగా కలవాడా! అని మనసు తీర సంబోధించుచున్నాడు కవి.

శివుని పరిహాసమొనర్చిన కవి తరువాత పద్యములందు నామ గుణ కీర్తనము గావించుట కుపక్రమించినాడు. పశ్చాత్తాపము దానికి కారణము. హృదయములోని భీతి ఇట్లొనరింపజేసినది.

పరమ భక్తాగ్రగణ్యమైన పోతన-శిశుపాలుడు, రుక్మి మొదలగు వారి నిందావాక్యములనగా భగవంతుని పై నిందాస్ఫోరక పద్యములను వ్రాయునపుడు వ్యాజస్తుతిని, వ్యంగ్యవైభవము నాశ్రయించుట జరిగినది. కాసుల పురుషోత్తమ కవికూడ నిదే మార్గము నాశ్రయించెను.

కాని విశ్వనాథ పాత్రల ముఖమునగాక తానే స్వయముగా భగవంతుని పరిహసించిన కారణముగా నామగుణ కీర్తనమునకు

బూనుకొనినారు. ఈ నామస్తుత్యాదులు కవి భక్తి పారవశ్యమునకు పట్టుగొమ్మలు. ఇట్టివి మన శతకకారులు శతకారంభమునందు గావించిరి. ఈ కీర్తనములందు భగవంతుని కల్పిత దివ్యరూపము కనిపించుచుండును. ఇందలి శబ్దార్థ స్వరూపము వ్యక్తావ్యక్తముగా నున్నప్పటికిని పాఠకుని నురాగ్రస లూగించును.

నీ విజ్ఞానము చిత్రమే మకుట రత్నీభూత జైవాతృకా!
గ్రైవేయీకృత కాద్రవేయ! గళ రుద్రాక్షీ భవద్బాడబా!
సేవాస్వీకృత భూత రాక్షస పిశాచీప్రేత! నేత్రప్రభా
శ్రీ విన్యస్తకృశాను! పార్వతి మృగాక్షీదార! విశ్వేశ్వరా!

నైశాటప్రాణ మరుణ్మహా భుజగ వంశస్వామి!, దిగ్వ్యోమాఖిల పూర్ణ! సుధారుగ్వ్యబద్ధ కిరీట! అంహోవారణ కుంభపాటన కళోద్యచ్ఛ్వేత భూభృద్దరీ సింహస్వామి! మోక్ష యువతీ సంఫుల్ల పీనస్తనాగ్రం ప్రాణాక్షర లేఖనా చతుర హస్తాంభోజ! మొదలగునవి.

తనకు భక్త్యావేశ మొసంగుమని కవి ప్రార్థించుట అంతకు ముందది లేదని వెల్లడి యగుచున్నది. భక్త్యావేశము లేదు కనుకనే భగవంతుని మహార్థము గూడి కాలేదు. కనుకనే ఎగతాళి గావించుటకు పూనుకొనినాడు. తరువాత పశ్చాత్తాపపడి నిండైన భక్తిని నొసంగు మనుచున్న పద్యమిది.

గండూషించిన నీటిస్నాన మొసగంగా, సల్లకీశాఖలన్
దుండానన్ గొనితెచ్చి పూజలిడగా, ద్యుత్యన్న తంబుల్ ఫణా
దండంబందున దెచ్చి రత్నములు పాదద్వంద్వమున్ జేర్పగా
నిండారన్ బెను భక్తి కబ్బిగతి బొంగేరాదు విశ్వేశ్వరా!

ఇందు కాళము-హస్తి కథ సంక్షిప్తమై యున్నది. కవిగారి దృష్టిలో వాటియొక్క భక్తి సముద్రపు పొంగువంటిది. ఆ గొప్ప భక్తిని తనకు ప్రసాదించమని కవిగారి ప్రార్థన.

ఏనుగు తన తొండమున తెచ్చిన నీటిచే స్నానము చేయించి తినుటకు ప్రియమైన సల్లకీ పత్రములచే శివలింగమునకు పూజ యొనర్చినది. పుక్కిలించిన నీటిచే శివలింగమును స్నానము చేయించుట అనగా కడుగుట దోషమను భావమేనుగునకు లేదు. అది నిండైన భక్తి. ఆ భక్తిలో కల్మషము లేదు. అంతే కాదు; తన కిష్టమైన అందుకు చిగుళ్ళు కలిగిన శాఖలతో పూజించుటకు గొప్ప భక్తియే కారణము.

ఇక పాము తన ఫణమందున గల రత్నములతో పూజించుట త్యాగముతో కూడికొన్న భక్తి. పాము పడగయందు రత్నములుండు నను నది లోక ప్రతీతి. అవి తీయుటకు పడగ పై భాగమునగల చర్మమును కొంత తొలగించవలసి యుండును. ఈ కష్టమున కోర్చి రత్నములతో పూజ చేయుట సామాన్య విషయము కాదు.

కనుకనే విశ్వనాథవారు గొప్ప భక్తియని వక్కాణించినారు.

శంకరుని వెటకార మాడిన విశ్వనాథవారికి వైక్లబ్యము సంభవించినది. అది కారణముగా వారి హృదయమున భావశబలత చోటు చేసికొన్నది. అందుచేతనే భక్త్యావేశ మొసంగమని యొకసారి సముద్రపు పొంగువంటి భక్తి లేదని మరియొకసారి. సద్యైక్యం బిమ్మని ఇంకొకసారి పరి పరి విధముల కవిగారు ప్రార్థించుచున్నారు.

స్వఃపూర్గోపుర శాతకుంభ శిఖర స్వచ్ఛప్రభల్, పాటితై
నః పాండిత్య ధురాంధరాఖిల సురానంతాధ్వ ఘూసచ్ఛటల్
నిః పర్యాప్త సుఖాలు కోరుటకు పోనేపోదు నీ దివ్య స
ద్యః పాతంగత చిన్మయాకృతి సద్యైక్యంబిమ్ము, విశ్వేశ్వరా!

ఆయనకు స్వర్గమవసరములేదు. పాపాలు పోగొట్టమని కాదాయన కోరుకొనేది. ముగింపులేని సుఖాలసలే అవసరములేదు. ఆయనకు కావలసినది ఆ భగవంతుని దివ్య చిన్మయాకృతి సద్యైక్యము.

నిజమే: స్వర్గసుఖాలు శాశ్వతముకాదు. చేసికొన్న పుణ్యమును బట్టి అచ్చటి నివాసము. ఆ తరువాత వెనుకకు రావలసినదే యని భగవద్గీత వక్కాణ

తేతం భుక్త్వా స్వర్గలోకం విశాలం
క్షీణే పుణ్యే మర్త్యలోకం విశన్తి అధ్యాయము - 9. శ్లో-21

వారు (స్వర్గ గమనమును కోరినవారు) విస్తీర్ణమగు స్వర్గ లోకమున భోగముల ననుభవించి భోగ కారణమగు పుణ్యము నశింపగా కర్మభూమియగు మనుష్య లోకమునకు వచ్చుచున్నారు.

అటువంటి సుఖభోగాలను విశ్వనాథవారు కోరుటలేదు. వారి దృష్టిలోనివి అసంపూర్ణములు. సంపూర్ణమైనది మోక్షము. అనగా ఆ దివ్య చిన్మయాకృతిలో ఐక్యమొందుట.

ఇంకను ఆ పరమ శివుని నిట్లు ప్రార్థించుచున్నారు.

అక్లిబద్వయమూర్తి! నీదు జటలయ్యః బాల పత్రావళుల్
శుక్ల ద్వాదశి చంద్రఖండము జటాజూటిన్ ప్రసూనంబు. ని
త్యాక్లాంతంబును బస్మవుప్పొడి. మధుస్యందంబు ద్యోగంగ. నా
యీ క్లేశంబు హరింప సౌరతరుమూర్తీ! చూడు. విశ్వేశ్వరా

ఆ శివు డక్లిబిద్వయమూర్తి. అనగా నపుంసకుడుకాని స్త్రీ పురుష రూపము కలవాడు. శబ్దసృష్టి అనగా నిది. తెలుగు కవులలో నెవరు శివుని నీ విధముగా సంబోధించునట్లు కానరాదు. ఇక్కడ ద్వయమూర్తి అనగా స్త్రీ పురుషుల రూపము. ఇట్టి రూపమును నపుంసకుడనుటకు తావున్నది. పూర్తిగా స్త్రీ రూపముగాని. పురుష రూపముగాని లేనివాడు నపుంసకుడు. 'నస్త్రీపుంసౌ అస్య' అనికదా వ్యుత్పత్తి. అందుచేతనే బహు చమత్కారముగా నపుంసకత్వము లేని స్త్రీ పురుషమూర్తి అనగా అర్ధనారీశ్వరుడను భావమును చక్కగా వ్యక్తము చేసినారు విశ్వనాథవారు.

విశ్వనాథవారికి విశ్వనాథుడు సౌరతరుమూర్తిగా భావించినాడు. అనగా కల్ప వృక్షము.

ఆ పరమేశ్వరుని జడలు లేతయాకుల తుట్టలు. ఇవి రెండును ఎరుపుగానే ఉండును. ఆ జటా జూటమున నున్న శుక్ల పక్షమున ద్వాదశినాటి చంద్రవంకయే పుష్పము. శరీర మంతటను నున్న భస్మము పుప్పొడి. జటాజూటమునందలి గంగయే మధువు.

ఇది విశ్వనాథ ఊహా వైభవమునకు మచ్చుతునక అనదగ్గది. శివుని వేషమును కల్ప వృక్షమునకు సమన్వయించుట ప్రశంసనీయము. కనుకనే శివుడు సౌరతరుమూర్తి యయినాడు. అందు చేతనే తన కష్టమును పొగొట్టుమని ప్రార్థించుచున్నాడు కవి.

## నందమూరుస్వామి

కాశీనుండి శివలింగమునుదెచ్చి నందమూరులో ప్రతిష్ఠించిన వారు శోభనాద్రి శాస్త్రిగారను విషయము ఇంతకుముందే ఆయా సందర్భములను బట్టి రెండు మూడు సారులు చెప్పబడినది. ఆ సంగతి నాధారముగా గొనికొని శోభనాద్రిగారి పుత్రులైన విశ్వనాథ వారు శివునితో తనకును, ఆయనకును గల సంబంధమును పరిగణించుచు లెక్కలు తేల్చుకొమ్మని పంకరు తనమును జూపించుచున్న ఘట్టమిది.

నిన్నున్ మజ్జనకుండు చూపిచనె గానీ నిన్ను బీడింపగా
నెన్నన్ గాస్తకు కూస్తకిప్పటికి నీవేదక్క దిక్కొండు లే
దన్నా! మొన్నటిదాక మౌనమది గర్వాధీనతన్ గాదు నీ
కన్నన్ వేరొకయండ యున్నదనియున్గాదయ్య విశ్వేశ్వరా!

నిన్ను చూపి నా తండ్రి పరమపదించినాడు. నీవు దక్క నాకు వేరే దిక్కులేదు. కనుక ఇప్పుడిక నిన్ను పీడించుట తప్పదు.

ఇంతవరకెందుకూరకుంటివని నన్ను నీవడగవచ్చును. దానికి కారణము గర్వముకాదు! నీకంటె వేరొక యండ ఉండియుకాదు - అని విశ్వనాథ నీవే తప్ప, నితః పరంబెరుగ'నని గజేంద్రుడు విష్ణుమూర్తికి మొరపెట్టుకొన్నయట్లు అన్యథా శరణం నాస్తియను భావమును వ్యక్తీకరించినారు. ఇది నిజమైన భక్తుని లక్షణము.

"నిన్నున్ మజ్జనకుండు చూపిచనె" అను వాక్యము చదువగానే భారతమున గల ఈ పద్యము గుర్తుకు రాకమానదు.

"ఆపద కడవం బెట్టగ
నోపి శుభంబైన దాని నొడగూర్చను మా
కీ పుట్టువునకు బాండు
క్ష్మాపాలుడు నిన్ను జూపిచనియె మహాత్మా!

ఇది శ్రీకృష్ణుని రాయబార సందర్భములోనిది. ధర్మరాజు శ్రీకృష్ణునితో ననిన మాటలు. తన తండ్రియైన పాండురాజు ఈ జన్మకు శ్రీకృష్ణుని జూపి చనినాడని ధర్మరాజు కథనము.

అదే విధముగా తనకు దిక్కుగా విశ్వేశ్వరుని జూపి తండ్రియైన శోభనాద్రిగారు గతించి నారనునది విశ్వనాథ వక్కాణ.

మరియు నిట్లనినారు

మా తాతల్ గడియించినాస్తి యొకయే మాత్రంబు మా తండ్రిపెన్
దాతృత్వంబున కాగలేదు, కవితాధమ్మిల్ల కల్హార సు
శ్రీ తావుల్, తిరిపెంబురాయడవు నీ సేవల్, ద్విధామార్గముల్
యాతాయాత నిరంతయాతనయు నాయాసంబు విశ్వేశ్వరా

శోభనాద్రిగారి దాతృత్వము చాల దొడ్డది. దానికొక ఉదాహరణమిది.

నందమూరునకు సుమారు పదిమైళ్ళ దూరమున తూర్పుగా

కొర్నిపాడు అను గ్రామమున్నది. ఆ యూరిలో అన్నోదకములకు లోటులేని ఆస్తిపరుడైన కూచిభొట్ల వంశీయుడొకరు తన కూతురును మనవిశ్వనాథ వారికీయవలెనని శోభనాద్రిగారి కడకురాగా తమ్ముని కొడుకు పెద్దవాడై యుండగా తన కొడుకునకు ముందుగా వివాహము చేయనని తిరస్కరించినారు. అయితే మా పిల్లను మీ తమ్ముని కుమారునకే ఇచ్చి పెండ్లి చేయుదుమనగా శోభనాద్రిగారంగీకరించిరి. ఆ వివాహము జరిగిపోయినది. అప్పుడు తమ్ముని కుమారుని మేనమామకిది అశనిపాతమైనది. ఆయన పేరు సీతారామశాస్త్రిగారు తెనాలివద్దగల కొల్లూరు నివాసి. వేదపండితుడు. వైశ్వదేవపరుడు, భిక్షాటన చేసికొనుచు బ్రతుకు చుండెడివాడు. శాస్త్రిగారు జన్మలో రై లెక్కలేదు అగ్నిహోత్రమును మానలేదు. భిక్షాటనచేయుట బ్రాహ్మణ వృత్తియని దానిని పరిత్యజించలేదు.

ఆ తరువాతి కథ విశ్వనాథవారి మాటలలోనిది.

"ఆయన మా నాయనగారిమీద ఒక అపనింద వేసెను. 'నేను భిక్షాటన చేయువాడను అని శోభనాద్రిగారు నా మేనల్లునికి నా కూతురునిచ్చు కొందమనుకొను చుండగా తాము సంపత్తు కలవారని నా సంబంధము వారి కమర్యాదహేతువని నన్న న్యాయముచేసి నా మేనల్లునకు వేరే సంబంధము చేసినాడు. అని బంధువులలో ఆయన చెప్పుట యారంభించెను. దానిని పలుచోట్ల మా నాయనగారు విన్నారు. ఈయన ఆయన వద్దకుపోయి 'ఓరి శాస్త్రులు! నాకా యూహలేదు. నీవు పేద వాడవని నీయందు నాకు తక్కువ చూపు లేదు. నీ కూతురును నా కొడుకునకు చేసికొందును.' అని చెప్పి-చెప్పుట యేమి లగ్నము పెట్టుటయేమి! యింటికి వచ్చుటయేమి! మేము పది పదేను బండ్లమీద తరలి వెళ్ళుటయేమి! వడ్లు దంపించి అయిదారు బస్తాల బియ్యముతో అయిదురోజుల పెళ్ళికి కావలసిన సర్వ వ్యయముతో క్రొత్త బట్టలతో వెళ్ళుటయేమి! పెండ్లి చేసికొని తిరిగి

వచ్చుటయేమి-మా నాయనగారు సదస్యమునాడు నూట యేబది చాపులు పండితులకు పంచిపెట్టెను. ఆ పెండ్లి, అదర్పము, ఆ దాతృత్వము చూచి అచ్చటి బ్రాహ్మణ్యమంతయు ఈ బియ్యపు శాస్త్రులుగారేమి! ఈ సంబంధమేమి!! అని యాశ్చర్యమును పొందిరట."

ఇది శోభనాద్రిగారి యౌదార్యము. ఇట్టి వ్యక్తి దాతృత్వమునకు ఎన్ని మడి మాన్యములైన నాగవు. ఈ దాతృత్వమనే శౌర్యాగ్నికింధనమై పోయిరట విశ్వనాథాది శోభనాద్రి పుత్రులు.

తన హస్తంబున బెల్లురేగిన మహాదాతృత్వ శౌర్యాగ్ని కిం
ధనమైపోయిన మమ్ము పుత్రకుల మా దారిద్ర్యమున్ జూచి యా
తని సేవింపుడటంచు జెప్పచనియెన్ మా తండ్రి బంగారుకొం
డను జేదాల్చిన నిన్ను జూపి. కనవా నామాట విశ్వేశ్వరా!

దారిద్ర్యముతో నున్న పుత్రులకు బంగారు కొండయైన మేరు పర్వతమును విల్లుగా దాల్చిన ఈశ్వరుని జూపి సేవింపుడని చెప్పి శోభనాద్రి గతింపగా లెక్కలు తేల్చుకో! అని ఒడలు మండి విశ్వనాథ పలికిన పద్యమిది.

మీ దాతృత్వమొ తండ్రి దాతృత్వమొ మీమీ మధ్య నున్నట్టి లా
వాదేవీలకు నాదు బాధ్యతకు సంబంధంబు లేదిట్టురా!
ఏదో లెక్కలు తేల్చుకో! మొరటుతో నేలా! యొడల్ మండెనా
ఏదో వచ్చిన కాడి కమ్మెదను సుమ్మీ నిన్ను. విశ్వేశ్వరా!

విశ్వనాథవారిని దారిద్ర్యము చిట్టచివరకు మొరటువానిగా జేసినది. గట్టిగా ఒడలు మండితే ఆయినకాడికమ్మి వేసెదనని తన భక్త్యావేశమును వెల్లడించినారు. ఇట్టివి దేవునిపై గాఢమైన నమ్మకమున్న వ్యక్తియే అనగలడు. ఆయన నిష్కల్మషమైన భక్తికిది పరాకాష్ఠ.

దీనిని గూర్చి మద్గురుతుల్యులు మధునాపంతుల వేంకట పరమయ్యగారు వ్రాసిన భావమిది.

"కవి ఇచట ఈశ్వరుని నిర్బంధించి యిట్లనుచున్నాడు! కాశిలో నున్న నిన్ను తీసికొనివచ్చి మా తండ్రి నందమూరులో ప్రతిష్ఠించి తలదాచు కొనుటకు నీ కవకాశము కల్గించినాడు. నీకై అతడేమేమి పెట్టినాడో? నీ వాతని కేమేమి యిచ్చినావో! నీవే బాకీపడి యుందువనిపించును. నాకు మీ లావాదేవీలతో (ఇచ్చి పుచ్చుకొను విషయములు) ఎట్టి సంబంధములేదు. వెంటనే వచ్చి లెక్కలు తేల్చు కొనుము. నేనసలే మోటువాడను వెనుకముందు లాలోచింపను. నీవు వ్యవహారము నాన్చినచో నిన్ను సంతలో నిలబెట్టి వచ్చినంతకే తెగ నమ్మి బాకీ జమ కట్టుకొందును! ఈ ధోరణి మనకెట్లనిపించును. ఎన్ని సార్లు అడిగినను బాకీ తీర్చని, వ్యవహారము పరిష్కారము చేయని వ్యక్తిని బెదిరించుట కనబడుటలేదా! ఏమో! అది భక్తునకు భగవంతునకు సంబంధించిన వ్యవహారము. మధ్యలో మన మెందుకు కలుగజేసికొనవలెను. ఈ నాడు తిట్టుకొన్నను రేపు మరల వారే నెత్తి కెక్కించుకొందురు.

ఈ విధముగా ద్వైతభావముతో ఎన్నెన్ని పోకడలు పోయినను భక్తిలో వరపశించినారు విశ్వనాథ."

## ఆర్తహృదయ నివేదనము

సంసార సముద్రమున కొట్టు మిట్టులాడుచు తీరము చేరలేక భక్తులు హృదయ గత భగవంతుని శరణువేడిన సందర్భమున తమ ఆర్తిని నివేదించుకొందురు.

అట్లే శతక కర్తలును పరి పరి విధముల తమ యార్తిని భగవంతునికి విన్నవించుకొనిరి.

ఈ సంసార బాధా నివారణకోసము వ్రాసిన పద్యములే ఈ విశ్వేశ్వర శతకమున ప్రధాన స్థాన మాక్రమించినవి.

దీన జన రక్షాకంకణ ధ్యానములు దిక్కులయందు వ్యాపించు చుండగా తనను రక్షించుటకు భగవంతుని రమ్మనిన మీదట ఇట్లు ప్రార్థించుచున్నాడు కవి.అనగా తనగోడును నిట్లుమొరపెట్టుకొనినాడు

నా సామీప్యమునందె రత్న నిధులున్నట్లౌను. జేపాచ నం
తా శూన్యం. బగు క్షీరవార్థి వట పత్రంబందు నిద్రించు న
ట్లే సుప్తిన్ గలగందు. మేలుకొని నట్టేటన్ గనుల్ తేల్తు. నీ
యాశాహేమ కురంగ కృష్ణుడను ముక్తాసుండ విశ్వేశ్వరా!

తన దగ్గరే రత్న నిధులున్నట్లే యనిపించిన కవిగారికి తీరా చేయి చాపగా అంతా శూన్యము. క్షీర సముద్రమున వట పత్రశాయిగా కలగని. కన్నులు తెరచినప్పటికి నట్టేటిలో ఉండుట.చివరకు ఆశాహేమ కురంగ కృష్ణుడ ననియు. ముక్తాసుండ ననియు తమ ఆవేదనలు వ్యక్తీకరించినారు.

అనగా కవిగారి తలపోతలకు ఫలితములకు పొంతన లేదను విషయము తేటతెల్లమగుచున్నది. ఊహలూళ్ళు - ఏలుచుండగా వ్రాతలు రాళ్లు మోయుచున్నట్లునదనుట స్పష్టము.

ఇంకను తన ప్రవర్తన గూర్చి ఆ విశ్వేశ్వరునికి ఇట్లు నివేదించుకొనినారు.

మాయా పద్ధతి చేతగాదు, పరసంపత్త్యైకతవ ప్రక్రియో
పాయవ్యాప్తికి బుద్ధిపోదు; కృపణత్వంబొప్ప దుర్మార్గులం
దేయాఙ్ఞామతి స్తోత్రపాఠము లొకింతే జేయగా జాల దం
డ్రీ! యీ జీవితనౌక పట్టగల దొడ్డేరీతి విశ్వేశ్వరా!

మాయచేసి బ్రతుకుట ఆయనకు చేతకాదు. ఇతరుల సంపద

హరించవలెనను బుద్ధిలేదు, స్తోత్ర పాఠములతో దుర్మార్గుల యాచించు టాయనకు గిట్టదు. అందుచే ఈ జీవితమును నడిపించు టెట్లనునదియే భగవంతుని ముందుంచిన ప్రశ్న.

అంతేకాదు! అటువంటప్పుడు నిన్ను పీడించుట తప్పదని భగవంతునితో నొక్కి వక్కాణించుచున్నారు.

అప్పా! లోక రహస్య మీ వెరుగ వేనై నిన్ను బీడించెదన్
దెప్పన్ జూచెద, రద్ది పెట్టెదను, నా తిప్పల్ పడన్ లేక నీ
వొప్పన్ బిల్తువు మధ్యవర్తులను, వారో స్వామి! హా! నీదియున్
దప్పే నందురు, నాన సంధి కెటులైనన్ రమ్ము విశ్వేశ్వరా!

ప్రభూ! లోక రహస్యము నీవెరుగవు. (నీకు ప్రకృతి సంబంధము లేదు. ఎక్కిన గుర్రము దిగకుండ నీ పట్టుదలలో నీవుండి నన్ను రక్షింప దలంపనిచో నిన్నెట్లు దారికి తేవలయునో నాకు తెలియకపోదు లెమ్ము, అదే పనిగా పీడించుచు, నిన్ను దెప్పుదును. నీ యుదాసీనతను గూర్చి, భక్తుల మొరలను వినకపోవుటను గూర్చి ముల్లోకములలో ప్రచారముచేసి అల్లరి పెట్టుదును. ఈ ఘోష పడలేక, నలుగురు నేమనుకొందురో అనియైన తలంచి ఈ తగవును పరిష్కరించుటకు మధ్య వర్తులను పిల్చెదవు. వారు కూడ కర్ర విరుగకుండ, పాము చావకుండ, ఇరు పక్షముల వారిని సమ్మతింప జేయుటకై, నాదేకాదు; నీదియును తప్పే యందురు. అందుచే అంతవరకు వ్యవహారము రానీయకుము. మెట్టుదిగి రాజీ మార్గమునకు రమ్ము.

దీనిని బట్టి భక్తునకు భగవంతునితో గల చనవెట్టిదో మన మూహింపవచ్చును. అంత మాత్రమే గాక యీనాటి ప్రజాస్వామ్య ధోరణిని గూడ ఆయన దృష్టిలో పెట్టుకొనియే యిట్లనినాడేమో అని పించును. మధ్య వర్తుల తీరుగూడ నట్టిదే, మరియు నోరు పెట్టుకొని అరచెడివాని పనులే నేటి కాలమున మునుముందు జరుగుచుండుట గమనింతుము.

తన దారిద్ర్యము పోవుటకు బంగారమో, ఏదోకొంత ఇమ్మను చున్నాడు. ఆ ఇమ్మనుటలో కొంత చమత్కారమున్నది.

పోవింటన్ బదియారు వన్నెకనకంబో, నిల్చునక్కొండ జా
దీ వెండో, తను భూషలన్ దలలపై దీపించు రత్నంబులో
నీ వేదో యొక యింత యిచ్చినను గానీ చాలు దారిద్ర్యమే
ఘావష్టంభము తీవ్రమారుత హతంబై పోవు. విశ్వేశ్వరా!

పరమేశ్వరా! 'నేనే బిచ్చగాడను,నీకేమీయగలనని తప్పించు కొన జూచుచున్నావేమో!అది పొసగదు,నీ సంగతి నాకు తెలియునులే! నీ విల్లు మేరుపర్వతము. అది మేలిమి బంగారుకొండ.నీ నివాసమో కైలాస పర్వతము. అది అచ్చమైని వెండికొండ.నీ అలంకారములు వాసుకి ప్రముఖ సర్పరాజుల పడగలపై అనేకానేక దివ్య రత్నము లున్నవి. ఆ బంగారము వెండి మణులలో నేదియే కొంత యిచ్చి నను నాకు జీవితము సాగిపోవును. పేదరికమొ తొలగిపోగలదు. ఇష్టము లేనిచో చెప్పవలెనుగాని. లేకపోవుట యన్నదిలేదు.

ఇది కవి ప్రార్థన. తన యార్తిని విన్నవించుకొనుచు ఆ శివుని విశిష్టతనుగ్గడించుచు, దారిద్ర్యమును పోగొట్టుమని ప్రార్థించు చున్నాడు.

మరియు ఆ ఈశ్వరుని కరుణాకటాక్షమును గూర్చి తపించి ఇట్లనుచున్నారు.

స్వామీ! నా బ్రదుకెండి నీ కరుణ వర్షాగాఢ జీమూత మా
లా మాధుర్యము లేది దుఃఖమయవేళా గ్రీష్మ సూర్యాతప పౌ
ష్ణ్యా మందత్వముచేత బీడువడి యంతా నెఱ్ఱలై యున్నదిం
కేమో సాగుకు గుంభవృష్టిపడి కానీరాదు, విశ్వేశ్వరా!

స్వామియొక్క కరుణయను వర్షములేక కవిగారి బ్రదుకెండి పోయి, దుఃఖమను నెండవేడిమికి బీడువడి బీటలు వారినది. అది

కుంభవర్షము కురిసికాని సాగుకురాదు.

అవును, కవిగారికి సంభవించిన కష్టము లటువంటివి. ఆకష్టములు నెరప్రిలు తీయువరకు వచ్చినవి. అవి పోవలెనంటే స్వామివారి కరుణ కుంభవర్షముగా పడితీరవలెను.

తాను మనసార నమ్ముకొనిన దైవముయొక్క కరుణకుతపించు భక్తుని వేదన ఇది.

ఊరకే పొడి మాటలలో చెప్పుటకాక అలంకార సమన్వితముగా చెప్పుట విశేషము.

తరువాత సిరులిచ్చినను సరే నీలో చేర్చుకొన్నను సరేయని ప్రార్థించుచున్న పద్యమిది.

స్వామీ!యేలనయాబహూక్తులు.నినున్బ్రార్థించుచున్నానురెం
డే మాటల్. సిరులిచ్చి వ్యర్థజనులెందే సేవ చేయించ కె
ట్లో మాన్పింపుము.కాదయేని మృదుపాండు శ్రీవనచ్ఛాయలో
నీ మైదీధితిలోన జేర్చుకొను తండ్రీ! నన్ను విశ్వేశ్వరా!

పెక్కు మాటలెందుకని ఖరాఖండిగా రెండేమాటలు చెప్పుచున్నాడు కవి.

నీవు సిరులిచ్చినట్లయితే వ్యర్థజనులను సేవింప వలసిన పని ఉండదనుటొకటి; రెండు నీలో చేర్చుకొనుమనుట.

డబ్బుకోస మొకరిని సేవించుట కవిగారికి కిట్టదు. దానిని మాన్పింపుమని ఆయన ప్రార్థన. నీలో చేర్చుకొనుమనుట యనగా మోక్షమును ప్రసాదించుమనుట.

బ్రతికితే పౌరుషముగా బ్రతకవలెననియు.చచ్చినచో మరల పుట్టకుండగా మోక్షము పొందవలెననియు విశ్వనాథవారి దీక్షతో కూడిన ఆకాంక్ష.

## విరక్తి వ్యక్తీకరణము:-

ఈ అనంతమైన సృష్టిలో మానవుని జీవిత మత్యల్పము. ఈ కొద్దిలోనే చెప్పనలవికాని ఆరాట పోరాటములు. ఈ ప్రాపంచిక పోరాటములో పూర్తిగా మునిగిపోయిన వ్యక్తికి భక్తికి పొత్తు కుదరదు. ఈ జీవితము క్షణిక మను భావము కలిగినప్పుడే ఎంతో కొంత భగవంతునిపై దృష్టి కలుగును. ఆ దృష్టియే భక్తి. ఆ భక్తి ముక్తికి మార్గము చూపును. మనసులో భక్తి పాదుకొనిన కొలది సంసారముపై విరక్తి కలుగును. ఈ విరక్తి పలురకములుగా నుండును.

ఈ మానవజన్మ పూర్వజన్మ పుణ్యఫలమనియు, అట్టి జీవిత మును వ్యర్థపుచ్చక భగవన్నామస్మరణమున గడుపుట కర్తవ్య మనియు భావించిన శతకకారులు జన్మ జన్మలకును భక్తునిగా పుట్ట వలెననియు కోరుకొనిరి. మరి కొందరు జన్మరాహిత్యమును కోరు కొనిరి. ఇంకను కొందరు ప్రాపంచిక విషయములకు దూరము చేయుమని కోరుకొనిరి. ఇవి యన్నియు వైరాగ్య భావములే. ఈ వైరాగ్య భావములందు లోకములోని అధర్మముల గూర్చి చేసిన నిందకూడ చోటు చేసికొన్నది.

విశ్వనాథవారును తమకున్న వైరాగ్య భావమునకు అక్షర రూపమిచ్చిరి.

వారి కసలు చిన్నతనము నుండియే ఈ వైరాగ్య భావము పాతుకొని యున్నదట.

నాకున్ జిన్నతనంబునుండి మదిలోనన్ దోచు వైరాగ్యమే
కాకీ సంసృతి యొండు వెంటబడి యీకాంతాసుతుల్ పేరిటన్
నా కాళ్ళన్ బెనవైచుకొన్నయది కంఠానన్ దగుల్కొన్నదీ
శోకంబేగతి మాన్పెదో గిరిసుతా శుద్ధాంత! విశ్వేశ్వరా!

కాంతా సుతుల పేరిట సంసారము కాళ్ళకు, సంతానకు ముడి వడి యున్నదట. ఆ ముడి సంబంధమైన శోకంబును మాన్పుమని తమ స్వామిని కోరి ప్రార్థించుచున్నారు విశ్వనాథవారు. ఆ స్వామి గిరిసుతా శుద్ధాంతుడు. నిన్ను గూడ ఈ తగులాటముండుటచే నా కష్టమేమిటో తెలిసికొన గలవను భావము సంబోధనలో ఉన్నది.

ఈ నాభార్యయు బిల్లలున్ బ్రదుకు త్రోవేదేని జూపించుమం
తే నేడే చని యేగిరీంద్రములనో నిద్రింతు, నే వాగులం
దో నీరానెద, నే ఫలావళులొ తిందున్. బర్ణముల్ మేసెదన్
నీ నిష్ఠాగతి నీవుగాక మరి లేనే లేను విశ్వేశ్వరా !

భార్యాపుత్రులకు బ్రదుకు త్రోవ చూపించినట్లయితే చాలట ఏ కొండలమీదనో పడుకొని. ఏ వాగుల నీరో త్రాగి, ఏ ఫలములనో తిని. అవీ దొరకకపోతే ఆకులు మేసి నిష్ఠాగతితో ఉండెదరట, స్వామి గాక తాము లేనే లేననుచున్నారు కవిగారు.

ఇది వారి వైరాగ్య భావనా విశిష్టతకు వరమోదాహరణము. వారి కసలు దేహము మీద ఆస్థలేదు. ఇక సుఖభోగములపై కోరికేమిటి? అందుకే చావటానికైన సిద్ధమే అనుచున్నారు.

నేనీ రోజున నేగి యే యడవులందే నాకులన్ దించు న
ట్లో నిల్చన్ బ్రియుతింతు దేహమటు కాదో చచ్చెదన్ లెమ్మునో
కానీ యీ ఋణమెట్లు తీర్చెదనా యీ కాసంతకై వచ్చి జ
న్మానేకంబులు దుఃఖినై తిరిగి పొందన్ జాల విశ్వేశ్వరా!

ఇదీ అసలు సంగతి. చచ్చిపోతే ఆ దేవ దేవుని ఋణము తీరదు. కనుక మరల జన్మమెత్తవలసి వచ్చును. జన్మమెత్తితే మరల దుఃఖము. అందుచే 'జన్మానేకంబులు దుఃఖినై తిరిగి పొందన్ జాల' ననినారు. అంటే ఆ కష్టమేదో ఇప్పుడే అనుభవింతురట.

"జన్మ దుఃఖం. జాయా దుఃఖం" అను భావము విశ్వనాథ వారిలో నున్నట్లు స్పష్టముగా ఇచట తెలియుచున్నది. కనుకనే వారి కీవైరాగ్యము.

మరియు తనను రక్షించుట అంత తేలికకాదని ఇష్టదైవముతో నొక్కి వక్కాణించుచున్నారు.

మరి రక్షించుట నన్ను నీకు బహు సామాన్యంబుగా దోచునో
పురముల్ గాల్చుట కాదు బ్రహ్మలిఖితంబున్ మార్చుటా కాదు సం
సరణాంభోధి మహాపదద్రిధుత తృష్ణా వీచి కల్లోల గ
హ్వరమౌ నాహృదయాన శాంతి నెలకొల్పన్ జూడు విశ్వేశ్వరా

"ఎంతెంత కోర్కులు నాకున్నవో అంత నిన్నుగను కోర్కుల్ లేవు అనిన విశ్వనాథ వారికి శాంతి యెక్కడనుండి వచ్చును! 'అశాంతస్య కుతస్సుఖమ్" అని కదా గీతాచార్యుని వాక్యము. అందుచే తన హృదయమున శాంతి నెలకొల్పమనుచున్నారు. ఆ శాంతిని నెల కొల్పుట సామాన్యముకాదట. అది త్రిపురములు గాల్చుటకంటె, బ్రహ్మచే అల్పాయుష్కుడుగా నిర్ణయింపబడిన మార్కండేయునికి చిరంజీవత్వము మగ్రహించుట కంటె కవిగారి హృదయములో శాంతి నెలకొల్పుట కష్టమట. అయన హృదయము సంసారమను సముద్ర మున మహాపద అను పర్వతముచె ఎగురగొట్టబడిన కోరికలను కెర టములచే కల్లోలముగా జేయబడినది.

ఆ కల్లోలములో పుట్టునది విషము. దానితో సమానమైనది వారి హృదయమున నున్న అశాంతి. ఇచట 'క్షీరసాగర మథనము'ను గుర్తు తెచ్చుకొనవలసి యున్నది.ఆ సమయమున పుట్టిన విషమును కంఠమున ధరించినవాడు శివుడు. కనుకనే ఆ శివునికి ఆ విషము వంటిది. తన హృదయమున శాంతి నెలకొల్పుటని కవిగారి అభి ప్రాయము.

సంసారముచేత మిథ్యాసౌఖ్యమట

ఈ సంసారముచేత నిల్లొడలు గుల్లేకాని లేదేమి మి
థ్యా సౌఖ్యంబనిపించు దుఃఖమయ జన్మానేక మూహింపగా
సీసీ పోయనుగాని వాని పయినే చిత్తంబు లగ్నంబగున్
భాసాభాసము నీదు చిన్మయ ప్రభావజ్యోతి విశ్వేశ్వరా!

ఇల్లూ, ఒళ్లూ గుల్లేకాని సుఖములేదని సంసారము చేతను గూర్చి విశ్వనాథవారి అభిప్రాయము. వారికి దుఃఖమయమైన జన్మ పరంపరపై సీసీ యనిపించునట.కాని వాని పయికే మనసు పోవునట. అంటే మరల జన్మ ఎత్తడము, సంసారము చేతలపై మనసు లాగు చున్నదట. అందుచే నన్ను రక్షించే బాధ్యత నీదేయని ఆ విశ్వేశ్వరు నికి మొరపెట్టుకొనినాడు.

విశ్వనాథవారికి విశ్వేశ్వరుని చిన్మయ ప్రభావజ్యోతి భాసా భాసము కనుకనే ఇంత వైరాగ్యములోకూడ అనగా మిథ్యా సౌఖ్య మనిపించికూడ దుఃఖమయమైన సంసారముపై చిత్తము లగ్నమగు చున్నది.

## పశ్చాత్తాప ప్రకటనము :-

కష్ట భూయిష్ఠమైన జీవితమున అనేకములైన దోసగులు దొరలు చుండును.వాటిని క్షమింపుమనుచు శతకకవులు భగవంతునికి మొరపెట్టుకొనిరి. విశ్వేశ్వర శతకమున గూడ పశ్చాత్తాపమును ప్రక టించిన సందర్భములున్నవి.

నేనున్ జేసిన పాపకర్మములు తండ్రీ! చెప్పగారానివిన్
లోనన్ దల్పగనైనరానివి దయాలోకాంబుధారా ప్రవా
హానన్ క్షాళనచేసి వైచెదవా, లేదా రౌరవాగ్ని స్ఫులిం
గానీకంబుల నూరెదో రురు విషాణశ్రేణి విశ్వేశ్వరా!

చెప్పగారాని, మనసులో దలంపగారాని పాప కర్మములు

చేసినారట. 'దయతో వాటిని క్షాళన చేసెదవో లేక రౌతవాగ్ని స్ఫులిం గానీకముల నూరెదో నీ యిష్ట'మని శివుని ప్రార్థించినారు. పాప ప్రక్షాళనము చేయక పోయినట్లయితే రౌరవ నరకమున పడద్రోచిన సరేయని కవిగారి భావము.

మరియు భార్యాపుత్రుల మమతను కోయజాలనని విన్న వించుకొను విన్నపమిది.

నేనీలోకపు దౌష్ట్యమున్ దెలిసి తండ్రీ! పెన్ విరాగంబుతో
దీనిన్ వీడగ నెంచు నానిముసమందే భార్యగా సంతతిం
గా నా కాళ్ళను బంద మొంచితివి పోగానెంతు బోనైనచో
బ్రాణాల్ పోవును వీరికీ మమత గోయన్ జాల విశ్వేశ్వరా!

ఇది దౌష్ట్యపు లోకమని తెలిసి పరిత్యజించుటకు సిద్ధపడు నిముసమునందు భార్య, బిడ్డలను గల్పించి బంధమొంచితివని తద్దోషమును తన దైవముపై మోపుచున్నాడు కవి. ఇపుడా పెళ్ళమును బిడ్డలను విడిచిపోతే వారు బ్రతుకరట. అందుచేతనే ఈ మమతను గోయలేక పోవుచున్నానని దోషము తనది కాదనినట్లు కారణమును జెప్పుచున్నారు. ఇచట 'ఆలంచున్ మెడగట్టుకొని' అను ధూర్జటి పద్యము గుర్తు రాక మానదు.

ఇంకను వ్యంగ్యముగా లోకమును నిందించుచున్నారు.

వ్యాఘ్రంబుల్ గలవంచు నాకుభయమేలా?అచ్చటన్గోముఖ
వ్యాఘ్రంబుల్ బలెమోస పుచ్చువుగదా పైకెంతొ లోనంతయే
శీఘ్రంబచ్చొటికేగి తాపసుడనై చింతింప వాంఛింతు వ్యా
జ ఘ్రాణేక్షపథాశ మిక్కుటమయా చిత్తేశ! విశ్వేశ్వరా!

ఆయనకు అరణ్యములో పులులున్నవని భయములేదట. అవి గోముఖ వ్యాఘ్రములైనచో భయముకాని, పైకెంతయో, లోపల కూడ నంతయే మైనచో భయమేమిటని వారి ధీమా.

మోక్ష పథాశ మిక్కుటము కనుక తాపసుడనై అరణ్యములో జీవింతునను నిశ్చయమును వెలిబుచ్చినారు.

అచ్చట గోముఖ వ్యాఘ్రంబులవలె వ్యాఘ్రములు మోస పుచ్చవనుట. ఇచ్చట అనగా జన ప్రదేశమునగల వారిని నిందించుటయే. ఇచ్చట నున్నవారు గోముఖ వ్యాఘ్రంబులు. నిజానికి వీరితోనే ప్రమాదము. వీరి మధ్యకంటె వాటి మధ్యనే ఉండుట శ్రేయస్కర మనునది కవి అభిప్రాయము.

## గీతాంజలి ప్రభావము:-

పరమేశ్వరుని ప్రాణేశ్వరునిగా, తల్లిగా. తండ్రిగా పలువిధాలుగా భావించుట రవీంద్రుని గీతాంజలిలో కన్పట్టుచున్నది. ఆ పోలిక యిక్కడ గమనింప వచ్చును.

విశ్వనాథవారష్టవిధ శృంగార నాయికలలో ఒకతెయైన వాసక సజ్జికవలె ప్రతీక్షించుచుంటినని భగవంతునికి మొరపెట్టుకొనినారు.

స్వాంతంబన్ మృదు శయ్యపై బరచితిన్ భక్తిప్రభావ స్త్రమ
త్యంతంబున్ బయిజల్లితిన్ మృదుల భావాఖ్య ప్రసూనాళి నా
యంతర్గేహము బాగుచేసితిని నీకై కంటిదారిన్ బ్రతీ
క్షింతున్ వాసక సజ్జికన్ బలెనుమా చిత్తేశ! విశ్వేశ్వరా!

తనకు తాను ప్రేయసిగా భావించుకొని భగవంతుని ప్రియునిగా వారాధించుటను 'మధురభక్తి' యందురు. ఇది వైష్ణవ సంప్రదాయమునకు చెందినది. భావకవుల కవితా వృక్షమునకొక ప్రత్యేక శాఖగా వర్ధిల్లినది.

ప్రియుడిపుడు రాగలడని పడకగదిని, తనను అలంకరించుకొనునది వాసకసజ్జిక.

చిత్తమను మృదుల శయ్యపై భక్తియను వస్త్రమును పరచి దానిపై భావ పుష్పములు జల్లి హృదయగేహమును శుభ్రము చేసికొని భగవంతుడు వచ్చునంచు దారి వెంబడి కనుచూపు మేరకు చూచుచుండిరి.

ఇచట కవిగారు తనకును, వాసకసజ్జిక నాయికకును అభేద మును చెప్పికొనినట్లున్నది.

తరువాత సాక్షాత్ భగవంతుడే తననోదార్చుటకు వచ్చునని భావించినారు.

నీవేమో యరుదెంతువంచు మరి నన్నే వచ్చి నా తండ్రి!యీ
నీవా నన్నెద నమ్మి కష్టముల నన్నే బొందె దంచోర్చుగా
నేవో చెప్పెదవంచు నా మనసులో నేమేమొ యూహించి నీ
పై విశ్వాసము నుంచితిన్ వదలకప్పా! నన్ను విశ్వేశ్వరా!

ఇట్లు భావించుట మధురభక్తిలోని భాగమే. అయితే యిచట భగవంతుని తండ్రిగా భావించుట మాత్రము గీతాంజలి ప్రభావము అంతేకాదు; భగవంతుడు వచ్చుచున్న ధ్వనిని వినుటను బట్టికూడ పై విషయమును రూఢిగా చెప్పవచ్చును.

ఆ కర్ణించెద నేమియో ప్రమద శంఖారావమో! జాటవీ
థీ కల్లోల తరంగ దేశతటినీ దీప్తారవంబో! కుభృ
చ్ఛీకన్యామణి పాదనూపుర మణి క్రేంకారమో! నన్నిదే
కైకోనీవరుదెంతు వీధ్వని యదే కాబోలు: విశ్వేశ్వరా!

గీతాంజలిలోని 50, 51, గీతాలలోని 'దివ్యరథయాత్ర' ధ్వని యిచట ప్రతిధ్వనించుచున్నది.

"...Only some said it was the sound of wheels. We said in a drousy murmur, 'No it must be the rumbling of clouds!

The night was still dark when the drum sounded"

గీతాంజలి_51

విశ్వేశ్వరుని ఆగమన ధ్వనిని విశ్వనాథవారు ప్రమద శంఖారావముగాను. శివజటా జూటమున నున్న గంగా తరంగరవంబుగాను, పార్వతీదేవి పాదనూపుర మంజీరకింకారముగాను భావించిరి.

ఆ వచ్చిన భగవంతునికి మార్గాయాసము తీర్చెదననిన పద్యమిది.

దీర్ఘాధ్వమ్ము గమించి వచ్చి తడుగుల్ తేయొత్తెదన్,శీతలా
నర్ఘాంబుల్ చిలికింతు నంజలిపుటంబందిమ్ము. హేమంతప్రా
తర్ఘాసంబులు బిల్వపత్రములు మందారాది పుష్పాలు నీ
కర్ఘంబిచ్చెద. రమ్ముతీర్చెద బథాయాసంబు, విశ్వేశ్వరా!

దీర్ఘ ప్రయాణము చేసి వచ్చిన భగవంతునికి అడుగులొత్తుట మొదలగు పరిచర్యలు చేయుదునని తమ భక్తిని వ్యక్తీకరించినారు విశ్వనాథవారు.

నీ కారుణ్యము:-

"నీ కారుణ్యము" అను దానితో ప్రారంభమైన పద్యము లిచట వరుసగా నారుగలవు. ఇవి విశ్వనాథవారి ఊహా వైభవమునకు, పాండిత్య బలమునకు నిదర్శనములు. ఆ పరమేశ్వరుని కారుణ్యమును పరి పరి విధముల భావించినారు.

నీ కారుణ్యము కోసమై విధురతంత్రీవీణ వాయించుబా
లాకృత్యంబుగ నంగలార్చిన దినాలన్ నాదుజిహ్వాగ్ర వా
జీకింక్షింకిణి నూపురస్వనము లెంతే దట్టమై పోయెనే
డీ కారుణ్యము చూచి నాకస నోరేరాదు. విశ్వేశ్వరా!

ఒకప్పుడు పరమేశ్వరుని కారుణ్యము కోసమై అంగలార్చిన దినములలో కవిగారి జిహ్వాగ్రమున సరస్వతీదేవి పాద మంజీరస్వనములు పెల్లై విలసిల్లినవి. ఇప్పుడా భగవంతుడు కారుణ్యము చూపగా నోరే పెగులుటలేదు.

ఇది జీవియొక్క సహజ స్వభావము. కష్టదశ యందుండిన విజృంభణ తీవ్రత సుఖప్రాప్తి తరువాత ఉండదు. ఒక్కొక్కప్పుడు హఠాత్ సంభవమునకు అవాక్కయిపోవుట కూడ జరుగును.

తమ ఇష్టదైవ కారుణ్యమునకు దానికదియే సాటియని చాటి చెప్పెదరట.

"నీ కారుణ్యము సాటి చెప్పెదను గాని నిక్కమూహింపగా నీ కారుణ్యము సాటిదానికదియే...."

నీ కారుణ్యము సాటితెత్తును............వర్షాకాలాంబుద సంస్రవజ్జల లవాచ్ఛశ్రీకి. విశ్వేశ్వరా!

ఆ విశ్వేశ్వరుని కారుణ్యము వర్షకాలమందలి మేఘమునుండి పడుచున్న సన్నని జల్లు వంటిది.

నీ కారుణ్యము సాటిచెప్పెద బికీనిర్హ్రాద వేళాద్వరే
పైకోన్మాదిత సర్వతః పరివృత ప్రారంభగీతిలస
న్మాకందాగ్రలతాంతపత్ర విగళన్మారంద కల్లోలినీ
వ్యాకీర్ణాంబుకణ ప్రసేక శిశిరత్వంబందు విశ్వేశ్వరా!

కోయిల కూయుచుండగా, తుమ్మెద పాడుచునంతట తిరుగుచుండగా మామిడి పుష్పములనుండి జారు మకరంద కణముల చల్లదనము వంటిదనియు ఆ విశ్వేశ్వరుని కారుణ్యము నుగ్గడించినారు.

ఈ ఆరు పద్యములగూర్చి శ్రీమాన్ మధునాపంతుల వేంకట పరమయ్యగారి అభిప్రాయమిది.

శివుడు మహాకాలుడు. అనగా కాలస్వరూపుడు. కాలమును బట్టియే సృష్టిస్థితి లయములు సంభవించుచుండును. కాలము ఋతు రూపముగా నున్నది. అందుచే పరమేశ్వరునియందు కాలము భాసించుచుండును. దానిని దృష్టిలో పెట్టుకొనియే శ్రీ 'విశ్వనాథ' విశ్వేశ్వరుని వర్ణించియున్నట్లు తోచుచున్నది.

ఒక ఋతువునంటి మరియొకటి, దానినంటి వేరొకటి చక్ర భ్రమణముగా నను గమనించి వచ్చుచుండును. ఆ యనుగమనము స్పష్టముగా తెలియదు. కొంతయైన తరువాతగాని మార్పు కలుగు చున్నట్లనిపించదు. అట్లే విశ్వనాథయు ఋతువర్ణనము విడదీయ రానియట్లు వర్ణించె ననవచ్చును.

## వేదనా వైలక్షణ్యము :-

లోకములో తన కెదురైన గొప్పలు, తగిలిన ఎదురుదెబ్బలు మూలముగా కలిగిన అనుభవ విషయములతోపాటు, ఇష్ట దైవమును శరణువేడుటయందును వైలక్షణ్యము గోచరించుచున్న సంఘటనలు శతకాంతమున చోటుచేసికొన్నవి.

కుమతుండైన దురాత్ముపాపములు భక్తుండైన యువ్వాని క
ష్టములున్ బండినగాని నీకు నవి నచ్చున్ బోద టట్లుండె బో
క్రమమేలా గయికోవు చావొకటియేగా తక్కువా వెన్క స
ర్వము నెగ్గించితి వద్దిగూడ బ్రియమా? రానిమ్ము. విశ్వేశ్వరా!

కష్టాలు పడి పడి చిట్ట చివరకు తాను నమ్ముకొన్న భగవంతు భక్తుడు విసుగెత్తి పలుకు మాటలివి.

దురాత్ముని పాపములైన. భక్తుని కష్టములైన పరిపక్వ దశకు వచ్చిన పిమ్మటగాని అగ్రహానుగ్రహములు భగవంతుడు చూపించడను విషయమును కవి వ్యక్తీకరించినాడు.

విశ్వనాథవారిచ్చట భగవంతునిపై నిష్ఠురముగా చావొకటియే మిగిలినదిగా అన్ని కష్టములు పడినాడనియు, అదియును కానిమ్మ నియు ననగా దానికైనను సిద్ధమే యనియు పలికినారు.

భూమీదేవుల గూర్చి భగవంతునికిట్లు మొరపెట్టుకొనినారు.

భూమీదేవుల మానసంబు మృదువై పోల్పన్ వచస్సుల్ శిలా
సామాన్యంబులునై కనంబడెడిపో! జాట్యుల్ మనోభావ మం

దేమో వహ్నులు పైకి వెన్నలు. జగంబీరీతిగా సాగెడిన్
భూమిదేవుల దుష్టులందురు జనమ్ముల్ చూడు విశ్వేశ్వరా!

బ్రాహ్మణుల మనస్సు మిక్కిలి సున్నితమైనది. వారి మాటలు రాతివలె కఠినములైనవి. దుర్మార్గుల మనస్సులు అగ్ని సదృశములు. అనగా అగ్నివలె తాపకారణములు. పైకి మాత్రము (వెన్నలుగా) ఎంతో స్నేహశీలురైన వారుగా కనబడుచుందురు. ఇది లోకము పోకడ. లోకులు బాహ్యరూపమును బట్టి, వాగ్ధోరణిని బట్టియు మంచిచెడ్డలు నిర్ణయించుచుందురు. మనస్సెట్టిదని పరిశీలించి విలువ యిచ్చువారరుదు. అందుచేతనే వాక్కుల నాధారమొనర్చుకొని బ్రాహ్మణులను దుష్టులందురు. స్వామీ! యిది న్యాయమా! అని కవిగారి వేదన.

ఈ పద్యము చదువగానే 'నిండు మనంబు నవ్యనవనీత సమానము. పల్కు దారుణా ఖండల శస్త్రతుల్యము జగన్నుత! విప్రులయందు' అను నన్నయగారి పద్యము గుర్తునకు రాక మానదు. దానికి దీనికి చిన్న భేదమున్నది. నన్నయగారు బ్రాహ్మణుల లక్షణము చెప్పి, క్షత్రియు లందులకు పూర్తిగా భిన్నులని చెప్పెను. విశ్వనాథవారైతే క్షత్రియుల ప్రస్తావన తేకుండగా దుర్మార్గులందరిని పయోముఖ విష కుంభములుగా వివరించినారు.

నిజానికి విశ్వనాథవారి హృదయము నవ్యనవనీత సమానమనియు. వాక్కు తీక్ష్ణమనియు లోకప్రతీతి.

అయితే శ్రీ నరసింహశాస్త్రిగారి అభిప్రాయమిట్లున్నది. "సభావేదికల మీద ఆయన స్వరూపము నానా విధాకారాలు ధరిస్తుంది. కాని, ఆయనను యింటివద్ద కలసికొని ఆయన ఆతిథ్యము చవి చూచిన వారికి ఆప్యాయతతో కూడిన అమృత హృదయము మొక్కటే గోచరిస్తుంది." సారస్వత వ్యాసములు ఐదవ సంపుటము పే. 41.

ఈ రోజులను బట్టి చూచినను ఉన్నదున్నట్లు చెప్పువాడు వాడు విరోధి యగుచున్నాడు. అతడు చెప్పినది సత్యమే అయినను అప్రియమగుచున్నది. ప్రక్క తాళము వేసి చెక్కభజనచేసి తేనెమాటలాడి వెనుక గోతులు తీయువారే పెద్దలుగా చలామణి యగుచున్నారు. ఇది యెంత విడ్డూరమని విశ్వనాథవారు వ్యథనపడినారు.

ఇచ్చట వ్యంగ్యముగా తన స్వభావమును చెప్పుకొనిన విశ్వనాథ తరువాతి పద్యమున స్వీయ వ్యక్తిత్వమును గూర్చి యిట్లు వాక్రుచ్చినారు.

కవిశైవాంశ మటందు రక్కతననే గాబోలు నిన్బోలెనన్
గవిసెన్ నిక్కముగా నమాయకత.నా కంఠంబు గోయంగనెం
చు విరోధిన్ సయితమ్ము నే నదుముగా జూడన్ మహాకోపమే
చు వడిన్ దగ్గును నిష్ఠచాల దరులన్ జూర్ణింప. విశ్వేశ్వరా!

వేద ప్రవర్తకుడగు పరమేశ్వరునకు శ్రుతిస్మృతులయందు కవియను ప్రసిద్ధి గలదు.

గణానాం త్వా గణపతిం హవామహే కవిం కవీనామ్

ఋగ్వేదము.

కవి శబ్దమునకు ఈశ్వరుడను నర్థము కలదు. అదియునుగాక కవి యీశ్వరుడనుట పరిపాటి. అందుచేతనే కాబోలు నీవలెనే నా కమాయకత వచ్చినదనుచున్నాడు కవి. నిజమే: ఈశ్వరుడు మాయ అంటని వాడు. మాయకు దూరమైన శుద్ధసత్త్వమూర్తి. మరి కవియును తానమాయకుడ ననుచున్నాడు. తలలు తీసి తలలు మార్చునది లౌకిక ప్రజ్ఞ. ఎంత యెక్కువ మోసగింప జాలిన అంతయెక్కువ ప్రజ్ఞావంతుడుగా పరిగణింపబడుట పరిపాటి. అది కవి దగ్గరలేదు. అతనిది అద్దమువంటి శుద్ధమైన మనస్సు. మాయను తప్పుకొని మసలుటయే ఆ అమాయకత. 'నా ప్రాణము తీయదలచుకొన్నశత్రువు

నకును కీడు కోరను. అట్లు కోరుటలో కల్గు కోపములో నా నిష్ఠయే తగ్గిపోవును. చంపదగిన యట్టి శత్రువు తనచేత చిక్కెనేని కీడు చేయరాదు కదా! 'అహింసా పరమోధర్మః' అని కదా ఆర్యోక్తి. తన కోపమె తన శత్రువు అనికదా హితోక్తి. ఒక్క క్షణకాలము కలిగిన కోపము వలన నెంతో ఆత్మశక్తి వ్యయమైపోవుచుండుట గుర్తించుట చేతనే విశ్వనాథ వారీ మాటలాడగలిగినట్లు తలంప నగును.

కవిగారు నిత్యము పడుచున్న దేవులాటను గూర్చి ఇట్లనినారు.

చెలువొప్పన్ సరసీజ బాంధవుడు వేంచేసెన్ వియద్వీధి చుం
గులపై నప్పుడు నిద్రలేచితినయా, కుక్షింభరిన్ దేవులా
టలతో వెళ్ళును నాల్గుజాలు, నిసితోడన్ స్వేంద్రియజ్ఞానమున్
వెలితయ్యెన్ మరియిద్ది యేమిబ్రదుకో వెళ్ళింతు? విశ్వేశ్వరా!

ఇట సార్వజనీనమైన సత్యమును వ్యక్తము చేసినారు విశ్వనాథవారు.

సూర్యునితోపాటే నిద్రలేచుట. నాల్గు జాలంటే పగలంతా కుక్షింభరియై దేవులాట. రాత్రితో ఇంద్రియముల వెలితి. చక్రభ్రమణము వంటి ఈ జీవితము కవిగారికి అసహ్యమనిపించియే 'ఇద్ది యేమిబ్రదుకో వెళ్ళింతు' ననినారు.

వైరం సమానమైనప్పటికి వియద్వీథిచుంగులనుటలో అరుణోదయ రేఖలతో కవితారేఖ గానిపించుచున్నది.

మరియు కామ క్రోధంబులను పోగొట్టుమని చేతులెత్తి ప్రార్థించుచున్న పద్యమిది

ఆక్రోశించెద బాహులెత్తి ప్రభువా! ఆలించవే! యేమికా
మక్రోధంబులహో! ప్రమాణతను సంపాదించె నాయందు. నా
యు క్రూరత్వము నీవశిత్వమును నా యందింత పొందింపవే!

అక్రీతుండను దాసుడన్ శివ శివాయన్నాను. విశ్వేశ్వరా!

ప్రభూ! రెండు చేతులెత్తి గొల్లుమని బిట్టరచి యేడ్చు చున్నాను వినుము. కామక్రోధములు నాయందు తెగ పెరిగి పోవుచున్నవి. ఇంతంత పెరుగుటకాదు: ప్రమాణ స్థాయిలో నున్నవి. మరి యెవ్వని యందును అంతగా ఉండవన్నంతగా పెరిగినవి. నీ వక్రూరుడవు. అనగా క్రూరత లేనివాడవు. భక్తసులభుడవు. కామ క్రోధము ఉండుట చేతనే క్రూరత. అవి లేనిచో క్రూరత లేనేలేదు. అందుచే నీ లక్షణమగు అక్రూరతను నాకు ప్రసాదింపుము. నీవు వశిత్వము గలవాడవు. వశిత్వమనగా ఇంద్రియ నిగ్రహము నీకు గలదు. నేనేమో ఇంద్రియములను వశము చేసికొనలేక వానికి వశమై యున్నాను. నీ అక్రూరత, నీ వశిత్వము నా కనుగ్రహించి ఆదు కొనుము. నీకు నాకు సంబంధమేమందువేమో! నీ దాసుడను నేను. అక్రీతుడయిన దాసుడను. మనుష్యులను పశువులను కొన్నట్లు కొని వానిచే వెట్టి చాకిరి చేయించుకొనుట ఈనాటికిని కొన్ని దేశములలో నున్నదియే. ఆ విధముగా కొనబడిన (క్రీతుడైన) బానిస నిర్బంధమై లోపల తిట్టుకొనుచున్నను, చచ్చినట్లు పనిచేయుచుండును. నేనట్టి వాడనుకాను. నీవు నన్ను కొనలేదు. అయినను నాకు నేనై స్వచ్ఛంద ముగా నీ దాస్యమున కిష్టపడి శివ శివా యన్నాను. 'అనుచున్నాను' అని. 'నీ కున్నదే నా కిమ్మను చున్నాను. లేని దెచ్చటి నుండియో తెచ్చి యిమ్మనుటలేదట. 'శివ శివ' అన సాగినచో అదే (వశి) అగు చున్నది. శివుడు మంగళ స్వరూపుడు కాన కామ క్రోధాదు లాదరి బాపులనుండవు.

తన దేహమును బొంగరముతో నాడుకొను క్రీడాసక్తుడట ఈశ్వరుడు.

తెమలన్ జాలనివాటుగా నుసికొలందిన్ దూయబన్నట్టి బొం

గ్రమునా గాఢ చలత్ప్రభ్రమణరేఖన్ స్థైర్యమాభాసమై
యమరన్ జూచుచు జూచుచుండ దలబర్వై తూలిపోనైన దే
హముగా నెన్నిగిరాట్లు నన్నిడెదొ క్రీడాసక్తః విశ్వేశ్వరా!

ఉసికొలది బొంగరమును త్రిప్పగా అది తిరిగి, తిరిగి చివరకు తల బర్వై తూలిపోవును. క్రీడా సక్తుడు మరల త్రిప్పును. అట్లే నన్నెన్నో సారులు గిరాటు పెట్టిన క్రీడాసక్తుడవని శివునిపై ఆరోపణగావించుచున్నాడు కవి.

అనగా అనేక జన్మలుగా తనను త్రిప్పుచు ఆ భగవంతుడాడుకొనుచున్నాడని పునర్జన్మ విషయమును ప్రస్తావించుట జరిగినది.

ప్రస్థాన త్రియమున గనుంగొనుట దప్పన్ క్లిష్టకామావిలా
వస్థా మార్గము నువ్వగింజయిన దప్పన్ బోధ లో గాలమే
ఘ స్థూలాకృతి నల్లనైన పొగయై కట్టెన్ వెలారెన్. మన
స్స్వస్థత్వంబది నేటి జన్మకె గడింపన్ లేనొ విశ్వేశ్వరా!

ఉపనిషత్తులు, భగవద్గీత, బ్రహ్మ సూత్రములకు ప్రస్థానత్రయమని ప్రసిద్ధి. వీటిని చదివినప్పటికి మనసు మాత్రము కామ కలుషితమైన మార్గమును వీడలేదు. అనగా వాటి మార్గము వాటిదే, మనసు మార్గము మనసుదే. ప్రస్థాన త్రయము చదివిన ప్రభావము కనిపింప లేదనుట. మనస్సులో కాలమేఘమువలె నల్లనైన పొగ రూపమును దాల్చినది. అందుచే ఈ జన్మలో మనస్సునకు స్వాస్థ్యము సమకూడునా యని కవిగారి ఆందోళన.

కవితా ప్రస్తావన:-

శతక ప్రారంభమునందే అనగా వెలుంగునర్పించిన పద్యద్వయము యొక్క వెన్వెంటనే భగవంతునికి తన కవితకు గల సంబంధమును ప్రస్తావించినారు.

నీవే రాజువు నేను సత్కవిని తండ్రీ! నిన్ను వర్ణించెదన్
నీవే దైవము నేను భక్తుడను దండ్రీ! నిన్ను ధ్యానించెదన్
నీవే భూమివి నేను గర్షకుడ దండ్రీ! నిన్ను బండించెదన్
నా వైదగ్ధ్యము నీవ చూతు, కృప సంధానించు విశ్వేశ్వరా!

విశ్వేశ్వరుడు రాజు; విశ్వనాథ సత్కవి. కనుకనే వర్ణించుట. ఆయన దేవుడు; ఈయన భక్తుడు. కాబట్టియే ధ్యానించుట. ఆయన భూమి. ఈయన కర్షకుడు. అందుచేతనే పండించుట. వీటి యన్నింటిలోను విశ్వనాథవారి వైదగ్ధ్యము కనిపించుచున్నది. సత్కవిగా, భక్తునిగా, కర్షకునిగా ఆ విశ్వేశ్వరునిపై పద్యపుష్పోపహారమును సమర్పించినారు విశ్వనాథవారు.

ఈ విధముగా తనకు, భగవంతునికి అక్షరరూపమైన సంబంధమును గల్పించుటలో కవిత్వమారాధన సాధనమైనది.

ఇక వారి వైదగ్ధ్యమునకు 'గ్వ్ర' ధ్యా. ధ్రై. ంహా. ఃహూ. ర్ఘా వంటి దుష్కరప్రాసలు. 'నీకారుణ్యము' అని ప్రారంభించిన పద్యము లందుగల దీర్ఘ సమాసములు, పూర్వకవుల కావ్యములందు కూడ ఎక్కడో కనుపింపని 'సద్యఉద్వేగ' 'స్తనాగ్రాంప్రాణాక్షర' వంటి సంధులు, అక్లీబద్వయమూర్తి, అక్రితుండు వంటి నూతన పదసృష్టి మొదలగునవి తార్కాణములు.

తనది నగ్నోద్విగ్నకవిత్వమని ఆ విశ్వేశ్వరుని కిట్లు విన్నవించుకొనుచున్నారు విశ్వనాథవారు.

వాగ్నేతృత్వము వృత్తిరీతి రస భావౌచిత్య శయ్యార్థ సం
లగ్నోక్త్యంచిత లక్షణధ్వని గుణాలంకారముల్ లేని నా
నగ్నోద్విగ్న కవిత్వమెంచగ దగియీనాదంబొ? ఓంకారమో?
భగ్నారిధ్వజ! వేదపుం గొనలా నిన్ భాషింప? విశ్వేశ్వరా!

ఆ పరమ పురుషుని గూర్చి త్రయీవేద్యుడనియు, ఓంకార వాచ్యుడనియు, ఉపనిషత్ప్రతిపాద్యుడనియు ననుట ప్రసిద్ధము.

కర్మ. ఉపాసనా. జ్ఞాన యోగత్రయోపదేశ విలసిత మగుటచే వేదమునకు త్రయీత్వముపపన్న మగుచున్నది. కనుకనే పరమేశ్వరునకు త్రయీవేద్యుడనుట సార్థకము. అనగా వేద ప్రతిపాద్యమైన కర్మ- ఉపాసనా- జ్ఞానైక వేద్యుడని అర్థము.

"కర్మోపాసనా జ్ఞానకాండ భేదేన చత్వారోఽపి వేదాః త్రిప్రకారాః! అను శ్రీశంకర భగవత్పాదుల వారి వాక్యమే దీనికి ప్రమాణము.
లలితా త్రిశతీభాష్యమ్-58 శ్లో.

ఓంకార మనగా ప్రణవము. 'వేదో వృక్షః. తస్యమూలం ప్రణవః. ప్రణవాత్మకోవేదః' బోధాయనుడు.

కనుక పరమేశ్వర వాచకము ప్రణవము.

వేదపుంగొనలనగా ఉపనిషత్తులు. ఉపనిషత్తులందలి ముఖ్య విషయము పరమాత్మ తత్త్వము.

త్రయీనాదము, ఓంకారము, ఉపనిషత్తులు ఆ పరమేశ్వరుని గూర్చి భాషించుచున్నవి. అట్లే ఆ భగవంతుని గూర్చి చెప్పుటకు తన కవిత్వముపై మూడింటివంటిది కాదనుచున్నారు కవిగారు. పైపెచ్చు వారిది ఏ అలంకారాదులు లేని నగ్నోద్విగ్న కవిత్వమట. వ్యాకుల చిత్తముతో పెల్లుబికిన భావమును యథాతథముగా అక్షర రూపమిచ్చితిననుటకు వినయముగా 'నగ్నోద్విగ్న కవిత్వ' మనినారు కాని ఏవి లేవని చెప్పినారో ఆ కావ్య లక్షణము లన్నియు వారి కవిత్వమునకు ప్రాణభూతములు.

ఆ దేవదేవుని పాద సన్నిధిని తన కవిత్వమును సమర్పించి నందులకు తగిన ఫలంబు నిమ్మనుచు అడిగిన మాటలివి.

నీవేమో కనిపించకుండినను గానీయైన గన్పించి న
ట్లే వేలూహలుగాగ దెచ్చుకొని నీవేకాక లేదేకదా
దైవంబంచును నా కవిత్వము భవత్పాదద్వయిన్ జేర్చితిన్
రావే దీనికి నే ఫలంబొసగెదో రానిమ్ము విశ్వేశ్వరా!

అవును. తన స్వామి కనిపింపకున్నను కనిపించినట్లే భావించి నారు విశ్వనాథవారు. ఆ విశ్వేశ్వరుడే పరము దైవముగా సేవించి నారు. కనుకనే తిన్ననివలె అమాయకమగు మంకుపట్టును పట్టినారు.

ఆయన కవిత్వమెట్టిదో ఈ క్రింది పద్యమున జెప్పినారు.

తేనెల్ వారును మేఘగర్జనలు వీతెంచున్ బికీకన్యకా
నూనవ్యాహృతి మాధుపంచమము చిందున్ ద్యోనదాంభశ్శిఖ
శ్రీ నృత్యంబులు సూపునాకవిత తండ్రీ! నా హృదంభోజమం
దానందచ్యుతి పొంది నీ శతకమిట్లైపోయె. విశ్వేశ్వరా!

విశ్వనాథవారి హృదయపద్మమునుండి పొంగి పొరలిన ఆనం దమే శతకరూపమును ధరించినదట. ఈ శతకమున తేనెలు. మేఘ గర్జనలు. కోకిల స్వరము. ఆకాశగంగానదీ జలకణనృత్యంబులు గలవని ఆత్మ విశ్వాసముతో పలికినారు కవిగారు.

క్రొంగ్రొత్త రీతులలో విశ్వేశ్వరుని వర్ణించుటకు పూనుకొనిన విశ్వనాథవారికి ఏ మార్గమున బోయినను పూర్వకవి పాదముద్రలే తోచినవట.

నిను గ్రొంగ్రొత్తలు తేర్చుగుంఫనల వర్ణింపంగ నూహింతునో
నని యేదారిని బోయి పూర్వకవి పాదాంకంబులే తోచిలో
ననలజ్జాపరిగూఢ మానసుడనై నాలోననేనే వినూ
తన శంకాహృదయుండనౌదు. పరిక్షుంతవ్యుండ, విశ్వేశ్వరా!

అనగా పూర్వకవులు త్రొక్కని మార్గము లేదని స్పష్టమైనది. కనుకనే లజ్జాహృదయులైనారు.

ఎప్పటికప్పుడు నేనేపాటి వాడనని శంకించుకొందును. అయి నను నా చాపలము వదలక కృతి నిర్మాణముసందు లాలస వహించు చుందును. క్షమింపుమని వేడుకొనినారు కవిగారు.

ఇది ఇట్లుండగా అసలు విశ్వనాథవారు పద్యరచనలో తనదగు ప్రత్యేకతకోసము విపరీతముగు సాధనచేసిరనుటకు ఈ క్రిందిమాటలే ప్రమాణములు.

"నేను చిన్నప్పుడు పద్యాలు వ్రాసేవాణ్ణి. ఎన్నాళ్లైనా వాటికి ఒకపాటు కుదరలేదు. మా నాయనగారికే నచ్చేవికావు. పింగళి బాగా వ్రాసేవాడని మా నాయినగారు మెచ్చుకొనేవారు. నాకూ అవిబాగానే వుండేవి. నేను పట్టుబట్టి అభ్యాసం గాఢంగా చేశాను. ఒక్కొక్క దశలో నా కవితలో ఒక్కొక్క వైచిత్రి బైటపడుతూ వచ్చింది.....

....... ....రాను. రాను నా కవితలో ఒక్కొక్క మెట్టులో ఒక్కొక్క విలక్షణత కనిపిస్తూ వచ్చింది. నా గుండెలోనుండి వస్తున్న మాటల్లో ఒక కూర్పు వినూత్నంగా నాకు తోచింది. అప్పుడు నాకు తెలిసింది నా శైలి ఒకటి వున్నది. అది సకల పూర్వాధ్రికవుల కోవలోనిదే. కాని వానికంటె యిది చాలా విలక్షణమైనది. భగవంతుడు నాకిచ్చిన యీశైలి సహస్రముఖమైనది. విచిత్రమైనది. ఇది యింకొక శైలితో లగించదు." విశ్వనాథశారద. పే. 25.

దీనిని బట్టి వారెన్ని దారులు పోయినారో, ఎంత తపించిరో వేరుగా చెప్పనవసరములేదు.

ధూర్జటి శ్రీనాథులు తేనెలందించిన నోటికి విశ్వనాథవారు జలము లందించినారట.

ఆనందైకమయ స్వరూప! భవదీయైశ్వర్యమున్ ధూర్జటి
శ్రీనాథుల్ కవితాసతీ కుచతటీ శ్రీ గంధ కస్తూరికా
స్థానంబున్ బొనరించి రిప్పటికి నస్మత్ స్తోత్రపాత్రంబవై
తేనెల్ ద్రావిన నోటికిన్ జలము లందింపయ్యె విశ్వేశ్వరా!

ప్రభూ! నీ వానందమే స్వరూపమైన వాడవు. 'ఆనందో బ్రహ్మ' ఆనందసునుభవైక వేద్యము. నీ షడ్గుణైశ్వర్యమును శ్రీనాథుడు, ధూర్జటమున్నగు మహాకవులు దివ్యముగా, అనన్యసాధ్యముగా అమృత మధురముగా వర్ణించినారు. ఆ కవితా సుధాస్వాదనమొనర్చి తనిసినావు. ఇప్పుడు తగుదునమ్మా యని నేనుగూడ నిన్ను స్తోత్రము చేసితిని. తేనెలు త్రాగిన నోటికి ఏట్టి నీళ్ళందించినట్లున్నది. అని కవి తన వినయమును వెల్లడించుచున్నాడు.

అంతమాత్రమే కాదు. జలము తేనెకన్న అందరికి తప్పని సరిగా అవసరమైనది. అందుబాటులో నుండునది. అనుభావము కూడ లేకపోలేదు.

ఈశ్వరార్చన కళాశీలుడైన శ్రీనాథుని, శ్రీముక్కాళహస్తీశ్వర చరణకమల సేవా పరాయణుడైన ధూర్జటిని విశ్వనాథవారు తలంచుట ఈ సందర్భమున ఔచితీభాసురము.

## ఆద్యంతములు:-

కథయైనను, కావ్యమైనను సరి యే గ్రంథమైనను ప్రారంభ సమాప్తముల యైక్యమును మాత్రము మరచిపోరు విశ్వనాథవారు.

శతక ప్రారంభ పద్యమున ఈశ్వరుని 'ఆనందవల్లీ మంజు ప్రసవంబు'గా స్తుతించిన విశ్వనాథవారు శతకాంత పద్యమున మరల 'ఆనందైకమయ స్వరూపుని'గా స్తుతించుట గమనార్హము.

మొత్తముమీద విశ్వనాథవారు తమ హృదయములో పొంగిన భక్తి భావమునకు అక్షరరూపమిచ్చి పద్యపుష్ప శతకహారముచే పరమేశ్వరుని గళసీమ నలంకరించి శ్రీనాథ ధూర్జటుల సహపంక్తిని ఆసీనులైనారు.

# జాతీయోద్యమ చారిత్రిక నేపథ్యము

## తత్కవిత్వోదయము

ఇంతవరకు భక్తికాలవాలమైన 'మాస్వామి' శతకమునుగూర్చి తెలిసికొంటిమి. ఇప్పుడిక కవి సమ్రాట్టుల దేశభక్తికి కాణాచియైన 'ఆంధ్రప్రశస్తి'ని గూర్చి పర్యాలోచించు కొందము.

మానవుడు సహజముగ స్వాతంత్ర్యాభిలాషి. అతనికి తన తల్లి యందు గల ప్రేమ ఎట్టిదో జన్మభూమియందుఁగల ప్రేమకూడ అట్టిది. కనుకనే 'జననీ జన్మభూమిశ్చ స్వర్గాదపి గరీయసీ' అని వాల్మీకి నోటివెంట వెలువడినది. ఆ ప్రేమ నిసర్గ సుందరము. అట్లే తన సంస్కృతి. సంప్రదాయము. ఆచార వ్యవహారములు. భాష వీటి అన్నింటిపై అభిమానము సహజము. మీదు మిక్కిలి వీటి రక్షణమతని కర్తవ్యము. అందుచేతనే కుటుంబము కోసము తాను, గ్రామముకోసము కుటుంబమును, రాష్ట్రముకోసము గ్రామమును. దేశముకోసము రాష్ట్రమును త్యాగము చేయవలెనని పెద్దల హితోపదేశము.

బ్రిటిష్‌వారి వలపదేశమయిన భారతదేశమున ఆర్థిక రాజకీయ సంఘటనల పరిణామ కారణముగా జాతీయత రూపుదిద్దు కొన్నదని చారిత్రకుల నిర్ణయము. 1885 లో భారత జాతీయ కాంగ్రెసు ఏర్పడుటయే భారత జాతియితకు ప్రారంభదశ అను భావమున్నది. ఇటువంటి వాటిని దృష్టిలో నుంచుకొని 'భారత దేశమును బ్రిటీషువాళ్ళు పాలించుట ఒక వరం' అని గోపాలకృష్ణ గోఖలే భావించి ఉండవచ్చు.

నిజానికి భారతీయులకు సాంస్కృతిక ఏకరూపత, భౌగోళిక ఐక్యత ఉన్నవి. ఈ విషయములో వాల్మీకి వ్యాస కాళిదాసాదులు ముందే జాగ్రత్త పడినారు. రామాయణ భారతములు ఆ సేతు

హిమాచలమునకు సంబంధించినవి. ఒక ప్రాంతమునకు పరిమితములు కావు. రామాయణ భారతములందు పేర్కొనిన ప్రదేశములు భారత దేశమందలి అన్ని ప్రాంతములలో గలవు. ఆ గ్రంథములందలి ముఖ్యపాత్రలు అన్ని ప్రాంతములను సందర్శించినవారే. భిన్న ప్రాంతాలలో భిన్న భాషీయులున్నప్పటికిని సారూప్యమునకు ఇవి ప్రమాణములు. అయితే మధ్య కాలములో కొంత విచ్ఛిత్తి ఏర్పడిన దనక తప్పదు. మహమ్మదీయుల పాలన కాలమున భారతీయత రూపుమాయుచున్నప్పుడు పృథ్వీరాజు, రాణాప్రతాపసింగు, శివాజి మొదలగు దేశాభిమానులు జాతీయప్రభుత్వ స్థాపనకు కృషిచేసిరి. అయితే ఈ జాతీయతాభావము రాను రాను చాపచిరిగి చదరైనట్లు బ్రిటిషువారి కాలమునకు దిగజారిపోయినదనుటకంటె చచ్చిపోయిన దనుట మంచిది. ఈ పరిస్థితిలోనే భాషను, తెగను, మతమును ఆధారము చేసికొని క్రింది స్థాయిలో నున్న జాతీయత సామ్రాజ్యవాద వ్యతిరేకత రూపమున అఖిలభారత స్థాయి జాతీయతా వృక్షము చిగిర్చినది. ఈ వృక్షమునకు 'నాదేశము, నా సంస్కృతి, నా స్వాతంత్ర్యమనునవి శాఖలు.

ఆంగ్ల విద్యావ్యాప్తి భారతీయ విద్యార్థులలో స్వాతంత్ర్యా సక్తిని ప్రోత్సాహపరచినది. ఆంగ్ల ప్రభుత్వ నిరంకుశ విధానము లకు వ్యతిరేకముగా చట్టబద్ధమైన ఆందోళనను ప్రారంభించిన మహా మనీషులలో ప్రథముడు రాజా రామమోహనరాయ్. 1823 లో ఆంగ్ల ప్రభుత్వము పత్రికా స్వాతంత్ర్యమును నిరోధించుచు శాస నము చేసినది. రాయ్ భావప్రకటనా స్వేచ్ఛను సమర్థించుచు సుప్రీం కోర్టునకు, ఇంగ్లండు ప్రభువునకు వినతి పత్రములు సమ ర్పించుటయేగాక ఒక ఉద్యమమును నిర్వహించినాడు. ప్రాథమిక హక్కులకు భంగకరమగు శాసనము మేధావులను జాగృత మొన ర్చినది. భారతీయుల కన్నీళ్ళను తుడువదలచి విలియం ఆడం అనే వ్యక్తి 1839లో 'బ్రిటిష్ ఇండియా సొసైటీ'ని స్థాపించినాడు. భారత

ప్రజల స్థితి గతులను ఆంగ్లేయులకు తెలియజెప్పుట ఈ సంస్థపని. 1851 లో స్థాపింపబడిన 'బ్రిటిష్ ఇండియా అసోసియేషన్' జన మనములందు కరడుగట్టియున్న బానిసభావములను పారద్రోల యత్నించినది. దీనితో ప్రజలలో చైతన్యము పల్లవింప జొచ్చినది.

1885 లో భారతీయ కాంగ్రెస్ మహాసంస్థ స్థాపింపబడినది. ఈ సంస్థ స్థాపనకు అక్టేవియస్ హ్యూమ్. సురేంద్రనాథ్ బెనర్జీ, దాదాభాయినౌరోజీ, గోపాలకృష్ణగోఖలే, గోవిందరెనడే మున్నగు వారు ముఖ్యకారకులు. ప్రజల సాధక బాధకాలను సామరస్యపూర్వకముగా ప్రభుత్వమునకు తెలియజేయుట ప్రారంభలక్ష్యము. స్వాతంత్ర్యసముపార్జనము వీరి లక్ష్యముకాదు. బ్రిటీషువారి పాలనకు వీరు విముఖులు కారు. మీదు మిక్కిలి దేశాభివృద్ధికి అది అవశ్యకమను భావము వీరిది. ఈ మితవాద ధోరణి ఇరువదియైదు సంవత్సరములు సాగినది. ఈ ధోరణి యువతరమున కేవగింపైనది. రక్తదీపములు వెలిగించి యైనను జాతికి మేలు చేయవలెనని అరవిందఘోష్ ఆకాంక్షించినాడు. ఆయన సందేశమునకు ప్రభావితుడైన తిలక్ ప్రవేశించినంతనే కాంగ్రెస్‌లో అతివాద పక్షమొకటి ఆవిర్భవించినది. వీరి ప్రధాన లక్ష్యము బ్రిటీషు ప్రభుత్వమునంత మొందించి స్వరాజ్యముసంపాదించుట. ప్రతి హృదయములోను జాతీయోద్యమ లక్ష్యములను ప్రతిధ్వనింప జేసిన మహామనీషి తిలక్ "స్వాతంత్ర్యం నా జన్మహక్కు" అని చాటిన సాహస పురుషుడు. మితవాదులకు నాయకుడు గోఖలే; అతివాదులకు నాయకుడు తిలక్.

జాతీయ పురోగతికి ముందడుగు వేయుచున్న వంగరాష్ట్రమును 1905లో రాజ ప్రతినిధియైన కర్జన్ రెండుగా విభజించుటతో ముసలము ప్రారంభమైనది. బెంగాల్ భాషాభిమానము పెరిగినది. భిన్న భాషా ప్రాంతాలయందు సామ్రాజ్యవాద వ్యతిరేకాగ్ని రగుల్కొన జొచ్చినది. జాతీయతా భావము భారతదేశమంతటను

వ్యాపించినది. జాతీయోద్యమ శంఖారావమును బిపిన్ చంద్రపాల్ ఆసేతుశీతాచలము వినిపించినాడు. 1906 కలకత్తాలో కాంగ్రెస్ స్వరాజ్య తీర్మానము గావించినది. బంకించంద్ర ఛటర్జి వ్రాసిన ఆనందమఠం నవలలోని "వందేమాతరం" గీతము జాతీయ సమైక్యతా గీతముగా గానము చేయబడినది. ఇదియే వందేమాతరోద్యమము.

భారత రాజకీయములయందు గాంధీజీ ప్రవేశముతో గొప్ప మార్పు సంభవించినది. శాంతియుతమగు నహింసా మార్గమున స్వాతంత్ర్యసముపార్జనము కాంగ్రెస్ లక్ష్యమని ప్రజల కీయన బోధించెను. సత్యాహింసలు గాంధీ మార్గమునకు మూల సూత్రములు క్రీ. శ. 1920 లో మహాత్ముడు సహాయ నిరాకరణోద్యమమును ప్రారంభించినాడు. ఎందరో త్యాగధనులు మహాత్ముని అడుగుజాడల ననుసరించిరి. దేశోద్ధారక నాగేశ్వరరావు పంతులుగారు, ఆంధ్ర రత్న దుగ్గిరాల గోపాల కృష్ణయ్యగారు మొదలగు ఆంధ్రజాతీయ నాయకులు ఈ ఉద్యమమున ప్రవేశించినారు.

ఈ ఉద్యమానికి పూర్వమే అనగా 1913 నుండియే మనవారు ఆంధ్రరాష్ట్ర సంపాదనకై ప్రయత్నములు చేయసాగిరి. అవి శ్రీ పొట్టి శ్రీరాములుగారి ప్రాణములు బలిపెట్టువరకు ఫలింపలేదు. ఇట్లన్ని భాషాజాతులలోను రగిలిన సామ్రాజ్యవాద వ్యతిరేకత భారత జాతీయతకు దారి తీసినది.

జాతీయోద్యమ మెందరో కవులకు స్ఫూర్తి నిచ్చినది. అటు భారత స్వాతంత్ర్యోద్యమ ప్రభావమునకు, ఇటు ఆంధ్ర రాష్ట్రోద్యమ ప్రభావమునకు కవుల కలాలు సింహగర్జన గావించినవి. కవుల గర్జనలు సామాన్య ప్రజల నోళ్ళ గుహలలో మార్మోగ సాగినవి.

రాజమండ్రి సభలలో బిపిన్ చంద్రపాల్ ఉపన్యాసములను చిలకమర్తి లక్ష్మీ నరసింహముగారు తెలిగించుచు ముగింపు సందర్భమున

"భరత ఖండంబు చక్కని పాడియావు
హిందువులు లేగదూడలై యేడ్చుచుండ
తెల్లవారను గడుసరి గొల్లవారు
పితుకుచున్నారు మూతులు బిగియగట్టి"

అని ఆశువుగా చదివినారు. ఇది ఆనాటినుండి ఆంధ్రుల నాలుకలపై నర్తించుచునే యున్నది. ఇట్లు చిలకమర్తి వారు దేశభక్తి కవితకు శ్రీకారము చుట్టినారు. దీని లక్ష్యము ప్రజలను దేశభక్తి ప్రపూర్ణులను గావించుట. పురావైభవప్రాభవ వర్ణనము, నాయకుల గుణ గణ కీర్తనము, వీరుల ప్రశంస ఈ కవితా లక్షణములు.

## జాతీయోద్యమ కవితాస్రవంతి:-

దేశభక్తి కవిత్వము రెండు విధములుగా సాగినది. ఒకటి భారత జాతీయాభిమాన సంబంధి; రెండు ఆంధ్రాభిమాన సంబంధి. మొదటిదానికి నాటి ప్రభుత్వపాలన దోహదము చేసిన విధము తెలిసికొంటిమి. ఈ విభాగమున పరాశ్రయ రీతిలోను, ఆత్మాశ్రయ రీతిలోను అనేక కావ్యములు వెలువడినవి. రెండవదియైన ఆంధ్రాభిమానము మూడు విధములుగా సాగినది. జాత్యభిమానము దేశాభిమానము, భాషాభిమానము అనునవి. జాత్యభిమానమున అతః పూర్వము చెప్పినట్లుగా ఆంధ్రజాతి పూర్వౌన్నత్యము, ఆంధ్ర వీరుల శౌర్యము, విద్యాప్రశస్తి మొదలగునవి కవితావస్తువులు. దేశాభిమానమున క్షేత్రప్రశస్తి, నదీప్రశస్తి ఇత్యాదులు కావ్యవస్తువులు. భాషాభిమానమున అన్యభాషా వ్యామోహమును తెగనాడి మాతృభాషా వైశిష్ట్యము నగ్గడించుట కవితావస్తువు. ఆనాడు తెలుగు ప్రజలకు భారత స్వాతంత్ర్యకాంక్షకు ప్రత్యేక రాష్ట్రవాంఛకు భేదములేదు. కనుకనే స్వాతంత్ర్యోద్యమ సందర్భమున రాష్ట్రోద్యమ ధ్వనులను సమప్రాశస్త్యమై వినిపించినవి.

'దేశభక్తి', 'మనిషి' అను గేయములను రచించిన గురజాడ వారు ప్రబోధ కవిత్వమునకు మార్గదర్శకులు కావచ్చుగాని నవ్య కాల్పనిక మార్గమున భారతదేశమును కీర్తించిన వారిలో శ్రీ రాయప్రోలు సుబ్బారావుగారు ప్రథములు.

నవయుగ వైతాళికుడైన గురజాడ మహాకవి
"దేశమును ప్రేమించుమన్నా
మంచి అన్నది పెంచుమన్నా
వొట్టిమాటలు కట్టిపెట్టోయి

గట్టిమేల్ తలపెట్టవోయి!
ఆకులందున అణగి మణగి . . . . . . . . .
కవిత కోవిల పలకవలెనోయి
పలుకులను విని దేశ మందభి
మానములు మొలకెత్తవలెనోయి 'గురజాడ రచనలు–పే61

జాతీయ భావస్ఫూర్తిని కలిగి యుండుటయేగాక సర్వ మానవకోటి హృదయాలను స్పందింపజేయగల మానవతా ప్రబోధ గీతమిది.

దేశభక్తి కవిత్వమున కగ్రేసరత్వము వహించినరాయప్రోలు వారు.

"ఏదేశమేగినా, ఎందుకాలిడిన
ఏ పీఠ మెక్కినా ఎవ్వరేమనిన
పొగడరా నీ తల్లి భూమి భారతిని
నిలుపరా నీజాతి నిండు గౌరవము .......... ....
లేదురా, యిటువంటి భూదేవి యెందు
లేరురా, మనవంటి పౌరులింకెందు
అవమాన మేలరా, అనుమాన మేల?
భారతీయుడ నంచు భక్తితోపాడ"

పాశ్చాత్య దేశములకేగి జన్మభూమిని మరచిపోవు వారి నీ గేయము హెచ్చరించుచున్నది.

దువ్వూరి రామిరెడ్డిగారు "స్వాతంత్య్ర రథమున పవిత్ర మూర్తియగు స్వాతంత్య్రదేవతను సాక్షాత్కరింప జేసినారు.

అంబుదంబుల నమృతపూరమ్ము లొలుక
నింద్ర చాపంపు తోరణ మింపు గులుక
కారు మెరుగులు వెల్లెస గడలు కొనగ
వెడలె స్వాతంత్య్ర రథము పన్వీధియందు

ఇట్లే ఆంధ్రాభిమానమును రేకెత్తించుటలోను, ఆంధ్రోద్యమ స్ఫూర్తి కలిగించుటలోను కవులు నిర్వహించిన పాత్ర సామాన్య మైనదికాదు. ఆంధ్రదేశీయాభిమానమును ప్రబోధింప గడంగిన వారిలో కూడ రాయప్రోలు వారే ప్రథములు.

ప్రత్యక్షరమున ఆంధ్రాభిమానము తొణికిసలాడుచున్న 'ఆంధ్రా వళి' యను ఖండకావ్యమున

" నాదు జాతి, నాదేశము నాదుభాష
అను నహంకార దర్శనము మాంధ్ర" అని రాయప్రోలు వారు ప్రబోధించినారు.

ఇది జనులను కర్తవ్యోన్ముఖులను జేయు నహంకారమేగాని దురహంకారము గాదు.

"ప్రబోధము" అను శీర్షికలోనున్న

"అమరావతీ పట్టణమున బౌద్ధులు విశ్వ
విద్యాలయములు స్థాపించునాడు" మొదలగు పద్యముల లోని ఎత్తుగడ విశ్వనాథాది తదనంతర కవులకు మార్గదర్శకమైనవి

విశ్వనాథవారు ఆంధ్ర జాతీయుభిమానమును మేల్కొల్పి, ప్రజలను స్వాతంత్ర్య పథగాములను జేయుటకు 'ఆంధ్రపౌరుష మును "ఆంధ్ర ప్రశస్తిని రచించినారు.

ప్రస్తుతాంశ 'మాంధ్రప్రశస్తి'యైనను దానికి పునాదియైన ఆంధ్రపౌరుషము'ను గూర్చి ఒకింతయేని తెలిసికొనుటవసరము.



## ఆంధ్ర పౌరుషము - తద్విశిష్టత

ఆంధ్ర పౌరుషము విశ్వనాథవారి తొలి పద్య రచన, పదు నాలుగేండ్ల బాల్యమున భారతీదేవి కటాక్షమునకు నోచుకొన్న విశ్వనాథవారిచే ఇంటర్మీడియేట్ చదువుచున్న రోజులలో (1917) రచింప బడినది.

స్వాతంత్ర్య సమరమును గూర్చి ప్రజలను చైతన్యవంతు లను జేయుటకై బిపిన్ చంద్రపాల్ యావద్భారతము సంచరించుచు బందరు వచ్చి ఉపన్యాస మిచ్చిరి. విశ్వనాథవారు అప్పుడే వ్రాసిన దేశభక్తి పద్యములను పుస్తకముగ ముద్రించి చిన్నతమ్ముడైన రామమూర్తిచే తత్సభలలో అమ్మించెడి వారని పెద్దలమాట. ఇది సత్యనారాయణ గారి 'దేశభక్తి గుణ సాంద్రత'కు ప్రతీక. 'ఆంధ్ర పౌరుషము' స్వరూపమున చిన్నదయ్యు గుణ విశేషమున దొడ్డది. విశ్వనాథవారు ప్రథమాంధ్రస్వామిగా భావించిన అగస్త్యమహర్షి మొదలు బొబ్బిలి వీరుడు తాండ్రపాపయ్య వరకు గల పూర్వాం ధ్రుల పౌరుష పరాక్రమాదులుగ్గడింపబడినవి.

తెలుగుల పూర్వపు వెలుగులను స్మరించికొని విశ్వనాథ వారెంత పొంగిపోయిరో అంతకంటె ఎక్కువగా తమ అస్వతంత్ర తా జీవనమునకు కుంగిపోయిరి.

రాజరాజేశ్వరీ ప్రార్థనతో ప్రారంభమై ఆంధ్రుల చరిత్ర కందినంతవరకు ప్రథమ చక్రవర్తిగా పరిగణింప బడుచున్న ఆంధ్ర విష్ణువు స్మరణతో అంతమగుచున్న 47 పద్యాల ఖండ కావ్యమిది.

పువ్వు పుట్టగనే పరిమళించునట్లు ఈ చిన్న ప్రథమ కావ్యమందు విశ్వనాథవారి కవితా పరిమళములు గుబాళించినవి. ఇందు ఆవేశము, భావగంభీర్యము, పద్యరచనా పాటవము ముప్పిరిగొన్నవి. ఒక్క మాటలో నుడువ శ్రీమద్రామాయణ కల్ప వృక్షమునకు బీజరూపము.

ఇందలి ప్రతి పద్యము ఆంధ్రుల చరిత్రలోని ఒక విశిష్టాంశమును గాని, చైతన్యోద్దీపకమైన సార్వకాలిక సత్యమును గాని వ్యక్తీకరించి మనల నటునిటు నూపివేయును. కొన్ని సీస పద్యాలలో ఒక్కొక్క పాద మొక్కొక్క చరిత్రాంశమును రేఖామాత్రముగా స్పృశించును. అది పాఠకుని చరిత్ర జ్ఞానమును ప్రశ్నించును.

ఏది ఏమైనప్పటికి గతకాల విశేషావశేషములను జూచి, తద్వైభవముల నూహించి, బాష్పనేత్రులై, గద్గదకంఠులై, తీవ్ర వేదనా మనస్కులై ఇట్లు తలంచినారు.

> ఆగిరి దుర్గమున్ ప్రకృతి మండెదులున్నవొ చూచి, పూర్వపుం
> భోగము లూహచేసి కనుగొంతల జారెడు బాష్పనీరముల్
> చే గిలిగించి యెట్లు ధృతింబడెదు? వాని మరంభములందు శౌ
> ర్యాగమ పేర్మిలైన మన యాంధ్రుల రక్తమె పొంగుచుండినన్
>
> ఆంధ్రపౌరుషము-12 ప

తన నరములలో ఆంధ్రుల రక్తము ప్రవహించుచున్న వాడెవడైన శిథిలశేషములైన గిరి దుర్గములను జూచి బాధపడకుండ నుండలేడు గదా!

అటువంటప్పుడు పుట్టినచోటు, పెరుగుదలచోటు. తన కున్నటు

వంటి శక్తిచేత అభిమానమునకు మారుపేరైన విశ్వనాథ ఆంధ్రుల పూర్వ వైభవ ప్రాశస్త్యమంతయు మంటగలిసిపోయిన దైన్యస్థితికి విల విల లాడిపోకుండగా నెట్లుండగలరు? ఈ సందర్భమును పురస్కరించు కొని పలికిన చల్లా రాధాకృష్ణశర్మగారి మాటలివి.

"ఎంతో గొప్పగా బ్రతికిన తెలుగువారు దురదృష్టవశాత్తు దుస్థితికి లోనుకావడం విశ్వనాథవారికి దుర్భరంగా తోచింది. గత వైభవాన్ని సగర్వంగా స్మరిస్తూనే, కంట తడిపెట్టారు. తెలుగువారి ఖడ్గ ధాటికి శత్రువీరుల రక్తం నదులు కట్టిందని పేర్కొంటూనే అప్పటి మన్నతి తలక్రిందులయ్యే' అని వాపోయారు. 'మమ్మేటుల గాచెదో నీ విక నాంధ్రమాతృకా!' అని తమ సంశయాన్ని వెలిబుచ్చారు. అసామాన్యములైన ఆంధ్రుల శౌర్యసాహసాలు వాడివత్తలు కావడాన్ని తలుచుకుంటేనే కళ్ళల్లో నీరు నిలుస్తుంది. మనస్సు వికల మవుతుంది. కంఠమేమో రుద్ధమవుతుంది–అని పేర్కొన్నారు. చివరికి ఆకాశం కూడా సానుభూతి వ్యక్తం చేస్తుంది. పువ్వులమ్మినచోట కట్టెలమ్మడం రమణీయ దృశ్యంకాదు. అలాగే పచ్చ పచ్చగా బ్రతికినవాడు ఈసురోమని కాలం గడపడము హృదయవిదారమైన దృశ్యం. సహజంగా ఆంధ్రాభిమానం కల విశ్వనాథవారు ఈ దృశ్యాన్ని ఊహించుకుని దంసపు కోతకు పాల్పడివుంటారు."

విశ్వనాథశారద–పే. 85

తెలుగు వారెంత గొప్పగా బ్రతికినారో వెల్లడించిన పద్యమిది

ఒకనాడు గలదాంధ్ర యువకులు తూరుపు
కనుమ దుర్గముల నేలిన దినంబు
ఒకనాడు గలదు శిల్పకళా సరస్వతి
అమరావతిని నృత్యమాడు దినము
ఒకనాడు గలదాంధ్ర సకల ప్రపంచమ్ము
కృష్ణాస్రవంతి నూగిన దినంబు

ఒకనాడు గెలదు నిల్వక పోరు శత్రుల
నాంధ్ర సైన్యంబు వేటాడు దినము

ఆంధ్రపౌరుషము - ప-2

దక్కను పీఠభూమి తూర్పు-అంచున పొడుగ కుదిరియున్న కొండల సమూహము తూర్పుకనుములు. ఈ పేరు అధునికము. ప్రాచీనులు దీనిని మహేంద్రగిరి అని వ్యవహరించెడివారు. గౌతమీ పుత్ర సాతకర్ణి వెలయించిన నాసిక్ శాసనమున మహేంద్రగిరియే 'మహింద' అను ప్రాకృత నామమున ప్రసక్తితము.

అమరావతి నందుగల శిల్పకళా సరస్వతి విశ్వవిఖ్యాతి నార్జించినది. అమరావతీ స్తూపము నందలి చెక్కడపుపనులు నాటి ఆంధ్రశిల్పుల పవిత్ర మతాభినివేశమునకు, కళా కోవిదత్వమునకు గీటురాళ్ళు. నేటికి రెండువేల సంవత్సరముల నాటి ఆచార వ్యవహారాది విషయములను ఈ చిత్రములు ప్రతిబింబించును.

కృష్ణానది పడమటి కనుమలలో మహాబలేశ్వరము కడ జన్మించి ఎనిమిది వందలమైళ్ళు ప్రవహించి సాగరమున గలియుచున్నది. దీని ముఖద్వారము ఖండాంతర వాణిజ్యమునకు కేంద్రముగా నుండెను. ఈ ప్రాంతమును టాలెమీ తన గ్రంథమున 'మైసోలస్' అని వ్యవహరించెను. ఇప్పటివలె అత్యంతము సున్నితమైన రవ సెల్లాలును, విలువగల వజ్రములను పాశ్చాత్యసీమల కెగుమతి యగుచుండెను.

అట్టి ఆంధ్రోన్నతి కాలవశాత్ తలక్రిందులైనది. బండ్లపై ఓడలను గట్టవలసివచ్చినది. సింహశార్దూలములు నక్కలతో సరి రాకపోయినవి. నదీపతులు కాలువలైనవి. ఈ భావనల మిళితమైయున్న పద్యమిది.

కాలము మారి యోధలను కట్టిరి బంష్ట్రకుపైన సింహ శా
ర్దూలములున్ సృగాలములతో సరిరావు, నిరంతరాంబుధా
రాలసితంబులౌ నదులు రమ్యత దక్కె మహాతపాగ్నికిన్
గాలువలయ్యె మమ్మెటుల గాచెదో నీవిక నాంధ్రపుత్రకా!

అంధ్ర పౌరుషము- ప-3

ఇంకను తెలుగువారి దౌర్భాగ్యము నిట్లు దుఃఖపూరితముగా వ్రాక్రుచ్చినారు.

ఆంధ్రభూధవుల కార్యాలయాంతఃపుర
ప్రతతి కోతులకు నావాసమయ్యె
రాజకిరీట రారాజన్మణిచ్ఛటల్
ప్రతి ఫలించెడు చోట్లు పాడువడియె
పట్టపేనుగులు గర్వ సమేతముగ నేగు
కదల జిల్లేడుమొక్కలు జనించె
ఆంధ్ర పౌరుష మాటలాడు చోటులు శిలా
ద్ర్భతిని మార్గము నిరోధించినిలిచె

ఆంధ్రతేజమ్ము గని మోదమందినట్టి
యాకసము గూడ మాలిన్యమై చెలంగె
కాలమా! నీకృతమ్ములు గలవు గద శ
తమ్ములున్ వేలు నేమి ఫలమ్ము చెప్పి

అంధ్ర పౌరుషము-10 ప.

కాలము చేసిన పనులకు లెక్క ఉండదు. ఆ పనులకు సాక్షీభూత మాకాశము. చరిత్రలో నెన్ని మార్పులు వచ్చినప్పటికిని ఏ మార్పునకు లోను కానిది అది. అట్టి ప్రకృతి గతమైన ఆకాశము. ఆంధ్ర తేజస్సును గని మోద మందినది. ఆ ఆకాశము నేడు ఆంధ్రుల దుస్థితికి 'మాలిన్యమై చెలంగె' ననుట చక్కని భావన. ప్రకృతి కూడ

సొగసును తలంచుకొని విశ్వనాథవారాశ్చర్య పడినారు. అంతంత రాళ్ళ నంతపైకి తీసికొని వెళ్ళుట మానవులకు కష్టమైనపని. కనుకనే వారిని దేవతలేమో అనినారు. ఆ బలమ్ము. ఆ పని నేర్పు. ఆ విలాస మెంతయో చూచుటకు నోచుకొనలేక పోయినను కనీస మా చోటుల నైన జన్మింపలేదని వగచినారు.

తెలుగు వారి స్థితికి దిగజారి పోవుటకు అంతరైక్యముతే కారణమని బాధపడినారు. ఆంధ్రి స్వాములీరీతిగా శిల్పమును, వేదాంతమును, కవనమును, తత్త్వము నేట గల్పుకొనిరని విచారించి నారు. నేటి యాంధ్రులు కూడు గుడ్డలుండిన చాలను స్థితికి వచ్చి నారనియు, అసలు జాతీయసత్వము చచ్చిపోయినదనియు నిందించి నారు.

విశ్వనాథవారు నదులను కీర్తించిన పద్యమాణి ముత్యము,

గోదావరీ పావనోదార వాఃపూర
ఖిల భారతము మాదన్న నాడు
తుంగభద్రా సముత్తుంగ రావముతోడ
కవులగానము శ్రుతి గలయునాడు
పెన్నానదీ సముత్పన్న కైరవచళ
శ్రేణిలో తెన్గు భాసించువాడు
కృష్ణాతరంగ నిర్ణిద్రగానముతోడ
శిల్పమ్ము తొలిపూజ సేయునాడు

అక్షర జ్ఞాన మెఱగదో యాంధ్ర జాతి
విమల కృష్ణానదీ సైకతములయందు
కోకిలపు బాట పిచ్చుక గూండ్లు కట్టి
నేర్చుకొన్నది పూర్ణిమా నిశలయందు

ఈ పద్యమాలోచనా మృతము. మొదటి పాదము గోదావరిని

గూర్చి. ఆంధ్రదేశమున్న పూర్ణయినుటకు సన్నిధానమైనమైనది గోదావరీ పావనోదారవాహపూరము. తెగ ఆంధ్రులు పాటలీపుత్రమును జయించుటను స్మరింపజేయుచున్నదనియు భావింప వచ్చును. నన్నయ వ్రాసిన భారతము గోదావరీవాహపూరము.

రెండవ పాదమున తుంగభద్రానదిని గూర్చి చెప్పబడినది. భువన విజయ సభావిలసితుడైన కృష్ణరాయలేలిన విజయనగరము ఈ నదికి సంబంధించినది. అష్టదిగ్గజముల గానము తుంగభద్రా తరంగ రావములతో స్ఫూర్తి గల్పినది.

నిజమైన తెలుగు పలుకులు నుడిమి. ఎడిమి తిక్కన్న భారతములో చోటుచేసికొన్నవి. ఆ తిక్కన నెల్లూరివాడు. ఆ నెల్లూరు పెన్నకు సంబంధించినది. కనుకనే పెన్నానది కైరవదళ శ్రేణితో తెనుగు వాసించినది.

శిల్పమునకు సృష్టి అమరావతి. అది కృష్ణానది ఒడ్డున ఉన్నది. అందుచేతనే నాల్గవ పాదమున కృష్ణా తరంగముల గానముతో శిల్పము జతకూడినది. తొలిపూజ అనునది అమరావతీ శిల్ప ప్రాచీనతను తెలియజేయుచున్నది.

ఎత్తుగీతియందు ఆంధ్రజాతి కృష్ణానదియొక్క ఇసుకతిన్నెలపై పూర్ణిమా రాత్రులలో కోయిలపాటను నేర్చుకొన్నదని చెప్పబడినది.

కోయిలపాట గానమునకు సంకేతము. గానమునకు గంధర్వులు ప్రసిద్ధి. అదియును కృష్ణానది తీరమున. ఇది శాతవాహనుని తల్లిదండ్రుల వృత్తాంతమును తెలియజేయుచున్నది. శాతుడను గంధర్వుడు కృష్ణానది ఇసుక తిన్నెలపై ముని కన్యను కలిసికొనిన కథ అందు స్మరింపబడినదని నా భావన. వారి వెన్నెల విహారమే పూర్ణిమా నిశలు. పిమ్మట గూండ్లు అనునది

ఆంధ్రుల ప్రారంభస్థితి. శాత వాహనుడు తొలి ఆంధ్రరాజుగా ప్రసిద్ధుడు.

ఇంత విశేష సమన్వితము కాబట్టియే ఆంధ్ర పౌరుషమును గూర్చి చల్లా రాధాకృష్ణశర్మ గారిట్లనినారు.

"విశ్వనాథవారి ఆంధ్రాభిమానానికి అక్షరాకృతియే ఆంధ్ర పౌరుషం. కృష్ణా గౌతమీ పెన్న నదులు తెలుగు మాగాణాన్ని తడిపి, తెలుగు వారికి సిరులు సమకూరుస్తున్నట్టుగానే ఈ పౌరుష కావ్యం తెలుగుల గుండె పొరల్లో ప్రవేశించి తెలుగువారికి ఆనందో త్సాహాలు ప్రసాదిస్తుందనడం సత్య సన్నిహితం."

తెలుగువారికి ఆనందోత్సాహములు కలిగించు విశేషము లింకను అనేకములున్నవి.

అంధ్రాః శ్రీ పార్వతీయాః అను దానిని మనము నందిదు కొవి వ్రాసిన పద్యమిది.

తెలుగుంజాతికి పౌరుషంబుగల దద్రిస్వామి కన్యాకృపా
కలనంబుం గలదీ దృశంబుగ మహాకష్టంబు లీనాటికిం
గలిగెంగాని కుతారకృత్తరిపురాటర్కాంత సుస్రితాస్రుబ్నదీ
జల సంసిక్తమయేందిరాస్యము మహాశౌర్యంబు సౌమాస్యమే

ఆంధ్రులు శ్రీ పార్వతీయులు కనుక వారిపై పార్వతీదేవి కృపకు లోటులేదని భావము. వచ్చినది మహాకష్టమైనను తాత్కాలిక మని కవిగారి ఓదార్పు.

అగస్త్యమహర్షి వాల్మీకి మహర్షి ఆంధ్రులే అని విశ్వనాథవారి భావము.

అతడే కుంభభవుండు మౌని వినతాహంకార పృథ్వీధరో
ద్ధతి వజ్రాయుధ సన్నిభుండు ప్రథమాంధ్రస్వామియా వీరునిన్

జ్వాల దివ్యమధుసదంబున
జలజాస్త్రకులంబు పూత సరణి వహించెన్ ప. 22

వాల్మీకి మహర్షి ఆంధ్ర భూమిపై పుట్టినవాడని విశ్వనాథ వారి అప్పటి భావము. వీరందరిని తలంచుకొని ఆంధ్రజాతి చైతన్య వంతము కావలెననియు, తరిగిపోయిన మురువును సాధించవలె ననియు వారి ఉద్బోధ.

దివ్య వాహిని కృష్ణానదీ స్రవంతి
మోహన నినాద గానమ్ము మురువు తరిగె
తన్మనోహర గాన గీతమ్ము మరల
పాడగావలె మృదువుగా ప్రకృతిమాత.

తెలుగు జాతి చచ్చుపుచ్చు జాతి కాదనియు, పౌరుషముగల జాతియనియు, వన్నె తరిగిన జాతి పుంజుకొనుటకు ప్రకృతికూడ సహకరించవలెననియు విశ్వనాథ ఓదార్పు.

ప్రస్తుతము జాతి ఇంత దిగజారి పోవుటకు ఏదో కారణముండి తీరుననియు, తెలుగు చురకత్తి పదును కు తిరుగు లేదనియు చిట్ట చివరగా చెప్పిన పద్యమిది.

విప్రసంతతి మ్రోయు వేదరావములలో
దొరలెనేమో యపస్వర మొకండు
అనరాదు లోపమేదైన గల్గినదేమొ
పరమ పతివ్రతా తరుణులందు
నిరతాగ్ని హోత్రముల్ నెరపు బ్రాహ్మణ కర్మ
సంతతి సుస్థుగా జరపబడదొ
అఖిల పురాణ శాస్త్రాగ్ర మార్గంబులు
తప్పు చెప్పిరొ యేమొ తత్వవిదులు

ఆంధ్ర విష్ణువు శ్రీకాకుళాధినేత
తనులు కొలకులు కెంపుల గనుల గనెనొ
ఏకతమొ యుండగావలె కాకయున్న
తెనుగు చురకత్తి పదునుకు తిరుగులేదు.

ఇది తెలుగువారి తిరుగులేని తనమును వ్యక్తీకరించుటతో పాటు విశ్వనాథవారికి వేద సంస్కృతిపై గల విశ్వాసమును విశద పరచుచున్నది.

శ్రీకాకుళాధినేతయైన ఆంధ్ర విష్ణువునుస్మరించుటలో 'ఆంధ్ర పౌరుషము' ముగిసినది. ఈ ఆంధ్ర విష్ణువుతోనే 'ఆంధ్రప్రశస్తి ప్రారంభమైనది. ఆంధ్ర విష్ణువును గూర్చి తెలిసికొనుటకు ముందు ఆంధ్రప్రశస్తి అవిర్భావాది విశేషములు వివరింపవలసియున్నది.

---

## ఆంధ్ర ప్రశస్తి

### ఆవిర్భావాది విశేషములు

పూర్వాంధ్ర మహాసీయు లెవరెవరో, వారి వైశిష్ట్యవిశేషము లెట్టివో, శౌర్య పరాక్రమములెట్టివో, కళాపైదగ్ధ్యమెట్టిదో, సిరి సంపద లెట్టివో వీటి అన్నింటిని తెలుగు నుడి కారంపు సొంపుతో ఒడ్డులొరసి ప్రవహించు గోదావరీ పావనోదార వాఃపూరము వంటి గీర్వాణ భాషా గాంభీర్య మాధుర్యములను రంగరించిన విశ్వనాథవారి 'ఆంధ్ర పౌరుషము'ను గూర్చి తెలిసికొంటిమి. ఇక 'ఆంధ్ర ప్రశస్తినిగూర్చి పర్యాలోచించవలసి యున్నది. అసలీ రెండు గ్రంథములు ఒక కోవలోనివి. కనుకనే.

"సత్యనారాయణగారి ఆంధ్రప్రశస్తి, ఆంధ్ర పౌరుషము తొలి నాళ్ళలో పారాయణ గ్రంథములుగా నుండెడివి. ఎందరికో అందలి పద్యములు కంఠస్థములు." అని మధునాపంతుల సత్యనారాయణ శాస్త్రి గారను. ఆంధ్ర రచయితలు పే. 415

'రాయప్రోలు తొలి కావ్యాలలో మధురంగా వినబడిన పూర్వాంధ్ర గాథలు మరీ గాఢోజ్జ్వలంగా విశ్వనాథ 'ఆంధ్రపౌరుషము' 'ఆంధ్ర ప్రశస్తి' మొదలైన కావ్యాల్లో ప్రత్యక్షమౌతాయి.' అని దేవులపల్లి కృష్ణ శాస్త్రిగారును -సారస్వత వ్యాసములు పే.361

"ఆంధ్ర జాతీయతాభిమానమును మేల్కొల్పి, ఆంధ్రులను స్వాంతంత్ర్య పథమున నడుపుటకై శ్రీ విశ్వనాథ సత్యనారాయణ గారు 'ఆంధ్రప్రశస్తి, ఆంధ్ర పౌరుషము అను రెండు కృతులను రచించిరి. శ్రీ రాయప్రోలు వారి అభిప్రాయమున నాంధ్రులు 'బ్రతికి చెడ్డవారు! శ్రీ విశ్వనాథవారి అభిప్రాయమున 'జీవచ్ఛవములే! ఆంధ్రుల తొల్లిటి వైభవమును, తరువాతి హైన్యమును తల పోసి, తలపోసి విపుల చింతామగ్నులై శ్రీ విశ్వనాథవారీ కావ్యములను రచించిరి." అని ఆచార్య కాకర్ల వెంకటరామ నరసింహం గారును ఆధునికాంధ్ర కవితా సమీక్ష-పే.317

"విశ్వనాథవారి హృదయము రాష్ట్రీయ జాతీయ భావములు రెండింటికిని నిధానము. వారి ఆంధ్రపౌరుష-ఆంధ్ర ప్రశస్తులలో ఆంధ్రత్వాభిమానము సర్వతోముఖముగా ప్రవహించుచుండును. అని ఆచార్య దివాకర్ల వేంకటావధానిగారును అభినవలోచనం- పే.162

ఈ రెండింటిని ఒకే రాటకు గట్టి వేసినారు. దీనిని యోచించియే 'ఆంధ్రప్రశస్తి'ని గూర్చి వివరించుటకు ముందు 'ఆంధ్ర పౌరుషము'ను గూర్చి కూడ సంగ్రహ వివరణ మిచ్చితిని.

ఆంధ్రప్రశస్తి 1919-20 సంవత్సరాలలో రచించబడిన గ్రంథము. ఆయన ప్రశస్తికి 'ఆంధ్రప్రశస్తి'వేగు చుక్కనికొందరు విమర్శకులు వక్కాణించిరి, మరికొందరు 'కిన్నెరసాని పాటలు' అని ఉద్ఘాటించిరి.కాని వారితొలి కీర్తికౌముది'ఆంధ్రప్రశస్తి'అనుటతిరుగు లేని విషయము.అందుచేతనే మల్లంపల్లి శరభయ్యగారు ఇట్లనిరి.

"ప్రతీ రెండు శబ్దముల కూర్పులోనుండి తొంగి చూచెడి విశ్వనాథ ప్రథమ ప్రతిభ-యిందు - సమానగ్రథనములో పద్య బంధములో పలుకుబడిలో సంభాషణములో కథనములో ఊహావైభవములో-సర్వత్ర అభివ్యాప్తమైన తన రసాత్మయొక్క ఆవిష్కారమునకై కవోష్ణముగ నిట్టూర్పు చున్నట్టుయిండును.

ఇట్లు విశ్వనాథ కవితా వ్యక్తిత్వము తొలిసారిగా ఆంధ్ర ప్రశస్తియందే తన స్థిర ధర్మమును ప్రతిష్ఠించికొని యున్నది."

ఆంధ్రప్రశస్తి -దర్శిని 2

ఇచ్చటనే శ్రీమాన్ శరభయ్యగారనినట్లు 'ఆంధ్రప్రశస్తి'రచనకు ఆంధ్రోద్యమాదులు బహిఃకారణములు మాత్రమే. నిజానికి ఈ నేలతో. ఈ నేలపై ప్రవహించిన ఆయా కాలములతో. విశ్వనాథ జీవచైతన్యమునకు గల అవినాభావమే ప్రబలమైన అంతఃకారణము.

కనుకనే ఈ గ్రంథమునందే 'ఎన్ని జన్మమ్ములు గాగ నీ తనువునన్ బ్రవహించునో యాంధ్ర రక్తముల్' అని విశ్వనాథవారు ప్రకటించుకొనినారు.

"ఇంతగానెద పదిలించుకొన్నదిది యెక్కడి పూర్వపుజన్మ వాసనో!" అనునది కూడ దీనినే వ్యక్తీకరించుచున్నది.

ఈ యాంధ్ర రక్తమెప్పటిదో ఎక్కడినుండి వచ్చినదో తెలిసికొందము.

ఒకే సంస్కృతి కలిగిన వారందరు నొక జాతిగా పరిగణింపబడుచున్నారు. ఆ జాతిలో ఉన్న ఐక్యతా భావమే జాతీయత. సమగ్ర భారతీయతకు భంగముకానిదై. దానిలోని అంతర్భాగమై. మీదు మిక్కిలి ఆ జాతీయతకు దోహదకారియై తన ప్రత్యేకతను నిలుపుకొనుచు. స్వీయ సర్వతోముఖాభివృద్ధికి కృషి చేసిన జాతి ఆంధ్రజాతి.

ఆంధ్రుల ప్రస్తావన తొలుదొలుత ఐతరేయ బ్రాహ్మణమున కనిపించుచున్నది. ఇది ఋగ్వేదమునకు సంబంధించినది. క్రీ. పూ వేయి సంవత్సరముల నాటిదీ గ్రంథము. అజ్ఞమీరిన తన కుమారులను విశ్వామిత్రుడు శపింపగా వారు ఆంధ్ర, పుండ్ర, పుళిందాది జాతుల వారైరని అందలి వృత్తాంతము వలన దెలియుచున్నది.

ఆంధ్రులు తుషార జాతితో కలిసి 'అక్షు' నదీ తీరమున నివసించినట్లు వాయు పురాణము చెప్పుచున్నది. అక్షునది యనగా హిందూకుష్ పర్వతముల కనుమలనున్న అక్ససునది. దీనిని బట్టి వీరు మధ్య ఆసియా ప్రాంతమునుండి భారతదేశము ప్రవేశించిరని ఊహింప వచ్చును.

విశ్వామిత్రుడు శాపము నాటికి పుష్కర క్షేత్రముననున్నట్లు రామాయణ కథనము. దీనినిప్పుడు రాజస్థానమందలి అజ్మీరు సమీపమున నున్న 'పోఖారా' అని అనుచున్నారు. శాపానంతరము దక్షిణమునకు తరలి వచ్చిన ఆంధ్రులు గోదావరీ కృష్ణానదుల మధ్య దేశమున నివాస మేర్పరచుకొని రాజ్యములు స్థాపించిరి. వీరి భాష ప్రాకృతమైయుండును. ఆంధ్రులలో నొక తెగ వారైన శాతవాహనుల శాసనములు ప్రాకృతముతో నున్నవి. శాతవాహనులే ప్రథమాంధ్రరాజులు, వీరి తరువాత ఇక్ష్వాకులు, విష్ణుకుండి వంశజులు, పల్లవులు, చాళుక్యులు మొదలగు వారెందరో తెలుగు దేశమును పరిపాలించిరి.

ఈ చరిత్రనంతటిని త్రవ్వి విశిష్టమైన వాటిని 'ఆంధ్రప్రశస్తి' గారూపొందించినారు విశ్వనాథవారు. ఈ విషయమును వారే ఇట్లు వక్కాణించినారు.

"ఆంధ్రచరిత్ర త్రవ్వి త్రవ్వి పరమ రహస్యములు కొన్ని 'ఆంధ్ర ప్రశస్తి' లో కొన్ని నవలలుగా 'స్నేహఫలము' 'చందవోలు

రాణి' మొదలైన గ్రంథములలో వ్రాసితిని."

స్వేచ్ఛా వాయువుల కోసము బ్రిటిష్ వారిపై 1857 లో లో సిపాయిల తిరుగుబాటు రూపమున నాందీ పలికినప్పటికిని వందే మాతరోద్యమమే దేశప్రజలలో చైతన్యము కలుగ జేసినది. కాని సత్యమునకు అలవాటు పడిపోయిన జాతిని జాగృత మొనర్చినది స్వాతంత్ర్యోద్యమము. ఈ ఉద్యమ ప్రభావముతో పాటు ఆంధ్రోద్యమము కారణముగా తెలుగువారి ప్రత్యేకతను చాటవలసిన అవసరము వచ్చినది. చరిత్రకారులు ఆంధ్రచరిత్ర కాణాచిత్రవ్వి తలకెత్తుట ప్రారంభించిరి. ఆత్మాభిమానము, భావావేశము పుష్కలముగా నున్న విశ్వనాథవారు చరిత్రకారులు త్రవ్వి తీసిన చరిత్ర కాణాచినుండి దేశాభిమాన ప్రదీప్తిని గలిగించు దీప కళికలనేరి కొనినారు. ప్రబోధ కవితా శాఖకు పట్టము గట్టినారు. ఆంధ్రుల ప్రశస్తికి 'ఆంధ్రప్రశస్తి' రూపమున నీరాజనము పట్టినారు. ఇందలి వస్తు స్వీకారమును గూర్చి మల్లంపల్లి శరభయ్యగారి వాక్యములు విన దగ్గవి.

"చరిత్ర కందిన దేశకాల ఖండములను ఆలంబనముగ గొని విశ్వనాథ ప్రతిభ చరిత్రకందని దేశకాల వైభవములను శాశ్వతముగ మన కన్నులముందు నిలుపుచున్నది. రెండువేల సంవత్సరములకు పై బడిన కాలమునుండి యీ తెనుగునేల నాలుగు చెరగులలో వెలసిన అనేకములైన పూర్వాంధ్ర మహాసామ్రాజ్యముల ఉదయాస్తమయములకు సంబంధించిన విషాదానంద శబలితమైన సంస్కృతి ధారయే యిందలి కావ్యవస్తువు. ఆ చరిత్ర స్థలములను మహాక్షేత్రముగ సందర్శించి-అభివర్ణించి-విశ్వనాథ ఆంధ్రజాతికెల్ల శాశ్వతముగ వానిని మహాక్షేత్రములుగ వెలయించెను. ప్రతిభ తనకు ప్రసాదించిన ఒకానొక అతీంద్రియ శక్తివలన విశ్వనాథ నేటి తన

పరిచ్ఛిన్న చేతనమునుండి వెలుపడి-వామనుడు త్రివిక్రమాకృతిగ విస్తరించినట్లు-ఈ కావ్యములో దేశకాలముల నెల్లల నతిక్రమించి ఆంధ్ర ప్రశస్తి కెత్తిన యశస్స్తంభము వలె తాను నిట్టనిలచి యున్నట్లు తోచును." ఆంధ్రప్రశస్తి-దర్శిని.

ఇట్లు ఆంధ్రప్రశస్తి కెత్తిన యశస్స్తంభమువలె నిలిచిన విశ్వనాథ సభలలో ప్రదర్శించిన ఆంధ్రావేశమునకు సామాన్యులనుండి మహాకవులవరకు మూగిపోయిరి. ఆనాటి సంరంభములో 'ఆంధ్రప్రశస్తి పాత్ర సామాన్యమైనదికాదు. ఈ విషయమును గూర్చి శ్రీపాద గోపాలకృష్ణమూర్తిగారి మాటలివి.

"ఈ సంరంభములో వచ్చింది విశ్వనాథవారి ఆంధ్రప్రశస్తి. ఆ రావడము సభలలో తుఫానులాగ క్షణక్షణారోహణాలతో, కంఠ గాద్గదికతతో, ఉరుములతో, మెరుపులతో, పగవులతో వచ్చింది. ప్రబోధమూ, సంగీతమూ, కవనమూ, వాచికాభినయమూ చేరి తెలుసు వారికి ఒక వింతఘోషగా వినబడింది ఆంధ్రప్రశస్తి. ఉత్సాహపూరితు లాంధ్రులు విని హర్షించారూ, అనుకరించారు, ఆనందించారు.

'అర్ధశతాబ్దపు ఆంధ్రకవిత్వము-భారతి-63

ఆంధ్రప్రశస్తి రచనలోగల తన లక్ష్యమును గూర్చి విశ్వనాథ ప్రారంభమున వ్రాసిన పద్యమిది.

మా పూర్వాంధ్ర ధరాధినాయక కథా మంజూషికా రత్నగా
థా పద్యావలి పేరి హారి సుమనోదామంబు మాధ్వీక భా
షా పృక్తంబు మహాప్రబంధ రచనా సౌందర్యషన్ నాసనల్
తీపై కప్పిన్మగ నాంధ్ర సోదరుల కందిత్తున్ గళాంతమ్ముగన్

పూర్వాంధ్రరాజుల కథలతో నిండిన పెట్టె అది. ఆ పెట్టె ఆంధ్రుల సొత్తు. ఆ పెట్టెలో నుండి తనకు వచ్చిన, హృదయము హొంగ జేసిన రత్నములవంటి గాథల నేరికొనినారు. ఈ రత్న

గాథలను పద్యావళుల రూపమున సుమనోదామము గూర్చినారు. అది మాధ్వీకమువలె మత్తుగొలిపి. ఉక్కిరి బిక్కిరి చేయు భాషా మాధుర్య సూత్రముతో కూడినది. ఆ మాలనుండి మహాప్రబంధ రచనా సౌందర్య పరిమళములు గుబాళించునట్లు కవితాకళకు తార్కాణముగా నాంధ్ర సోదరుల కందించుట వారి ఆశయము.

ఈ పద్యమునందు విశ్వనాథ తన కావ్యమెట్లు తీర్చిదిద్దబడినదో నిర్దేశించినారు. చరిత్రలోని కథలపేటిక నుండి రత్నముల వంటి గాథల నేరికొని, ఒక్కొక్క గాథను పద్యావళి రూపమున పూలదండ వలెకట్టి, మొత్తమున్ని గాథలు మహాప్రబంధ లక్షణముతో విలసిల్లునట్లు రచింప బడినది.

ఆంధ్ర ప్రశస్తియందు గల గాథలు పన్నెండు. అవి 1 ఆంధ్రవిష్ణువు 2 శాతవాహనుడు 3 గోతమీపుత్ర శాతకర్ణి 4 మాధవ వర్మ 5 వేగిక్షేత్రము 6 ముఖలింగము 7 నన్నయభట్టు 8 పోలరాజు 9 పోలరాజు వధ 10 చంద్రవంశయుద్ధము 11 కొండవీటి పొగమబ్బులు 12 యమదంష్ట్రిక.

ఈ గాథలను రచించుసమయమున విశ్వనాథవారు నిర్దేశించు కొన్న విశిష్ట నియమములుగా ఈ క్రింది వాటిని భావింపవచ్చును,

"కథను మొదట గ్రహించిన తరువాత కథయొక్క మొదలి చివళ్ళు జపమాలవలె మేరుపూసయందు లగింపబడి యుండవలయును.

కొన్యముతో నేభాగమును ప్రధాన కథను వదలి చెదరి పోరాదు.

ప్రయోజన రహితమైన కల్పన దోషము. కొన్ని వర్ణనలన వసరముగా పెంచుట పెద్ద దోషము.

వర్ణనాదులు కావ్యమున కందమిచ్చును. కాని యా వర్ణన

అచ్చొటి వర్ణ్యముతోనో, వస్తువుతోనో కలిసిపోవునట్లు చేయుట మహా కవుల పద్ధతి.

రెండవది పద్యరచనా విషయము. శబ్దార్థ గుణముల సమ వేతత్వము ప్రయత్నింపదగినది. శబ్దములు వాడుటలో గుణాశ్రాయియైన యొకధ్వని మార్గము కలదు. ఇది రసధ్వని.

వితర్క నిర్వేద స్మృత్యాది బహుభావము లేక పద్యమాగుట భావశబలత........గడుసరులయిన కవులీ శబలాధ్వము పట్టుదురు. ఇది ప్రౌఢిగ ఒత్రోవ.

ఏ భాషలో గావ్యము వ్రాయబడినదో ఆ భాషయొక్క నానుడి పలుకుబడి సమృద్ధిగా సమకూర్చుట యొక మహాగుణము.

తెలుగనగా వేయితెలుగు మాటలను కూర్చుటకాదు. వాక్య విన్యాసము, అన్వయము, దేశీయోక్తి, పలుకుబడి తెలుగుగా నుండుట."

ఇవి యన్నియు విశ్వనాథవారి 'నా గొప్పరచన' అను వ్యాసమునుండి గ్రహింపబడినవి. తన రచనా దృష్టిని గూర్చి చెప్పు సందర్భము లోనివి కావున మన మీ దృష్టితో వారి కావ్యమును జూచుట సమంజసమని భావించి ఇవి పేర్కొనబడినవి.

అయితే 'ఆంధ్రప్రశస్తి' రచనా వైశిష్ట్యమును గూర్చి మల్లంపల్లి శరభయ్యగారి వాక్యములివి.

'ప్రతి కావ్యమునకు మొదట కథాసంగ్రహము కూర్చబడి నది. ఒక్కొక్క గాథ ఒక్కొక్క కావ్యముగా దీర్చబడినది. దేని నిర్మాణ శిల్పము దానిదే. ప్రతి కావ్యాంతము నందు ఒక్కొక్క పద్యము జయస్తంభమువలె ఆ గాథయొక్క ప్రశస్తిని జాటుచుం డును. ఒక కావ్యము సంభాషణతో మొదలగును. ఒకటి వర్ణనతో మొదలైనట్టుండును. అది సంభాషణయని తరువాతి పద్యములలో

గాని తెలియదు. ఒక్కొక్క కావ్యము కేవలము వ్యాగతముగానే యుండును. కొన్ని ఆద్యంతము వర్ణనా ప్రధానములుగా నుండును. కొన్ని లోకోత్తరమైన అనుభూతి లక్షణములై యుండును. కొన్ని అగాధమైన నిర్వేద లక్షణముతో నుండును. ఒకానొకటి ఉత్తాలమైన భావనా లక్షణముతో నుండును. ఇది ఇట్లుండునని యూహించుటకు వీలు లేకుండ యుండును. పరిమిత పద్యములలో అపరిమిత శిల్ప రచనీయములైన యివి పైకి ఖండ కావ్యములవలె కనిపించును."

దర్శిని-ఆంధ్రప్రశస్తి.

ఇక ఒక్కొక్క గాథను గూర్చి తెలిసికొందము.

---

# ఆంధ్ర మహావిష్ణువు

## చారిత్రక నేపథ్యము

శాతవాహన సామ్రాజ్యము మొదటి ఆంధ్ర సామ్రాజ్యమని చరిత్రకారులంగీకరించిరి. సాతవాహనయుగ కాలము క్రీ. పూ. 225-క్రీ. శ 225 అని నిర్ణయింపబడినది. అయితే క్రీ. పూ. 320 ప్రాంతమున నందరాజులను కూలద్రోసి, మౌర్య సామ్రాజ్యమును స్థాపించిన చంద్రగుప్తుని ఆస్థాన మందుండిన గ్రీకు రాయబారి మెగస్తనీసు వ్రాతనుబట్టి క్రీ. పూ 4 వ శతాబ్దికి పూర్వమే ఆంధ్ర సామ్రాజ్య మున్నదని ధ్రువపడుచున్నది. అప్పుడీయాంధ్ర సామ్రాజ్యము నెవరు నెలకొల్పిరను ప్రశ్న ఉదయించుచున్నది.

బ్రహ్మాండ పురాణమున ప్రథమాంధ్ర రాజ్యమును గూర్చి కథ యొకటి యున్నది.

"ఆంధ్రనాథో మహావిష్ణు ర్నిశుంభ దనుజాపహా
పురా స్వాయంభువ మనోః కాలే కలియుగే హరిః

కాకులే రాజవర్యస్య సుచంద్రస్స్యతనూభవః
అభవత్సర్వ దేవైశ్చ వేష్టితో లోక పూజితః
శ్రీశైల భీమ కాళేశ మహేంద్రగిరి సంయుతం
ప్రాకారం తు మహత్కృత్వా త్రీణి ద్వారాణి చాకరోత్
త్రిలోచనో మహేశ స్వత్రిశూలంచ కరేవహన్
త్రిలింగరూపీ న్యవసత్ త్రిద్వారేషు గణైర్వృతః
ఆంధ్రవిష్ణు స్సురయుతో దనుజేన నిశుంభునా
యుద్ధ్వా త్రయోదశ యుగాన్ హత్వాతం రాక్షసోత్తమం
అవసత్త్ర ఋషిభిర్యుతో గోదావరీ తటే
తత్కాల ప్రభృతి క్షేత్రం త్రిలింగమితి విశ్రుతం"

సుచంద్రుని కుమారుడాంధ్రవిష్ణువు. ఇతడు కాకులమునందు రాజ్యమును స్థాపించి. శ్రీశైలము, భీమేశ్వరము, కాళేశ్వరము అను మూడు క్షేత్రములను గలిపి ప్రాకారము నిర్మించెను. సుర యుతుడై నిశుంభుడను రాక్షసుని సంహరించెను. ఈ నిశుంభుడు గోదావరీ తటమునందున్నవాడు. అప్పటినుండి ఈ దేశము త్రిలింగ క్షేత్రముగ ప్రసిద్ధి కెక్కినది. ప్రాకారమునకు గల మూడు ద్వారము లందు శివుడు త్రిశూల పాణియై ప్రమథ గణములతో నిలిచి యుండును.

చరిత్రకారులు దీనిని ఆంధ్రవిష్ణు వనువీరుడు నిశుంభుడను నాగాంధ్రుని జయించి కాకుళ రాజ్యమును స్థాపించెనని సమన్వయ పరిచిరి.

ఆంధ్ర కౌ ది ప్రకార ఆంధ్ర విష్ణువు శ్రీకాకుళమును పాలించిన చంద్రుని కుమారుడు. ఆర్యమంజు శ్రీ మూలకల్పమను బౌద్ధగ్రంథము సుచంద్రుని రాజధానియైన శ్రీకాకుళము ప్రాచీన కాలమున కృష్ణానది యొడ్డున నున్నట్లు చెప్పుచున్నది. అయితే అది వెల్లువలకు కొట్టుకొని పోగా దాని సమీపమున ప్రస్తుతము శ్రీకాకుళ

గ్రామ మేర్పడి యున్నది. ఈ గ్రామమున నేటికిని ఆంధ్రవిష్ణువు దేవాలయము విరాజిల్లు చున్నది. ఈ దైవమునే ఆంధ్రనాయక స్వామి యందురు. మరియు 'ఆంధ్రనాథుడు', 'ఆంధ్రవల్లభుడు' 'తెలుగు వల్లభుడు' అను పేర్లతో అచ్చటివారు పూజించుచుందురు.

ఈ ఆంధ్ర విష్ణువును గూర్చి వల్లభాభ్యుదయమున మరి కొన్ని గాథలు కలవు.

శ్రీ కృష్ణ దేవరాయలు కళింగ దండయాత్రకు వెళ్ళునపుడు ఈ దేవాలయమును సందర్శించెను. ఆ సమయమున ఆంధ్రవిష్ణువు స్వప్నమున కానుపించి 'కృతి విస్మరింపు మిక మాకు ప్రియముగాగ' అని కృష్ణరాయల కానతిచ్చెను. 'దేశభాషలందు దెలుగులెస్స' అను పద్యము కలలో జెప్పినదే.

కృష్ణరాయలకు పూర్వము కాకతీయుల శాసనములందు. అనంతామాత్యుని భోజరాజీయమునందు నితని ప్రశంసయున్నది. కాసుల పురుషోత్తము కవి రచించిన ఆంధ్రనాయక శతకమందలి శ్రీకాకుళాంధ్ర దేవుడితడే.

కథాసంగ్రహము:_

ఆంధ్ర ప్రాంతమునందలి కిరాతరాజులు ఆంధ్రవిష్ణువు నుద్దే శించి 'ఓ స్వామీ! నీకు జోహారు. శ్రీ శైలారణ్య ప్రాంతమున నిశుంభుడను దానవుడీశ్వరుని సేవించి వరములుపొంది గర్వించి దుశ్చేష్ట లొనర్చుచున్నాడు. తరువాత నీ దయ' అని సన్నని వస్త్రములు మొదలగు కానుకలు సమర్పించిరి. అప్పుడాంధ్ర విష్ణువిట్లనినాడు.

మేమును వాని గురించియే ఆలోచించు చుంటిమి గుహవుల. అప్తుల ఉపదేశానుసారము దీక్షను పూనియుంటిమి. శివుని వర ప్రభావమున వాడింత వరకు విజృంభించినాడు. అంతట సరదార్లు జయ శబ్దములు కావించిరి.

పిమ్మట అంధ్రవిష్ణువు శ్రీశైలము, కాకుళము, భీమేశ్వరము అను మూడు క్షేత్రములందు శివలింగ ప్రతిష్ఠాపన కావించి వాటి చుట్టును ప్రాకారమ్మును నిర్మించెను. పిమ్మట తన చతురంగ బలమును సమీకరించుకొని నిశుంభునిపై దాడి వెడలెను. అతని సైన్యము కృష్ణానది కెడ రీతగా బయలుదేరి శ్రీశైల ప్రాంతమును చేరినది. నిశుంభుడు పారి పోకుండగా అంధ్రవిష్ణువు అఖిల మార్గముల నరికట్టి, వాడుండు తావు చుట్టును గజయూధములను గాపు పెట్టెను గుహనుండి బయటకు వచ్చిన నిశుంభుడు అంధ్రవిష్ణుని మెడపై త్రిశూలమును గురిపెట్టి దూకుటకు ముందే రాక్షసుని వక్షస్థలమును అగ్ని సదృశమైన బాణముతో అతడు భేదించెను. అప్పుడు నిశుంభునియందు వైష్ణవ చిహ్నములు గోచరించినవి. రాక్షసుని నేత్రములు సూర్యచంద్రులవలె ప్రకాశించినవి. వక్షస్థలమునందలి నెత్తురు కౌస్తుభరత్నమువలె ప్రకాశించినది. తన కుటుంబభరణ మాలోచించుకొనుటతో విశ్వభారము ఉదరమున మోసినట్లైనది.

నిశుంభ సంహరణానంతరము తన సైన్యముతో కాకుళమునకు అంధ్రవిష్ణువు తిరిగిరాగా వేదకాలము నాటి ముత్తైదువవలె ఆపురరాజ్యలక్ష్మి అతని కెదురై కపురారతులిచ్చినది.

## చరిత్ర కావ్యముల సమన్వయము:-

బ్రహ్మాండ పురాణమున కాకుల గ్రామ మెచ్చటనున్నది చెప్పబడలేదు. కావ్యమున ప్రవేశ పెట్టిన కిరాత సందార్ల ప్రస్తావన పురాణమున లేదు. కాకులము కృష్ణానది యొడ్డున నున్నట్లు బౌద్ధగ్రంథమున కలదు. కృష్ణానదీ ప్రాంతమునుండి సున్నితమైన రవసెల్లాలు ఇతర ప్రాంతముల కెగుమతియగు చుండెడివను చారిత్రకాధారము ననుసరించి విశ్వనాథవారు అంధ్రవిష్ణువునకు కిరాత సందార్లు సమర్పించు కాన్కలందు సన్నవల్వలను ప్రవేశ పెట్టినారు. పురాణమున ప్రాకార నిర్మాణమున తూర్పు సముద్ర

తీరమునగల మహేంద్రగిరి యుండుటచే ఆంధ్రవిష్ణువునకు పర్యాయముగా 'తూర్పు సంద్రపు పొలిమేర లేలిక' యనివాడుట సమంజస రంజితము.

కావ్యశిల్పము:-

"జో! సామీ, మముగన్న యేలిక! యిదో జోహారు! నా
శ్రీశైలంబున బెద్దకొండదరి గర్వీభూత చేతస్కుడై
యీశారాధన లబ్ధదోర్బలుడు దైత్యేద్రుడు లేడా! బిభు
క్షాసంపూర్తికి నోచుకోముగద! కన్నా! వాని దుశ్చేష్టలన్

అని ప్రభు దర్శనముతో. ప్రభు కీర్తనతో, కిరాత సర్దారులు తమ కష్టమును చెప్పుకొనుటతో ఈ కావ్యము ప్రారంభమైనది. శ్రీకాకుళ వర్ణనతో సమాప్తమైనది.

శ్రీ కృష్ణవేణీ గరిష్ఠ పాథస్తరం
గాహత ప్రాకారమైన యదియు
రాజ రాజాంధ్ర విష్ణుని రాజధాని
కలుషములకెల్ల పిడుగు శ్రీకాకుళంబు
కన్నులకు గట్టినట్లుగ గానబడెడు
వేదకాలమునాటి ముత్తైదువట్లు

కలుషములకెల్ల పిడుగు శ్రీకాకుళంబు-పాపములను పోగొట్టునదని పలికి పుణ్యక్షేత్రమను విషయమును ధ్వనింపజేసినారు. ప్రారంభమున దైవదర్శనమువలె స్ఫురింపజేసి అంతమున పుణ్యక్షేత్రమను భావమును కలుగజేయుట చారిత్రకాంశములకు చరితార్థతతోపాటు ఆద్యంతములకేకత్వము సిద్ధించినది. ఆద్యంతములందే కాక 'ఆదిమధ్యాంతాని' అన్నట్లుగా కథామధ్యమున విష్ణువును ప్రత్యక్షము చేసినారు. ఆంధ్రవిష్ణు బాణాఘాతము వలన ప్రాణములు వదలుచున్న నిశుంభునియందు వైష్ణవ చిహ్నములు గోచరింపజేసిన పద్యమిది.

ఉదయ మార్తాండ నీలోత్పల బంధు కాం
తులు తోచె లోచనాంచలములందు
చారు కౌస్తుభమణిచ్ఛవులు క్రమ్మె నసృజ్న
దమ్మైన వక్షఃస్థలమ్మునందు
తన కుటుంబము తలంచిన విశ్వనహన భా
రమ్మయ్యె గర్భ గోళమ్మునందు
అఖిల వేదాంత విద్యాశ్రియ వైరాగ్య
విస్ఫూర్తి గలిగె హృద్వీథియందు

ఆంధ్రవిష్ణువు శ్రీమికుళాధినేత
శ్రీ సుచంద్రాత్మజు పృషత్క శేఖరమ్ము
హృదయ నిర్భేదముగ నాటు నింతలోన
నాంధ్రవైరి నిశుంభదైత్యాధిపునకు

విష్ణుమూర్తికి కన్నులు సూర్యచంద్రులు. ఆయన వక్షఃస్థలమున ధరించనది కౌస్తుభమణి. విశ్వభారవహానుడు. ఉపనిషద్విద్యా ప్రతిపాదితమైన వ్యక్తి. ఈ విషయములన్నింటిని నిశుంభుని యందు తోపింపజేయుట విశ్వనాథ ప్రతిభకు ప్రతీక.

ఇట్లే విశ్వనాథవారే వర్ణన గావించినను కథాభాగముతో ముడి వడి తదభిముఖముగా నుండును.

శ్రీకాకులము కృష్ణానది ఒడ్డున గలదను నంశమును కథా గమనమునకు భంగము రాకుండగా ఆలంకారికముగా చెప్పుటలో కడుగడుసరితనము నుపయోగించినారు కవిగారు.

త్రాసితలోక మాంధ్ర వసుధాపతి సైన్యము. వీరకోటి బా
హాసముదీర్ణ ఖడ్గ గళితాంచిత కాంతులు నుద్వ్యగాగ వ
ర్షా సమయోగ్రశైల కుహరస్రుత నిర్ఝరమట్లు వచ్చి కృ
ష్ణా సరిదుల్లసత్ఫణి ఫణామణి కాకుళమంత చేరగన్

దీనికి తోడు 'మునుగన్నుయేలిక, జిడ్డుదేర, పేరెములువారు, పిట్ట పిడుగు, బట్టబయలు, కన్నులకు గట్టినట్లు, ఆటసాగని విధమున మొదలగు తెలుగు పలుకుబడులు కవిగారి యాంతర్యమును పాఠకులకు పట్టియిచ్చి రచనకు విశిష్టతను జేకూర్చుచున్నవి. మరియు బుభుక్షా సంపూర్తికి నోచుకోముగద! (కడుపునిండుగాకూడ తినుటకు నోచుకోలేదనుటకు) మాకున్ వాని గురించియేకలద. (మేము కూడ అతని గురించియే ఆలోచించుచున్నామనుటకు) ఈ వరకు బేర్పైన్‌గాక (ఇంతవరకున్నాడుగాని) లోననుకొనుటొండె జాగుగ (మనస్సులో అనుకొనగానే) మొదలగు వాక్య విన్యాసాదులు విశ్వనాథవారి తెలుగు నుడికారపు సొంపునకు పట్టుగొమ్మలు.

ప్రతిభావంతుడైన కవి ప్రయోజన రహితముగ దీర్ఘ సమాసములు వాడడు.

నిశుంభుడింతవరకుండుటకు కారణమును గూర్చి వాడిన సమాసమిది. 'ఖండేందు చూడామణి శ్రీ కంఠచ్ఛవిరక్ష'

కిరాత సరదార్ల జయజయధ్వని వైశిష్ట్యమునకు "తదానన దివ్యజయారవ ప్రతిధ్వనితము"

ఆంధ్రవిష్ణువు బాణాగ్ని యొక్క విశిష్టతను చెప్పుటకు 'దైతేయేంద్ర దేహోద్గత ప్రాంచత్పావకకీల'

సెలయేటి దైర్ఘ్యముద్వారా సైన్యాధిక్యమునుసూచించుటకు 'వర్షాసమయోగ్రశైలకుహర స్రుత నిర్ఝరము'వంటి సమాసములు ప్రయోజనార్థము వాడబడినవి.

శ్రీకాకుళమును, వేదకాలమునాటి ముత్తైదువట్లు' అని అనుట విశ్వనాథ వారియొక్క సంప్రదాయానురక్తికి, ఊహా వైభవమునకు తార్కాణము.

లక్ష్యము :-

ఆంధ్రవిష్ణుని రాజధానియైన శ్రీకాకుళము ప్రాచీనాంధ్ర సంస్కృతికి, శిల్ప విన్యాసమునకు ప్రతీకయనియు క్రీ॥ పూ॥ నుండియే ఆంధ్రులు విశిష్టులనియు చాటి చెప్పుట విశ్వనాథవారి లక్ష్యము.

## శా త వా హ నుం డు

చారిత్రిక నేపథ్యము :-

కథా సరిత్సాగరమునగల సాతవాహన కథ

దీపకర్ణి రితిఖ్యాతో రాజాభూత్ ప్రాజ్యవిక్రమః
తస్య శక్తిమతీనామ భార్యాప్రాణాధికా భవత్
రతాంత సుప్తాముద్యానే సర్పస్తాంజాతు దష్టవాన్
గతా యాం పథ పంచత్వం తస్యాం తద్గత మానసః
అపుత్రోపి సజగ్రాహ బ్రహ్మచర్యవ్రతం నృపః
తతః కదాచిద్రాజ్యార్హ పుత్రాసద్భావ దుఃఖితం
ఇత్యాదిదేశ తం స్వప్నే భగవానిందు శేఖరః
అటవ్యాం ద్రక్ష్యసి భ్రామ్యన్ సింహారూఢం కుమారకం
తం గృహీత్వా గృహం గచ్ఛసతే పుత్రో భవిష్యతి........
ధనదస్య సఖాయక్షః సాతో నామాస్మి భూపతే
సోఽహం స్నాంతీ మపశ్యం ప్రాగ్గంగాయాం ఋషి కన్యకాం
సాపి మాం వీక్ష్య సంజాత మన్మథాభూదహం తథా
గాంధర్వేణ వివాహేన తతో భార్యాకృతామయా
తచ్చ తద్బాంధవా బుద్ధ్వా తాంచ మాంచాశపన్ క్రుధా
సింహౌ భవిష్యతః పాపౌ స్వేచ్ఛాచారౌ యువామితి
పుత్రజన్మావధిం తస్యాః శాపాంతం మునయో వ్యధుః
అద్యచాహం విముక్తోస్మి శాపాద్బాణాహతస్త్వయా

తత్ గృహాణ మహాసత్వం మయా దత్తముముంసుతం ..
సరాజా తం సమాదాయ బాలం పత్నీత్యాయయౌగృహం
సాతేన యస్మా దూఢోఽ భూత్తస్మాత్తం సాతవాహనం
నామ్నా చకారకాలేన రాజ్యేచైనం న్యవేశయత్

శాతవాహనుని గూర్చి అనేక గాథలు కలవు. విశ్వనాథవారు వ్రాసిన కథ, కథాసరిత్సాగరమున గల కథకు సంబంధించినది.

దీపకర్ణియను రాజు దక్షిణా పథము నేలుచుండెను. అతని రాణి శక్తిమతి సర్పదష్టయై మరణించినది. భార్య మరణ మొక వంక. పుత్రులు లేరని మరియొక వంక విచారించుచుండగా స్వప్నమున శివుడు కనిపించి వేటకు అడవికి పొమ్మనియు, అచటసింహముపై బాలుకుండుననియు వానిని తీసికొనివచ్చి పెంచుకొనుమనియు చెప్పెను.

ఆరాజు అట్లే అడవికిపోయెను. అక్కడ అతనికి ఒక బాలుని తనపై నెక్కించుకొని తిరుగుచున్న సింహము కనిపించెను. కొంత సేపైన పిమ్మట బాలుని క్రిందకుదింపి నీరు త్రాగుటకు సరస్సు లోనికి దిగినది. సమయము కనిపెట్టి బాణముతో సింహమును గాయ పరచెను. అంత సింహము మనిషిగ మారి తాను సాతుడను యక్షుడననియు, రహస్యముగా నొక ఋషి పుత్రికను పెండ్లాడితిననియు అది తెలిసిన ఋషి మమ్మిరువురను శపించె ననియు, పుత్ర జననముతో అతని భార్య శాప విముక్త అయ్యె ననియు, నీ బాణము తగులుటతో నా శాపము గతించెననియు చెప్పి, బాలుని దీపకర్ణికిచ్చి అదృశ్యుడయ్యెను. శివ వచనమును స్మరించుకొనుచు రాజు ఆ బాలుని ఇంటికి తీసికొనిపోయి, సాతుని(సింహము) వాహనముగ ఉపయోగించి యుండుట వలన అతనికి సాతవాహనుడని పేరు పెట్టెను. దీనిని బట్టి దీపకర్ణి మహారాజు ఇంకొక ఆంధ్రగణమునకో

యక్షరాజ కుటుంబమునకు చెందిన బాలుని దత్తపుత్రునిగా స్వీకరించి యుండవచ్చునని మనము భావించవచ్చును. ఈ బాలుడే సాతవాహన వంశమునకు మూలకర్త.

## కథా సంగ్రహము :-

శాపవిముక్తుడైన గంధర్వుడు దీపకర్ణితో నిట్లనినాడు సర్వాంగ సుందరముగా నున్న ఒక గంధర్వ కన్య కృష్ణానది యిసుక తిన్నెపై నొక గంధర్వ కుమారుని కలిసినది. ఇర్వురి మనస్సు లేకమైనవి. అందు గంధర్వుడను నేనే. ఈ బిడ్డను ప్రసవించినా అర్ధాంగి పరమపదించినది. మునుల శాపవశమున నేనా సింహరూపమును దాల్చి సంచరించుచుంటిని. నా పేరు శాతుడు. ఆంధ్రరాజ వైన నీకొరకు ఈ బాలుని పెంచుచుంటిని. ఈతడు సామాన్యుడు కాడు. శతృవులితని పాదములపై వ్రాలి నమస్కరింతురు. నీభార్య శక్తిమతి చనిపోవుట ఒకవిధముగా నీకు మేలే జరిగినది. ఇతనికి నా రాజ్యమిచ్చి పట్టము గట్టుమని చెప్పి యక్షు డంతర్ధానము పొందెను.

పద్మ పత్రముల వంటి ఆ బాలుని జూడగానే దీపకర్ణి అనురాగ హృదయుడై కన్నీరు కారుచుండగా కుమారా! నీకనురెప్పలు నాభార్య శక్తిమతి కంటిరెప్పలను బోలియున్నవి. నీకు ఆంధ్ర దేశము దైవసమైనది. నాకంఠమును కౌగలించుకొనుము. నా కులము నకు పెంపుగడింపుము. ఆంధ్రవిష్ణువు నీవిచ్చు తర్పణములను స్వీకరించును. నిన్ను దీపకర్ణి సంతానముగా ప్రజలు గొలుతురు. తెలుగు రాజుల వంశము నీపేరిట శాలివాహన వంశముగా పిల్వబడును. అని పలికిన దీపకర్ణి బాలుని నెత్తికొని శ్రీకాకుళ మార్గమును పట్టెను.

## చరిత్ర - కావ్యములసమన్వయము :-

శాతవాహన రాజు క్రీ॥పూ॥ 225-220 నడుమ ఆంధ్ర సామ్రాజ్యము స్థాపించి యుండవచ్చునని చరిత్ర కారులు తలంచుచున్నారు.

కథా సరిత్సాగరము నుండి ఉట్టంకించిన కథకును, విశ్వనాథ వారు వ్రాసిన దానికి భేదము లేదు. అయితే విశ్వనాథవారు ఆంధ్ర విష్ణువును తెనుగు రాజుల కాది పురుషునిగా దీపకర్ణి చేత చెప్పించుట గమనింప దగినది. ఈ సంగతి కథాసరిత్సాగరము నందు లేదు. ఈ కాలమునకే ఈ వంశమువారికి కృష్ణానది ఒడ్డున నున్న అమరావతి ముఖ్యపట్టణము. తత్పూర్వ రాజులకు శ్రీకాకుళము రాజధాని. మూలమున లేని శ్రీకాకుల ప్రస్తావన కావ్యమున గలదు. దీపకర్ణి బాలుని తీసికొని శ్రీకాకుళ మార్గము పట్టినాడు. దీపకర్ణి బాలునితో పలికిన మాటలన్నియు విశ్వనాథ కల్పితములు.

ఇక శాతవాహనుని తల్లిదండ్రులైన సాతుడు, మునికన్యను గూర్చి జాతి సాంకర్యముగా చరిత్రకారులు వక్కాణించిరి.

## కావ్యశిల్పము :

ఇందలి కథ కృష్ణానదీ పులిన సీమపై జరిగిన సంఘటనతో ప్రారంభమై వసంతారామ ప్రస్తావనతో ముగిసినది. అనగా దీనివలన కథాంశమైన-నదీప్రాంతమున పుట్టిన శాతవాహనుని, దీపకర్ణి మహారాజు తన పట్టణమునకు దీసికొని వచ్చుట సూచింపబడుచున్నది. ఆ ప్రారంభ పద్యమిది.

కాషాయ రమ్యవల్కల హుతాశన శిఖా
సంపిహితాశ్వత్థ సామిధేని
భువన మోహనహేతు నవవయః ప్రత్యూష
స్సమయ రోచిః పూర్ణ చంద్రరేఖ
కుపిత శంకర నేత్ర కుహరాగ్ని దగ్ధమ
న్మథ దేవునకును ప్రాణ పతిష్ఠ
అమిత లావణ్య నీలాకాశ పశ్చిమా
శా చరత్సిత నూత్న జలదశకల

మొక్క ఋషికన్య జలకలశోజ్జ్వలాంస
లలిత కృష్ణానదీ ముక్త పులిన సీమ
గలసి కొనె నొక్క యక్షుని, గలసె వారి
యమృత లజ్జాతి మధుర నేత్రాంచలములు

ఋషికన్య సౌందర్యాను వర్ణించు పద్యమిది. అది అశ్వత్థ సమిధ; అగ్నిశిఖ చేత చుట్టబడినది. అగ్నిశిఖము కాషాయ రమ్య వల్కలముతో పోల్చబడినది. ఆమె మునికన్య. నార చీర ఆమె వస్త్రము. అది కషాయ వర్ణము. కనుకనే కషాయ వర్ణమైన అగ్నిశిఖ చుట్టిన అశ్వత్థసమిధతో పోల్చబడినది. మునికన్య కనుక కాషాయ వల్కల ప్రస్తావన తెచ్చుట ఔచిత్య శోభితము. అశ్వత్థ సమిధతో పోల్చుట ఆమె పవిత్రతను వ్యంగ్య మొనర్చు చున్నది. ఆమె గంధర్వునితో కలియుట కేవలకామవాంఛకు పరిమితము కాదు. అది అట్లుండనిండు.

ఈ సీసపద్యమందలి ఉపమానములచే ఏతత్ కథాంశము లన్నియు సువ్యక్తము లగుచున్నవి.

మునికన్య అగ్నిచేత చుట్టబడిన సమిధ. అంటే కాలిపోవుచున్న సమిధ. కథలో సుతుడు పుట్టిన తోడనే మునికన్య గతించినది.

భువన మోహన హేతువైన చంద్రరేఖ రెండవ పోలిక: గిజానకు ఆమె ఆంధ్రరాజ్య భువన మోహన హేతువే. దీపకర్ణి మాటలలో మునికన్య కుమారుడైన శాతవాహనుడు అతని వంశము వారికి చంద్రదర్శనమే. ఆ పద్యమిది.

నా తరువాత నాయక వినాకృత యౌటకు రాజ్యలక్ష్మియున్
బ్రీతి జలాంజలిన్ విడువ బిడ్డలు లేమి పితృవ్రజంబు, శో
కాతి విషణ్ణులై మసెదరన్న! భవన్ముఖ చంద్ర దర్శన
స్ఫీతుల జేసి నాకులము పెంపు. గడింపుము తండ్రి! రమ్మురా!

మన్మథ దేవునకు ప్రాణ ప్రతిష్ఠ మూడవ పోలిక. దీప కర్ణికి కుల దైవము శివుడు. శంకరుని కోపకారణ మేమో-మన్మథుని వంటి సౌందర్యవతి. శక్తిమతి పాము కరచి చనిపోయినది. ఇచట స్త్రీని పురుషునితో పోల్చుట జరిగినది. ఈ సమయము నందు అందమే ప్రధానము. శక్తిమతి అందమైన దనుటకు ఆమె కనురెప్పలను దీప కర్ణి మరువ లేకపోయినాడు. తనకు దొరికిన బాలుని కనులు ఆమె కనురెప్పలను బోలియున్నవట.

కనుగొన లందు బాష్పములు గ్రమ్మగ, కంఠము రుద్ధమౌచు నా
యున! చనుదెమ్ము నీ చిరుతలైన కరమ్ములు నాగళమ్మునం
దున బిగియింపు! శక్తిమతి తొంగలి రెప్పల బోలి యున్ననీ
కనులకు నాంధ్ర దేశమది కైవస మయ్యెనురా! కుమారకా!

దీప కర్ణికి మన్మథ దేవుడైన శక్తిమతి యొక్క ప్రాణ ప్రతిష్ఠ వంటివాడు శాతవాహన బాలుడు.

నూత్న జలద శకలము నాలుగవ పోలిక. ఆంధ్ర వంశ రాజుల వంశమను నీలాకాశమునకు నూత్న జలద శకలము వంటి వాడు బాలుడు. ఈ బాలునితో శాలివాహన వంశము నూత్నముగా ప్రారంభమైనది. దీనిని గూర్చి కూడ దీపకర్ణి వక్కాణించుట జరిగినది.

తెనుగున్ రాజుల వంగ సంబిక భవద్వ్యాంకమై శాలివా
హన వంశంబని పిల్వగా బడెడుగా, కౌ రాఘవుండున్ గడిం
చని దీకీరితి వంశ కర్తగుట సామాన్యంబె! లేరెందర
య్యన వంశ్యుల్? రఘు వంశమైనయది కాదే! యామహారాజుపై

అవును, వంశ కర్తగుట సామాన్యము కాదు. ఆ రఘురామునికే లేదు. రఘువునకు దక్కిన దా కీర్తి. అట్టిది శాతవాహనునకు దక్కినది.

ఆ నూత్న జలద శకలము పశ్చిమాశా చరిత్రితము. శాలి వాహ నుడు తన రాజ్యమును పశ్చిమ దిక్కునకు వ్యాపింప జేసినాడు. ఈ

విషయమును కూడ విశ్వనాథవారు దీపకర్ణి నోటివెంట పలికించినారు.

ఈ నిఖిలాంధ్ర రాజ్యరమ కేలిక పొదుపు, దీపకర్ణి సం
తానము నాగ నిగ్గొనుచు ధాత్రిజనావళి, ప్రాక్పయస్సముద్రమం
దానిన నీరు పశ్చిమ మహాంబుధి ద్రావుము, గ్రుక్కనీరు గం
గానది జేసి పూర్వాంధ్రునకు కంఠలగన్నను పోదవోయుననన్.

'ప్రాక్పయస్సముద్ర మందానిన నీరు పశ్చిమ మహాంబుధి ద్రావు' మనునది ఇచట ప్రసక్త విషయము.

విశ్వనాథ వారెప్పుడైనను సంప్రదాయమును మరువరు. అది వారికి ప్రాణము. వారి రచనకు జీవధాతువు.

బాలుడైన శాతవాహనుడిచ్చు తర్పణములను పూర్వాంధ్ర రాజైన ఆంధ్రవిష్ణువు కూడ స్వీకరించునట.

తెనుగున్ రేడ్లకు నాది పూరుషుడు దైతేయాంతకుం డాంధ్రవి
ష్ణుని లక్ష్మీకుచ కుంకుమారుణ కరస్తోమంబు నీవిచ్చు త
ర్పణముల్ గైకొన జాపగా గనుము రారా కుఱ్ఱ! నీ యుందహో
సనవ జ్యోత్స్నలు చూడ శక్తి మతి నోచన్ లేదురా పుత్రకా!

అడుగడుగున ఇట్లు సంప్రదాయానురక్తిని విశ్వనాథవారు ప్రకటించుచుందురు.

మరియు వారు వాడిన ప్రతి దీర్ఘసమాసము సప్రయోజనము. మచ్చునకొకటి.

నీ వాంధ్రేశ్వరు డౌదు, శాపవిధ మంతే, శాతుకన్ నేను, నా
త్రై పిసింగని పెద్ద జేసితిని రాజా! వీడు కోదండ బా
హా విధ్వస్త దిగంత రాహిత ధరా ప్రాణేశ చూడామణి
గ్రీవా మంజుల హార రత్న రుచిర శ్రీపాద కంజాండగున్

శాతుడు తన కుమారుని కోదండ పాండిత్య విశిష్టతను దీప

కర్ణితో చెప్పు సందర్భమున వాడబడినది. ఆ దీర్ఘ సమాసము ద్వారా బాలుని పరాక్రమము వ్యంజింప బడుచున్నది. ఇది కావ్య శిల్పము లోని భాగము.

"అమలోదాత్త మనీష నేనుభయ కావ్యప్రౌఢి బాటించు శిల్పమునం బారగు'డనని చెప్పుకొన్న తిక్కన్న కౌరవ సైన్యాధిక్యమును జాటుటకు ఉత్తరుని నోటి వెంట "భీష్మద్రోణ కృపాది ధన్వినికరాభీలంబు" అను దీర్ఘసమాస సంభరిత పద్యమును పలికించుట పండిత విదితము.

ఈ శిల్ప చమత్కృతి నెరింగిన వాడు గనుకనే విశ్వనాథ తిక్కన్నను "తిక్కన శిల్పపు తెనుగు తోట" అనినుతించుట జరిగినది.

అది యట్లుండగా ఈ ఖండిక యందొక చోట అనౌచిత్యపు భావము దొరలినట్లు నాకనిపించు చున్నది. నాకే కాదు శ్రీపాద గోపాల కృష్ణమూర్తిగారి వంటి పాండిత్య ధనులకు కూడ వెగటు పుట్టించినవి. వారే ఇట్లని నారు.

"సాతవాహనుడు'లో యక్షుడు దీపకర్ణితో 'నీ నలినాక్షి శక్తిమతి నిద్రిత శయ్యను సర్పదష్టయై ప్రాణములం దృజించుట శుభ ప్రతిపాదకమయ్యె నేటికిన్' అని మహా యెబ్బెట్టుగా పెండ్లి దివిటీ సామ్యము చెప్తాడు. "శక్తిమతి పోయిన నాటి నుండి నీకు, పాపము, ఆశా కిరణమే లేదు. ఇదుగో ఈ నాటికీ బాలుడు." అని యక్షుని చేత ననిపించే నేర్పు విశ్వనాథ వారికి లేదనను నేను, ఎవ్వరూ అనరు. లేనిదల్లా లక్ష్యము. తాము అన్నది ఎటు లాగుతుందో రెండోసారి చూసుకోరను కుంటాను. లేకుంటే, శక్తిమతి తొంగలి రెప్పలను ఆ బాలునికి అమర్చిన వాడు యక్షుని చేత నామెను తగలేయిస్తారా?"

అర్థ శతాబ్దపు - ఆంధ్ర కవిత్వము.

అయితే విశ్వనాథ వారట్లు వ్రాయరను దృఢమైన నమ్మక

ముండుటచే ఆలోచింపగ ఇట్లుతోచు చున్నది. ముందు పద్యమును చదువుట మంచిది.

నీ నలినాక్షి శక్తిమతి నిద్రిత శయ్యను సర్పదష్టయై
ప్రాణములన్ త్యజించుట - శుభ ప్రతిపాదకమయ్యె నేటికిన్
వీని సమస్త రాజ్య పదవీస్థితు జేయుము, జీవితాంత సం
ధ్యానవ వేళ నీ ముసలి యంశము కొంచెము విశ్రమించుతన్

శక్తిమతి సర్పదష్టయై మరణించుట, నేటికి శుభము తెలుపునది యయ్యెను-శక్తిమతి మరణించిన తరువాత నేటికి శుభము కలిగినది. అని విశ్వనాథ వారి భావము కావచ్చును. ఆ రెండు వాక్యములను వేర్వేరుగా భావించినచో అనౌచిత్యము కొంత వరకైన పరిహరింప వచ్చునని నా తలంపు. విజ్ఞులు పరిశీలింతురు గాక!

లక్ష్యము :-

శాతవాహనుని కాలమందు విశాల సామ్రాజ్యాధిపతులైన తెలుగువారు నేడు స్వాతంత్ర్య హీనులుగా నుండుట కూడదని హెచ్చరించినట్లైనది. పూర్వాంధ్ర రాజులు విశిష్ట కారణ జన్ములని విశద పరచుట అంధ్రులను శిరసెత్తుకొని తిరుగునట్లు చేయుచున్నది.

---

# గౌతమి పుత్ర శాతకర్ణి

## చారిత్రక నేపథ్యము :-

ఈ శాతకర్ణి 'గోతమి' యను తల్లికి కుమారుడగుటచే ఈతనికి గోతమి పుత్ర శాతకర్ణి యనిపేరు. గౌతమీ పుత్ర శాతకర్ణియని కూడ అనవచ్చును. ఇతడు క్రీ. శ 78 ప్రాంతమున ధాన్యకటక

సింహాసన మధిష్ఠించెను. మిక్కిలి హీన స్థితిలో నున్న శాతవాహన ప్రతిష్ఠ నితడు పునః ధ్ధరించెను. చిరస్మరణీయమైన గౌతమీ బాలశ్రీ వేయించిన 'వాసిష్ఠీ పుత్ర పులోమావి నాసిక శాసనము'ను బట్టి ఇతని దిగ్విజయ పరంపర, వ్యక్తిత్వము తెలియు చున్నవి.

ఇతని పశ్చిమ దిగ్విజయము ప్రాగాంధ్రము నుండి ప్రారంభింపబడి ములక, అసిక, అకరావంతి, విదర్భ సౌరాష్ట్రముల విజయముతో పూర్తిగావింపబడెను. దక్షిణ దిగ్విజయమును ఆంధ్రద్రవిడ దేశముల మధ్య భాగమును జయించి, చోళ రాజ్యముపై విజయ యాత్ర సాగించి దక్షిణ సముద్రము వరకు పోయి జయ లక్ష్మితో తిరిగి వచ్చెను. కనుకనే ఇతని కాలమున ఆంధ్ర రాజ్యము గంగా తీరము మొదలుకొని కాంచీపురము వరకును వ్యాపించినది. త్రి సముద్ర తోయ పీత వాహనుడని శాసనము నందు కొని యాడబడి నాడు. ప్రియ దర్శనుడు, చారు గమనుడు, ఏక బ్రాహ్మణుడు, ఏక ధనుర్ధరుడు. క్షహరాట వంశమును నిర్మూలించిన వాడు. తల్లికి అవిచ్ఛిన్నమైన శుశ్రూష చేయువాడు. తన పేరునకు ముందు తల్లి పేరును దాల్చిన వాడు, దక్షిణాధిపతి బిరుదాంచితుడు.

మహా రాష్ట్రములో దొరికిన పదమూడు వేల నహపానుని నాణెములలో తొమ్మిదివేల నాణెముల వెనుక, 'రాణ్ణో గోతమి పుతా ససిరి శాతకానినో' అని గోతమీపుత్ర శాతకర్ణి పేరు ముద్రించి యుండుట ఇతని విజయ పరంపరలకు చిహ్నము.

ఈ నహపానుని సంహరించుటయే నాటకము నందలి కథాంశము.

కథా సంగ్రహము:-

గౌతమీపుత్ర శాతకర్ణి నహపానునిపై దాడి వెడలుటతో నాటకము ప్రారంభమైనది.

రణభేరులు ఒంటెలపై పెట్టినారు. వారకాంతలు నాట్యములు సలుపుచున్నారు. సరదార్లు గుర్రములను కథను ద్రొక్కించుచున్నారు. ధానుష్కులు నడుచుచున్నారు. గజసైన్యముతో ఉక్కు తునకల వంటి ఆంధ్ర సైనికులు నడుచుచున్నారు.

విజయయాత్రకు గౌతమీపుత్ర శాతకర్ణి బయలుదేరగనే బట్టువారు కైవారములు పట్టిరి. పుణ్యస్త్రీలు అక్షతలు చల్లిరి. కొందరు త్రిపుర సంహార కేళి పాటలు పాడుచు నెదురు వచ్చిరి. మరికొందరు గౌతమీపుత్ర శాతకర్ణి మాళవ రాజును చంపిన విధమును గూర్చి ముచ్చటించుకొనుచు నాతని సాహసమును నుగ్గడించిరి. ప్రభువు రథము దిగ్గి ముత్తైదువులకు నమస్కరించి వారిచ్చు పుష్పాదులు గైకొని, దీవెన లందుకొని రథమునధిరోహించెను. ధాన్యకటక నగర వీథులు దాటి, అమరావతీ పట్టణమున అగిన సైన్యము విశ్వవిద్యాలయ విజయ గీతికల విని కృష్ణానదికి వాయవ్యదిశగా పయనించినది. ఆంధ్ర భూములు గడచి సాగుచుండగా శాతకర్ణికి సహాయ పడువాడై ప్రతిష్ఠాన పురము నుండి తన సైన్యముతో వాసిష్ఠీ పుత్ర పులోమావి వచ్చిచేరెను. అగ్నికి వాయువు తోడైనదని సైన్యములనుకొనుచు సౌరాష్ట్రము వంకకు తిరిగినవి. తెలుగు శూరులు ప్రవేశించినంతనే నహపానుని రాజ్యలక్ష్మి వెల వెల బోయినది.

దుర్గములు పెకిలింప బడినవి. ఆంధ్ర సైన్యాగ్నికి క్షాత్రపుని వంశము దగ్ధమైనది. సౌరాష్ట్ర శేషదుర్గ శిఖరాగ్రములపై త్రిలింగ దేశ పతాక అలంకరింపబడినది.

## చరిత్ర - కావ్యముల సమన్వయము :-

వాసిష్ఠీ పుత్ర పులోమావి నాసిక శాసన మాధారముగా చరిత్రకారులు గౌతమీ పుత్ర శాతకర్ణి విశిష్టతను వక్కాణించిరి. ఈ శాసనమున రాజు పేరు గల భాగము పోయినందున ఇతరాంశములను

బట్టి పులోమావి శాసనముగా చారిత్రకులచే పరిగణింప బడినది. ఈ శాసనాంశములను కొన్నింటిని విశ్వనాథవారుపయోగించి కొనినారు.

గౌతమీ పుత్ర శాతకర్ణి 'క్షహ రాటవంశ నిరవశేష కరు'డను దానిని నాధారము చేసికొని రచించిన దీఖండిక. ఇందు స్త్రీల యెడ ఇతనికి గల గౌరవము వెల్లడింపబడినది. పులోమావి సౌరాష్ట్ర దండ యాత్రలో గౌతమీ పుత్ర శాతకర్ణికి సహాయ పడిన వ్యక్తి. దానిని కూడ విశ్వనాథవారు చక్కగా ఉపయోగించు కొనినారు.

గౌతమీ పుత్ర శాతకర్ణి భార్య పేరు వాసిష్ఠీదేవి. గౌతమీ బాలశ్రీ కోడలు. పులోమావి తల్లి. తల్లి పేరును తండ్రివలె తన పేరునకు ముందు ధరించినాడు. ఉప రాజధానియైన ప్రతిష్ఠానమున నుండి సామ్రాజ్యము యొక్క పశ్చిమ భాగములను శాసించు చుండెను. ఈ దండ యాత్రలో మార్గ మధ్యమున సైన్యముతో వచ్చి తండ్రిని చేరుకొనినాడు. కనుకనే దిలీప మహారాజునకు రఘువు వలె తండ్రి విజయములకు చేదోడు వాదోడుగా నున్నట్లు ఇతనిని గూర్చి చరిత్ర కారులు నుడివిరి.

## కావ్య శిల్పము :-

ఈ ఖండిక యుద్ధ యాత్రలో ప్రారంభమై తల్లక్ష్యమైన నహపానుని సంహరించి సౌరాష్ట్ర దుర్గముపై తెలుగు పతాక నెగుర వేయుటతో ముగిసినది.

శాసనములోని గౌతమీపుత్ర శాతకర్ణి విశిష్టతను దెలుపు అంశముల నన్నింటిని కథాగమనమునకు జోడించుటలో విశ్వనాథవారు చరితార్థులైనారు.

బట్టువారు కైవారములు పట్టు పద్యమున శాతకర్ణి విశిష్టతను వక్కాణించు శాసనస్థ విషయము లన్నియు చోటు చేసికొన్నవి.

"జయ జయ గౌతమీ సాధ్వీమహాగర్భ
జనిత ముక్తాఫల! జయము జయము
జయ జయ ఆంధ్ర భూచక్ర రక్షాదక్ష
సవ్య బాహాదండ! జయము జయము
జయ జయ పార్థైక సామాన్య ఘన ధను
శ్శాస్త్ర ధిక్కృతరిపు! జయము జయము
జయ జయ నల హరిశ్చంద్ర పురూరవ
శ్చక్రవర్తి సమాన! జయము జయము"

ఇందలి సంబోధన లన్నియు శాసనము నందలి ఏక ధనుర్ధరుడు, రామకేశవార్జున భీమసేనులతో సమాన పరాక్రముడు మొదలగు వాటిని దృష్టిలో పెట్టుకొని రచించినవి.

వినయ వంతుడు, పౌరజనములతో సమానములైన సుఖ దుఃఖములు కలవాడు – అను విషయములను యుద్ధ యాత్రకు పోవు రాజును ముసలి ముత్తైదువులు దీవించు నపుడు సన్నివేశాను గుణముగా వ్యక్తీకరించినారు. విశ్వనాథ వారే వర్ణన గావించినప్పటికి నది వస్తువుతో కలిసి పోవునట్లు, కథాగమన పరిపోషకముగా నుండునట్లు వక్తవ్యాంశము చోటు చేసి కొనునట్లు చక్కగా కుదురను.

తన యరదంబు నుండి పతి ధాత్రికి డిగ్గి కృత ప్రణాముఁడ
య్యెను దలనేల దాకుగతి, వృద్ధ సువాసిను లిచ్చు కుంకుమం
బును బ్రసవంబులున్ గొని నమోనమ యంచు రథంబు నెక్కినం
తన జయమంత సిద్ధము యనన్ దన సైన్యము లెల్ల నార్వగన్

ప్రభువు రథము దిగుట, తల నేలకు తాకుగతి ముత్తైదువులకు నమస్కరించుట, వారిచ్చు కుంకుమ, పూవులు గ్రహించుట, అట నుండి తొలగుట ముందుగా మరొకసారి వందన మాచరించి రథ మెక్కుట అనునవి – గౌతమీపుత్ర శాతకర్ణి యుద్ధ యాత్రను చెప్పు

టతో పాటు, ప్రజలతో ఆయనకు గల సాన్నిహిత్యమును, స్త్రీలయెడ గౌరవమును, వినయమును వ్యక్తము చేయుచున్నవి.

కేవలము చరిత్రను చెప్పుటకు విశ్వనాథ వారంగీకరింపరు. దానిని కళాత్మకముగా చెప్పుట ఆయనకు కావలసినది. చెప్పుటలో ఒక ఒడుపుండును.

గౌతమీపుత్ర శాతకర్ణి కొడుకు పులమావి. అతడు వాసిష్ఠీ కుమారకుడు. యువరాజు ప్రతిష్ఠాన పురమును పాలించు చున్నవాడు. సైన్యముతో వచ్చి తండ్రికి యుద్ధమున సహాయము పడినవాడు. ఈ విషయములను కథాగమనములో కలిసి పోవునట్లు, ఆలంకారికముగా, జాతీయ పద ప్రయుక్తముగ వ్యక్తీ కరించిన పద్యమిది.

గౌతమీ సుత శాతకర్ణి యీ శాతవా
హనుడు తానసలు దావాగ్ని కీల
శ్రీ పులమావి వాసిష్ఠీ కుమారకుం
డాయువరాజు ఝుం ఝూనిలంబు
ఇంక నేమయ్యె సుమ్మీ నహపానుడు
సౌరాష్ట్రమింక భూస్థాపితంబు
క్షాత్రపు డేటికి గడియించు కొన్నాడు
శత్రుత గౌతమీ పుత్రు తోడ
ననుచు గుస గుస లాడి నారాంధ్ర భటులు

---

తండ్రి దావాగ్ని కీల తనయుడు ఝుంఝూ మారుతంబు, ఇంక నేమయ్యె సుమ్మీ, ఏటికి గడియించు కొన్నాడు, భూస్థాపితంబు వంటి ప్రయోగములు కవి గుండెను పట్టి చూపుచున్నవి.

అయితే ఈ ఖండిక యందు అక్కడక్కడ ప్రబంధ లక్షణములు గోచరించు చున్నవి.

"ఆపై గంచు రథాలపై తెలుగు వారన్నన్న యొక్కొక్కడే
మూపన్గల్గును ముష్టి ఘాతముల దిజ్మత్త ద్విపేంద్రమ్ములన్"

తెలుగు వాడొక్కొక్క గుద్దుతో మత్త గజములను సంహరింప గలడనుట అతిశయోక్త్యలంకారమునకు చోటిచ్చుచున్నది.

అట్లే పెద్దన్నగారి ప్రతిభాపటిమ కన్పట్టుచున్న పద్యమిది.
లలితా మోద భర ప్రసూన నవమాలా భూషితుం జేసరు
జ్వల సౌభాగ్యము లెక్కి కుంకుమము లాజల్ చల్లి రంభోజ నే
త్రలు క్రొంజీర చెరంగు మాటువడి యర్ధవ్యక్తమౌ నాననం
బుల శృంగారపు టోర చూపుల సుధాపూరంబు లూరించుచున్

మేడలెక్కి రాజుపై కుంకుమాదులు జల్లుచున్న పుణ్య స్త్రీల శృంగారపు చూపుల యందు అమృతము లూరించుట చదువగానే మను చరిత్ర యందు స్వరోచి ఊరేగుచున్నప్పుడు పురస్త్రీల శృంగార చేష్టలు గుర్తుకు రాక మానవు.

ఏది ఏమైన వర్ణన దృశ్యమును కళ్ళకు కట్టినట్లు చూపుట ప్రతిభావంతులైన విశ్వనాథ వంటి వారికే సాధ్యము.

క్రొత్త చీర చెంగు మాటున సగము కనిపించే ముఖాలలోని శృంగారపు చూపులను చూపించినారు విశ్వనాథ వారు.

సహపానుని శేషదుర్గ శిఖరాగ్ర భాగముపై తెలుగు పతాక ఎగురుచున్న విధమిది.

సౌరాష్ట్రేశ్వరు శేషదుర్గ శిఖరాంచన్మౌళి భాగంబుపై
దారా మార్గ మలంకరింప బడియెన్ త్రైలింగ రాజ్యధ్వజ
స్ఫారోదంచిత లోహిత చ్ఛటల నాసాయంబు సమారంభవే
ళారో చిస్సుల మంద వాయు మృదులీలా వీచికా శ్రేణులన్

కోటపై విను వీధిలో సాయం సంధ్యా కాంతులలో మంద పవ నముల ప్రభావమున రెపరెప లాడు చున్న పతాకను ఎట్ట ఎదుట ప్రత్యక్షము చేయుట పుట్టిన కవులకే సాధ్యము కాని పుట్టి కవులైన వారికి కుదురదు.

లక్ష్యము :-

వింధ్య పర్వతమున కావల గల సౌరాష్ట్ర నహపానుని గౌతమీ పుత్ర శాతకర్ణి జయించె ననుటచే ఆంధ్ర వీరు లెంత పరాక్రమ వంతులో నుగ్గడించు నట్లైనది. నేడు చచ్చు పడియున్న జాతి నాడెంత శౌర్యోత్సాహముతో నుండెనో యనుదానిని గుర్తుచేసి కార్యోన్ముఖ లను జేయుట విశ్వనాథవారి ఆశయము.

* * *

# మాధవ వర్మ

చారిత్రక నేపథ్యము :-

బెజవాడ మల్లేశ్వరస్వామి ఆలయమున ఒక రాతి మీద కేత భూపాలుని శాసన మున్నది. ఆ శాసనమున నిట్లున్నది.

"శ్రీ మద్విజయ వాట్యాఖ్యపురే కృష్ణా విభూషణే।
కలౌ శ్రీ మచ్చాళుక్యాబ్దేబ్ధి శశి సాయక సమ్మితే
రాజా మాధవ వర్మాభూద్విఖ్యాతో ధరణీ తలే।
తత స్స్వపుత్రేణ హతే తంత్రిణీ జీవిని సుతే
ధర్మ సంరక్షణాత్తాన్ యస్స్వపుత్ర మవధీత్స్వరాట్
తతో మల్లేశ్వరః ప్రీతః స్వర్ణ వృష్టిం వవర్ష చ
శిశు పుత్రిక యోః ప్రాణం దత్తవాం స్తస్యకీర్తయే"

దీనికి సంబంధించిన గాథ ఇట్లు ప్రచారములో నున్నది. మాధవ వర్మ కుమారు డొకడు చింతకాయ లమ్ముకొను నొక ముదు

సలి పేదరాలి కుమారుని మీదుగా తన రథ చక్రమును బోనిచ్చెను. ఆ బాలుడు మరణింపగా తనకు ప్రాప్తించిన ఆపదను పేదరాలు మాధవ వర్మకు నివేదించెను. మాధవ వర్మ న్యాయ విచారణ గావించి తన కుమారునకు మరణ దండన శిక్ష విధించెను. అతని న్యాయ బుద్ధికి ఇంద్రకీలాద్రిపై వేంచేసి యున్న మల్లేశ్వరస్వామి మెచ్చి రాజ కుమారుని, పేదరాలి సుతుని బ్రతికించుటయే గాక బెజవాడలో కనక వర్షమును కురిపించెను.

నాటి నుండి దుర్గా మల్లేశ్వరాలయము - కనకదుర్గా మల్లేశ్వరాలయముగా వాడుక లోనికి వచ్చినదని జనవాక్యము.

'ఈ కథ ఒక శాసనము లోనిది' అని విశ్వనాథవారు ప్రారంభమున జెప్పుటను బట్టి ఆ శాసన మిదియే యనుట తేటతెల్లము.

ఆంధ్ర సామ్రాజ్యమును పాలించిన రాజ వంశములలో శాలంకాయనుల తరువాత, తూర్పు చాళుక్య రాజ్య స్థాపనకు పూర్వము విష్ణుకుండిన వంశము ప్రసిద్ధమైనది. ఈ వంశీయుల పరిపాలన కాలము 250 సంవత్సరములు. వీరు ప్రథమమున గుంటూరు జిల్లా లోని వినుకొండ ప్రాంతమును పరిపాలించిరని చరిత్ర కారుల నిర్ణయము. ఈ వంశము వారు 'త్రికూట మలయాధి పతుల'మని తమ శాసనములందు చాటుకొనిరి. గుంటూరు జిల్లాలో నున్న కోటప్ప కొండను 'త్రికూట' మనియు, అందున్న శివ లింగమును "త్రికూటేశ్వర స్వామి" అనియు నందురు. నర్సరావుపేటకు సమీపమున బ్రహ్మకుండి, విష్ణు కుండి అనునదులు కలవు. గుండ్ల కమ్మయే బ్రహ్మకుండి నది. పసుపు లేరునదియే విష్ణు కుండినది. విష్ణుకుండి నది మీద కట్టబడిన వీరి రాజధాని విష్ణు కుండిన పురము. వీరు విష్ణు కుండినులు. విష్ణు కుండిన పురమే నేటి వినుకొండ

విష్ణు కుండినలు సూర్యారాధకులు. 'విష్ణు కుండి అనగా

సూర్యదేవుని సరస్సు లేక సూర్యదేవుని గుడికి సంబంధించిన సరస్సని అర్థము.

'విష్ణు కుండిన' శబ్దములోని 'కుండి' శబ్దమునకు సేవకుడని నేటి పరిశోధకులు తెలుపుచున్నారు. 'కుండి గాడు' అనగా పన్నులు వసూలు చేయు వాడని అర్థము. విష్ణు సేవకులు. ఆంధ్ర విష్ణువు నకు దాసుల మనెడి భావము నాటి రాజులకు కలదట. కుండి శబ్దము రాను రాను కొండి శబ్దముగా మారి యుండును. 'కొండిగాడు' సలహాల నిచ్చు వాడని ప్రాచీనమైన అర్థము. అది నేడు చాడీలు చెప్పువాడను నర్థమున వాడబడుచున్నది. తేలిన విషయ మేమనగా విష్ణు కుండినలు ఆంధ్ర విష్ణువునకు సేవకులనుట.

మన కథా విషయమునకు సంబంధించిన మాధవ వర్మ బెజవాడ రాజధానిగా ఆంధ్ర సామ్రాజ్యమును పాలించిన విష్ణుకుండిన చక్ర వర్తి. ఇతడు పలువురు మాధవ వర్మలున్న ఆవంశములో చివరి మాధవ వర్మ, మాధవ వర్మ మహాకోసల రాజైన చంద్ర గుప్తుని ఓడించి, అతని కుమార్తె యగు చంద్రాదేవిని వివాహ మాడెను. చంద్ర గుప్తుని రాజధాని 'త్రివరము' అగుట వలన నితడు 'త్రివర నగర భవన గత పరమ యువతీజన విహరణ రతిః' అను బిరుదును దాల్చెను. ఇతడు పరిపాలనా దక్షుడు, పరమ ధార్మికుడు, న్యాయ బుద్ధి గలవాడు. ఇతని రాజ్య కాలము క్రీ.శ 576 నుండి 623 వరకు అగుచున్నది. ఈ మాధవ వర్మయే తన వాటి క్షత్రియ కుటుంబము లకు మూల పురుషునిగా ప్రసిద్ధి కెక్కినాడు.

కథా సంగ్రహము :-

ఒక నాటి సాయం సమయమున మాధవ వర్మ కుమారుడు పదివేల బంగారు నాణెములు పెట్టి కొన్న శ్వేత మహాశ్వములను పూన్చిన రథము నెక్కి కోట వీధిలో విహారమునకు బయలుదేరెను.

ప్రజలకు రాజభటులు హెచ్చరికలు చేయు చున్నప్పటికి రా కుమారుని రథము వేగముగా పోవు చుండగా చక్రము క్రింద పడి ఒకడు ప్రాణములు వదలినాడు.

మరునాటి మధ్యాహ్నము మాధవవర్మ ధర్మాసన మధిష్ఠించినాడు. ఒక ముసలి పేదరాలు నెత్తురట్టలు కట్టిన కుమారుని శవము ను రాజునకు చూపి ఇట్లనినది. ప్రభూః నా ఏకైక కుమారుడు నీ కుమారుని రథ చక్రము క్రింద పడి మరణించినాడు. "మీరెట్లు న్యాయమును నిర్ణయించినను సరే" అని ప్రాణములు విడిచినది.

రాజు న్యాయ నిర్ణయ బాధ్యతను న్యాయాధిపతులకప్ప గించి తాను గంభీరముగానుండెను. 'పసిపాపలు, వంగ్వంధులుండు పుర వీధులందు మత్తాశ్వములు గట్టిన రథము పోవరాదు: ప్రాణము ప్రాణమును బదులు గోరును. నీతికి రాజసుతుడని, కాదని యుండదు' అను న్యాయాధిపతుల తీర్పును అధికారులు రాజునకు వినిపించిరి. తీర్పును వినిన రాజు మోమున వికారము దోపలేదు. మొగసాల మధ్యాహ్నపు శంఖధ్వనులు మ్రోగగా మాధవవర్మ నాటికి కొలువు చాలించినాడు.

ధర్మాసనమున నెంత గంభీరుడో దిగిన పిమ్మట అంత దుఃఖితుడైనాడు రాజు. ప్రధాన సఖులు రాజును అంతఃపురమునకు చేర్చినారు. తీర్చిన తీర్పును రాజు సవరించవచ్చని మంత్రులు చెప్పినారు. పుత్రశోకమునకు దుఃఖించుచుంటినిగాని ధర్మ నిర్ణయము మార్చుటకుగాదని సమాధానించెను. ధర్మనిర్ణయానుసారము తన ఏకైక కుమారునకు మరణ శిక్ష విధించినాడు. నాటి సాయంకాలము విజయనాటికలో కనకవర్షము కురిసినది.

## చరిత్ర - కావ్యముల సమన్వయము

ఇందలి మాధవవర్మను పల్లవరాజుగా విశ్వనాథవారు పేర్కొ

నినారు. 'పల్లవేంద్రుడు మా ధవవర్మనృపతి' ఇట్లు పలుచోట్ల నుడివినారు. విశ్వనాథ వారిట్లనుకొనుటకు కారణము లేకపోలేదు. పల్లవ రాజనికొందరు, విష్ణుకుండిన వంశము వాడనికొందరు మాధవ వర్మను గూర్చి విభిన్నాభిప్రాయములను వెలిబుచ్చినారు. మల్లంపల్లి సోమశేఖరశర్మగారి దృష్టిలో మాధవవర్మ పల్లవ వంశీయుడు. మల్లంపల్లి వారి యందున్న విశ్వాసమునుబట్టి విశ్వనాథవారు మాధవ వర్మను పల్లవ రాజుగా తలంచినారు. అయితే తరువాత చరిత్రకారు లందరు మాధవ వర్మను విష్ణుకుండిన వంశీయునిగా అంగీకరించి నారు.

మరియు ఈ మాధవవర్మ విష్ణుకుండిన వంశీయ మాధవ వర్మలలో చివరివాడనుట నపుంజసము. అతనిని గూర్చి మూడవ వాడని, నాలుగవ వాడని వాదభేదములు గలవు. నాకు మాత్రము సంగ్రహాంధ్ర విజ్ఞానకోశము పేర్కొనినట్లు నాలుగవ వాడుగా గ్రహించుట హేతుబద్ధముగా నుండుననిపించుచున్నది.

కావ్య శిల్పము.

'ఆంధ్రప్రశస్తి' గ్రంథమున "మాధవవర్మ" ఒక విశిష్ట కవితా ఖండిక. ఇట్టి ఎత్తుగడనుండి ముగింపు వరకు ఉత్సుకతను కలిగించు కథాంశము కవికి లభించుట అదృష్టము. అది విశ్వనాథ వారి చేతిలో బడుట బంగారమునకు తావి అబ్బుట. రచన యందు జిగి, కథా తథనమున బిగిగల ఈ ఖండికయందు ప్రారంభ పద్యమునందే కథకు పునాది గట్టిగా వేయబడినది.

విజయ వాటిక కోటవీధిలో నాడు సం
　　రంభంబు పొందుచు రాజభటులు
ప్రజ నొత్తుచున్నారు. ప్రక్క ప్రక్కలకు. భూ
　　మీజాని యేక తనూజు శతడు
పదివేల దివ్య సువర్ణముల నొసంగి
　　శ్వేత మహాశ్వముల్ పిరిచినాడు

## అవి పూన్చిన రథంబు నారోహణము చేసి
## అతడు పురంబు వాహ్యాళిపోవు

రాజపుత్రుడు గొన్న తురంగము లవి
బహుళ భద్ర చిహ్నములు. శుంభన్మహాగ్ని
వముదమోఘ నాసాపుట భ్రమిత సాంద్ర
ఫేనములు. ఖురఘట్టితోర్వీతలములు

విజయవాట కోటవీధిలో వేగిరపాటుతో రాజభటులు ప్రజలను ప్రక్కకు నెట్టుచున్నారు. అంటే ప్రజలా వీధిలో తండోపతండములుగా చేరి యుండవలె. ఎందుకు చేరినారు? వాహ్యాళికి పోవుచున్న యువరాజును చూచుటకు కాదు. వాహ్యాళి సాధారణ కృత్యము. అచట యువరాజును జూచుట ముఖ్యము కాదు మరెందుకు? రాజపుత్రుడధిరోహించు రథమునకు కట్టిన అశ్వములు పది వేల దివ్య సువర్ణముల్లిచ్చి కొనినవి. అవి శ్వేత మత్తాశ్వములు బహుళ భద్ర చిహ్నితములు. వాటిని చూచుటకు జనులు విరుగబడిరి. ఆ గుర్రములు మదించినవి అనుట మరువరానిది. వాటి వేగతీవ్రతను జాటుటకు అశ్వములకింకను విశేషణములు వాడబడినవి. "శుంభన్మహాగ్ని వముదమోఘ నాసాపుట భ్రమిత సాంద్ర భ్రమితములు: ఖుర ఘట్టి తోర్వీతలములు" అనగా అవి పరుగునకు ఎప్పుడెప్పుడను తీవ్రభావావేగముతో నున్నవి.

దానికి తోడు 'మత్తస్ఫూర్ద్ధాహి సంరావత్కశాగ్ర సంచాలనోద్భూత నిస్వానకములు. అసలే ఉద్వేగముతో నున్న గుర్రములు. దానితో రాజకుమారుడు ఉత్సాహముతో ఉక్కిరి బిక్కిరి అయినాడు. కొరడా చప్పుళ్ళు పెరిగినవి. దాని ప్రభావము—' నిమేషమున దాటి పోయె రాసుతుని స్యందనము కదలి, అనగా రథము కదలిన నిమేషములో రాజమార్గము దాటిపోయినది. గుర్రపు లు శుభలక్షణములు

కలవి. అని చెప్పునప్పుడు వాటి యజమానికి కీడు రాదని 'అశ్వ శాస్త్రము చెప్పుచున్నది. ఒక ఆపద ఎట్లు వచ్చును? చేతులార చేసు కొనినదనుటకు-మదించిన. కోపముతోనున్నపాము బుసలవంటి కొరడా కొసల చప్పుడులు - చేతిలో కొరడా. పగ్గముల ప్రసక్తియే లేదు.

కేవలము రాజకుమారునిదే దోషమనుట తేలిన సారాంశము. 'విజయ వాటిక కోటవీథి'లో కథా ప్రారంభమున జెప్పుట మరువ రానిది. అది రాజధాని. మీదు మిక్కిలి కోటవీథి. ఇది ముందే పసి గట్టినాడు గాన రాజభటులు ప్రజను ప్రక్క ప్రక్కకు నొత్తు చున్నారు. ఇంత జేసినప్పటికి రథచక్రము క్రింద పడి శవమైనాడు.

"అరదంబు వెనువెంట ననుసరింపకయేండ్లు
మీరిన వారు భూమీ తలాన
ధూళి ధూసరితమై వ్రాలిపోయిన యట్టి
శవమును గనుగొని జాలిపడిరి'

ఏండ్లు మీరినవారు మాత్రమే కనుగొనిరనగా తక్కిన యువకులకిది పట్టలేదనుట. లోకజ్ఞత అనగా నిది. తక్కిన వారికి రథాశ్వగమన వేగము మీదనే దృష్టి కాని ఆ వెనుక యేమి జరిగిన దను విషయము వారికి పట్టదు. వయోభేదమునుబట్టి మనః ప్రవృత్తి యుండును. ఏండ్లు మీరిన వారు రథము ననుసరింపరు. అనుసరిం చిన వారికీ విషయము తెలియదు. రథ యాత్ర మొదలగు ఉత్స వము లందు పెద్ద లక్కడనేయుండి నిలిచి వీక్షించుట, పిన్నవారు పరుగెత్తుట - సామాన్య విషయము.

ఈ ఖండిక లోని కథ సాయంకాలముతో ప్రారంభమై మరు నాటి సాయంకాలముతో సమాప్తమైనది. సందర్భమును బట్టి విశ్వ నాథవారు కర్మ సాక్షియైన సూర్యుని దశా విశేషమును కథకు జోడించినారు.

అంతలో లోక బాంధవు డస్తమించె
అస్తగిరి గహ్వరాంత నిత్యస్థి తాంధ
కార కృష్ణ వర్ణాహి సంచార భయద
మైకకుప్పలు శ్యామలమ్మై తనర్చె

పొడుపుమల వెల్గు నెత్తాల పొడిచి దివ్య
కాంతి దిక్కుల వెదజల్లె గర్మసాక్షి

రథ చక్రము క్రింద పడి వ్యక్తి చనిపోయిన దృశ్యమును చూడలేని లోక బాంధవుడైన సూర్యు డస్తమించినాడు. అంధకార మనెడు కృష్ణవర్ణాహి వర్తించుటచే దిశలు భయంకరములై నల్లనైనవి.

ప్రకృతిని కూడ కథలో లీనమొనర్చుట ఒక విశిష్టత. నాడు విజయ వాటికలో నుండు ప్రతి పౌరుని హృదయ కుహరమున భయమను చీకటి వ్యాపించినదని సూర్యాస్తమయ వర్ణనలో సూచింపబడినది. యువరాజు రథ చక్రము క్రింద పడి వ్యక్తి మరణించుట చూచిన, వినిన ప్రజలకు మాధవ వర్మ న్యాయ వర్తన తెలిసిన వారికి భయము గాక మరేమి?

ఇక్కడ కర్మసాక్షి మాధవ వర్మయే. తన ధర్మ కాంతులను వెద జల్లుటకు సూర్యుని వలెనే ధర్మాసన మధిష్ఠించినాడు. కర్మసాక్షి కర్మయందు జోక్యము చేసికొనడు. తాను సాక్షి మాత్రమే. మాధవ వర్మ భావి కథలో న్యాయము తీర్పులో జోక్యము కలుగ జేసికొన కుండుట దీనిచే సూచితము.

ఆ విషయమును దృష్టిలో పెట్టుకొని ధర్మ పీఠముపై కూర్చున్న మాధవ వర్మ స్థితిని కవిగారిట్లు వచించినాడు.

మృదుల కపోల పత్రముల మీదికి నబ్బెడు కుండలమ్ములన్
పొదిగిన రత్న దీధితులు మోసులు దాటి ప్రభాత నీరజా

భ్యుదయములైన దివ్య నయనోజ్వల దీప్తులు దాటి శీతరు
గ్వదనము దాటి ధర్మమ యొకండు తదాస్యమునందు దోచెడిన్

మాధవ వర్మ ధర్మ నిష్ఠిత బుద్ధికి పద్యము ప్రతీక. భావి న్యాయ నిర్ణయ మిచ్చుటనే సూచితమైనది.

చెవి భూషణములందలి రత్నకాంతుల కంటె, పద్మముల బోలు నేత్రముల కాంతుల కంటె, చంద్రబింబ సదృశ ముఖ కాంతి కంటె మాధవ వర్మ మోమున ధర్మ మొక్కటే స్పష్టముగా కనిపించు చున్నదట.

అసలీ కథను విశ్వనాథవారు గ్రహించుట కిదియే ఆయువు పట్టు. ఆంధ్రప్రభువు లెంత ధర్మ మూర్తులో ప్రజలకు చెప్పవలెనను నది విశ్వనాథ వారి ఆకాంక్ష.

హృదయమున నున్న భావము ముఖమున దోచును. కనుక ఆయన హృదయ మిప్పుడు రాగద్వేషముల కతీతమై ధర్మముతో నిండి యున్నది. అట్లున్న మాధవ వర్మ వద్దకు దూపు కట్టిన శోకమై వృద్ధురాలు ప్రవేశించి, నెత్తురట్టలు కట్టిన కుమారుని శవమును ముందు బెట్టినది. ఆ ముదుసలి దుఃఖ భారా నతాంగి, నిరాశాదేవి, బాష్పనేత్రి ఏక తనూజ విరహిత, శరీర గత నిరాస్థ, న్యాయార్థిని, కుత్రిధా భుగ్న ఫాల భాగ.

ఇప్పుడు రాజ కుమారుని రథము క్రింద పడిన శవ మెవరిదో తెలిసినది; అతని వెనుక ఉన్నవారి స్థితి తెలిసినది. కేవలము కథను కథ కోసము చెప్పుట గాక, రస పోషణకై వాడిన విశేషణముల ద్వారా కథాంశమును వెల్లడించుట కథా కథన శిల్పములో నొక భాగము. కుత్రిధా భుగ్నఫాల భాగ కనుకనే న్యాయార్థినియై కుమారుని శవముతో రాజు కొలువునకు రాగలిగినది. అట్లున గలిగినది.

"ఓయి నృపాల! యీ ముదుత యొక్కడు నాదు కులంబు తేప, నీ
వో అతి ధర్మరాజ వయయో! ఇది యేమిటయా! గతాసువై
యీ యనుగేగెబో తినుట కేమిక నున్నది, నాకు నేమి నే
డే యిదె వీని వెంట బడి యేగెద, కోడలి కేమి కావలెన్"

ఇంతకు మించి యాపద లికేమని కల్గు, రథంబు చేత ద్రొ
క్కింతు రటయ్య భూ ప్రజల, నెంతగ నున్న సిరుల్ భుజింత్రు, పా
లింతురు, రాజులైన నదలింతురు, తప్పులు కల్గినన్ విచా
రింతురు కాక, చంపుట సరే ప్రజనిట్టు లకారణంబుగన్"

అని "నీ యిష్టము న్యాయమో మరియు నన్యాయంబొ నీచేతి మీ
దనె కానిమ్మిదె పోవుచుంటి" నని"

ఈ వాక్యము లన్నియు కరుణ రసాలంబనములు. రాజును అతి ధర్మరాజ వనుట ధర్మ నిర్ణయమున బిగువు సడల నీయకుండగా ఔచిత్య శోభితముగా వాడ బడినది. ఇచట సంఘటనాను కూల రచన చోటు చేసి కొన్నది. విశ్వనాథవారి తెలుగు పలుకు బడి ఇట ప్రోగైనవి.

"నాకునేమి నేడే యిదె వీని వెంటబడి యేగెద, కోడలి కేమి కావలెన్" ఇది తెలుగు వాక్య విన్యాసము. లోకములో పలుకుబడి యెట్లుండునో దానిని సొగసు చెడిపోకుండగా పద్యములో పొదుగుట అషామాషీకాదు. ముదుసలి అన్నట్లుగానే కొడుకును వెంబడించినది. ఆమె మరణమును ముందుగానే ఆమె మాటలలో సూచించుట విశ్వనాథవారి గడుసు దనమున కొక ప్రతీక.

భుజింతుర్రు, పాలింతురు, అదలింతురు, విచారింతురు - ఈ క్రియా పదము లన్నియు ఆ వృద్ధురాలి ఆవేశమును చాటు చున్నవి. లోకములో ఆవేశ పరుల పలుకుబడి ఇట్లే ఉండును. వారు వాక్యమును

పూర్తిగా ననరు. క్రియా పదములే అట వాక్యార్థ వ్యక్తీకరణ సమర్థములై యుండును.

ఆమె మాటలలో పుత్ర శోకముతో పాటు క్రోధమును చోటు చేసి కొన్నవి. ఆ క్రోధమే రాజును కూడ హెచ్చరింప జేసినది.

పిమ్మట "ఆ వృద్ధ యంతన నచ్చోట గతాసువై పడియె పుత్రాయల్ల కాయాసయై"

పుత్ర శోకముతో నున్న వృద్ధురాలు. ఆవేశముతో మాటాడినది. ప్రాణములు విడిచినది.

ఆమె మరణమునకు విశిష్ట ప్రయోజన మున్నది. ఆమె జీవించి యున్నచో రాజు రాజకుమారునకు శిక్ష విధించుటకు ముందు ప్రజల నుండి ఒత్తిడి రావచ్చును. వృద్ధురాలి నుపసంహరించుకొనుమనుటకు అవకాశ మున్నది. అప్పుడు మాధవ వర్మ వ్యక్తిత్వము నిరూపణ కాదు. వృద్ధురాలు మరణించుటతో శిక్ష ఎంత తీవ్రముగా నున్నను నడ్డుపడుట కెవ్వరును సాహసింపరు.

వృద్ధురాలి మరణమును కనులార గాంచిన మాధవ వర్మ మోమున ప్రశాంతత నెలకొనుట ఆలోచింపదగినది. ఒక వైపున వృద్ధురాలి యెడ కరుణ, మరియొక వైపున దానికి కారకుడైన వ్యక్తి పైకోపము, ఆ వ్యక్తి తన కొడుకే యగుట ఆవేదన — ఇవన్నియు కలిసి ఎటువైపున మొగ్గ కుండగా ధర్మమునే ఆశ్రయించిన ఆయన మోమున ప్రశాంతత నెలకొన్నది. అదియును గాక మాధవ వర్మ గాంభీర్య చిహ్న మీ ప్రశాంతత.

ప్రశాంతుడైన రాజునకు తరువాత కార్యక్రమ మంతయు దృష్టికి వచ్చును. అప్పుడతడు విచలితుడు కావచ్చును. దీని నణచి పెట్టుకొని నిశితమైన చూపులతో న్యాయ నిర్ణయము నకాజ్ఞ పెట్టినాడు

"ప్రాణమ్ము ప్రాణమ్ము బదులుగోరు" అని తీర్పు. "తీర్పు వినినంత సేపు ధాత్రిపతిమోము కనుతుదలన్నైన గదలిక గాంచలేదు."

అది మాధవ వర్మ ధర్మ నిష్ఠకు పరాకాష్ఠ.

"ఆసనమ్మున నృపతి యున్నంతవరకు నెంత గంభీరుడో డిగి యంత దుఃఖ దళిత చేతస్కుడు"

పుత్ర ప్రేమను కూడ జయించిన ధర్మ నిష్ఠ. తీర్పునుగూర్చి మాధవర్మ మాటాడలేదు. అంటే తీర్పును శిరసావహించినాడని భావము తీర్పుకు తిరగులేదు. ఆ తరువాత పుత్ర ప్రేమచే దుఃఖ దళిత చేతస్కుడు.

సచివులు పుత్రశోక భర సంజ్వరు భూపతి జూచి వారు తీ
రిచినది తీర్పు, రాజు సవరించను వచ్చునటంచు జెప్పన
య్యుచిత వివేకి 'పుత్ర విరహోగ్ర భరాత్ముడగాని న్యాయకా
ర్య చరణ భార దుఃఖ వివశాత్ముడగా'నని పల్కె వెండియున్.

రాజు తీర్పును సవరించ వచ్చుని మాధవవర్మతో మంత్రులు సానుభూతిగ పలికినారు. నా దుఃఖము పుత్రుని గురించియే కాని కార్యాచరణమున గాదని మందలింపుగ సమాధాన మిచ్చినాడు. ధర్మైక తత్పరుడగుటయే గాక మహామనీషి యనిపించుకొనినాడు రాజు.

భూ ప్రజార్థము ప్రాణములు నిల్పికొనినాడు. లేకపోయినచో ప్రాణములు నిలువవు. ఏక సుత వియోగ దుఃఖ మట్టిది. ఆయన ధర్మ దీక్షకు కనక వర్షము కురిసినది.

ఈ మాధవవర్మ ఖండిక ఆదినుండి అంతము వరకు ఉత్సుకతో సాగింది.

పదివేల దివ్య సువర్ణములకు కొనిన మత్త శ్వేతాశ్వముల రథ యాత్ర. ఆ రథము క్రింద పడి ఒకడు మరణించుట. దాని

పరిణామమును గూర్చి పాఠకులో తహ తహ. న్యాయము కొరకు వృద్ధురాలు కొలువుకు వచ్చి తనదుఃఖమును నివేదించుట. తీర్పును గూర్చి ఆరాటము. మాధవవర్మ ఎటు మొగ్గుననునది చిట్ట చివరి వరకు పాఠకునిలో ఉత్సుకతను కలిగించుట ఈ ఖండిక ప్రత్యేకత.

ప్రతి పద సార్థక్యముతో నడిచిన రచన ఇది. ఇందలి పద్య శిల్పమును గూర్చి ఒక ఉదాహరణము.

మెరుము మెరుముగ్గె వచ్చి నిమేషమందు
దాటిపోయె రానుతుని స్యందనము కదలి
పుడమి తచ్చక్ర ఘట్టితాంగుడయి నెత్తు
రోడికలు కట్ట నటఁబడియుండె నొకడు.

రాజకుమారుని రథము కదలిన ఒక్క నిమేషములో – కోట వీధిని దాటిపోవుట: రథ చక్రము క్రింద ఒకడు పడుట. ఈ రెండును ఏక కాలమున జరిగినవనుటను సూచించుటకు ఒక్క పద్యము నందు – తేటగీతియందు నుడువుట పద్యశిల్పములోని భాగము. పద్య రచన మూలముగా విషయమున గల వేగమును సూచించు టొక శిల్పము.

లక్ష్యము:

'మాధవవర్మ ధర్మాభినివేశము వెల్లడించుట ద్వారా ఆంధ్రులు పరాక్రమవంతులే కారనియు, ధర్మాభిరతులనియు నొక్కి చెప్పి మనలను ధర్మదీక్షా తత్పరులను జేయుటకు పూనుకొనినారు.

---

# వేగిక్షేత్రము

చారిత్రక నేపథ్యము :-

పశ్చిమ గోదావరి జిల్లా యందు గల ఏలూరుకు సమీపము

నందున్న ఇప్పటి పెదవేగియే 'వేగి క్షేత్రము.'

వేంగీపురము రాజధానిగా తత్ప్రాంతమును పరిపాలించిన రాజుల ప్రస్తావన గుప్తచక్రవర్తి సముద్రగుప్తుని దక్షిణ దిగ్విజయ సందర్భమున వేసిన అలహాబాదు స్తంభశాసనములో మొట్ట మొదట వచ్చినది. క్రీ॥ శ॥ 350 ప్రాంతము నాటిదైన ఈ శాసనమున "వేంగి హస్తివర్మ" అని పేర్కొనబడినది.

శాతవాహనుల తరువాత ఆంధ్రదేశ భాగములను పాలించిన వారు – ఇక్ష్వాకులు, బృహత్పలాయనులు, ఆనంద గోత్రీకులు. ఆనందగోత్రికుల అనంతరము ప్రాముఖ్యమునకు వచ్చినవారు శాలంకాయనులు, వీరు వేంగిలో స్వతంత్ర రాజ్యమును స్థాపించి, వేంగిపురము రాజధానిగా తత్ప్రాంత ప్రదేశమును పరిపాలించిరి. ఈ రాజ్య స్థాపన క్రీ॥ శ॥ మూడవ శతాబ్దాంతమందో, నాలుగవ శతాబ్దపు ప్రారంభమందో ఆయి యుండవచ్చును.

వేంగికి చుట్టుపట్ల ఉన్న ప్రాంతమునకు వేంగీ విషయమనియు, వేగినాడనియు పేర్లు. తొలి రోజులలో ఈనాడులోని బ్రాహ్మణులకు వేగినాటివారని పేరు.

శాలంకాయనులు 'చిత్రరథస్వామి పాదానుధ్యాతుల' మని చెప్పికొనినారు. చిత్రరథ శబ్దము సూర్యశబ్దమునకు పర్యాయమగుటచే శాలంకాయనుల కులదైవము సూర్యుడని వక్కాణింపవచ్చును. సూర్యోపాసన తెలుగుదేశములో ఉండెననియు, సూర్య దేవాలయములుండెననియు చెప్పుటకాధారములున్నవి. శాలంకాయనుల రాజ్య కాలమున వేంగిపురమున 'చిత్రరథస్వామి' దేవాలయమొకటి యుండవలెనని చరిత్రకారులూహించుచున్నారు. నేటికిని పెదవేగిలో ఒక పురాతన దేవాలయము నచ్చటివారు చిత్రరథ స్వామి దేవాలయముగ చెప్పుదురట.

శాలంకాయనుల కాలమున వేంగి ఆంధ్రనగరముగా, గొప్ప విద్యా కేంద్రముగా ప్రసిద్ధి పొందినది.

వీరి తరువాత వేంగిపురమును పరిపాలించినరాజు విష్ణుకుండిన వంశజులు. వీరి శాసనములు సంస్కృత భాషలో నున్నవి. వీరికి ముందు రాజుల శాసనములన్నియు ప్రాకృతములో నున్నవి.

విష్ణుకుండిన వంశజులు బహువిధములైన క్రతువుల నాచరించిరి. వైదిక సంస్కృతికి పట్టుగొమ్మలై నిలిచి వేదవిద్యలను పోషించిరి.

వీరి తరువాత ఆంధ్రదేశము క్రీ॥శ॥ 7 వ శతాబ్దిలో తూర్పు చాళుక్యుల వశమైనది. క్రీ॥ శ॥ 624 వ సంవత్సరమున రెండవ పులకేశి తన దండయాత్రలో తూర్పు తీరముపై దాడిచేసి వేంగి రాజ్యమును వశపరచుకొనెను. తరువాత పులకేశి తమ్ముడైన విష్ణు వర్ధనుడు క్రీ॥ శ॥ 631లో వేంగి దేశమునకు రాజయ్యెను. తరువాత రాజధాని వేంగిపురమునుండి రాజమహేంద్రవరమునకు మారినది.

నన్నయభట్టు మహాభారతావతారికలో రాజమహేంద్రమును గూర్చి చెప్పుచు 'అఖిల జలధి వేలావలయిత వసుమతీ వనితా విభూషణంబైన వేంగీ దేశమునకు నాయక రత్నము' అను దానిని బట్టి తూర్పు చాళుక్యులు పరిపాలించిన దేశమునకు వేంగీ దేశమని పేరున్నట్లు స్పష్టపడుచున్నది.

పూర్వమొక రాజ్యమునకు రాజధానియై మహా నగరముగా విలసిల్లిన వేగిపురమిప్పుడు కళా కాంతులు కోల్పోయి చిన్న గ్రామముగా దర్శనమిచ్చుచున్నది. అచట గోచరించు పురా వైభవచిహ్నములు చూచువారిని బట్టి భావోద్వేగమును కలిగించును. కళ్ళను చెమ్మగిలజేయును. వింత ఆలోచనలను రేకెత్తించును. దీని హీనస్థితిని జూచినవారెవ్వరైన నిచ్చట మహానగరమొకటి పూర్వముండెడిదను మాటను నమ్మరు. కాని శాసనములు ధ్రువపరచుచున్నవి.

దండి దశకుమార చరిత్రలో కొల్లేరు సరస్సును వర్ణించుచు, దానికి సమీపమున వేంగీపురమును ఆంధ్రనగర ముండెడిదని పేర్కొనుటను బట్టి దీని ఉనికి స్థిరపడు చున్నవి.

విషయ సంగ్రహము :-

రాజులు శౌర్యపు పాయసమ్ములు పంచిపెట్టిరి. పల్లవరాజు రమణులు కాళ్ళకు పారాణి పెట్టిరి. తెలుగు పిల్లలు కత్తి త్రిప్పిరి. ఇనుని వేడిమి తెలుగు రాజుల యందు సంక్రమించినది. ఆ వేంగి రాజుల పాద చిహ్నములు తన గర్భము నందిముడ్చుకొనిన ఈ భూమి ఖండమందు జీవచ్ఛవాలధ్ర జనులు కన్నీరు గార్చెదరు.

నాటి వేంగీ ప్రభువులు పాద చిహ్నములు నేడు కన్పించుట లేదు. వాటిని దుష్టములయిన ప్రాతః కాల ఘటికలు గర్భము నందిముడ్చుకొనినవి. వేద సంరక్షకులైన పల్లవరాజుల హుంకారము పులి గర్జన వలె శౌర్య రసాకృతి దాల్చినది.

రాజు స్వృత్యర్థ మనుట, శౌర్యధనులు శిక్షింపబడుట, గాలి పౌరాతన్య మేచుకొనుట, ఆకాశమున క్రతుధ్వనులు శబ్దించుట వంటి దివ్యత్వముతో నొప్పు వేంగీ పునీత భూఖండ మందు నిలిచిన విశ్వనాథవారిని అస్వతంత్రతా శక్తి కంపింపజేసినది.

తెలుగువారు చెడుగుళ్ళ నాడు నాడే శత్రువులను కవ్వించుట గోడీబిళ్ళ సొగసులో రిపు శిరస్సుల బంతులాడుట, ఉప్పెన బట్టెలాడుటలో శత్రు వ్యూహమును భేదించు నేరుపు. కోతి కొమ్మచ్చి యాటలో కోట గోడల కేగ బ్రాకుట నేర్చుకొనిరి. తెలుగు తల్లులు బొడ్డుకోయని కూనలకు కూడ ఉగ్గుపాలతో రంగరించి పోసిరట.

హృదయ స్నిగ్ధములైన అనేక భావములతో చైతన్యవంతులై వేంగీ గాధలను యోజించుచు ఆంధ్ర పల్లవుల కీర్తి స్తంభము వలె విశ్వనాథవారు నిల్పినారు.

ఇక్కడెక్కడ చూచినను ఆంధ్ర పల్లవ వీరగాథలే వ్రాయబడి, పాడబడి, గాయబడి, ఉపన్యసింపబడి చెన్ను దాల్చియున్నవి.

ఈ నేల చేవకు సముద్ర గుప్తుడడిలి పోయినాడు. చిత్రరథస్వామి సేవలచే ఈ నేల పునీతమైనది. పల్లవ స్త్రీల వ్రతాల ఫలితముగా నిట సంపదలు నిల్చినవి. వేళ్లు గుర్రిచ్చినంతనే సిరులు వెలువడు ప్రదేశ మిపు డనుప భోగ్యమైనది.

స్వతంత్రులు కానప్పుడికిని వేగి ప్రాంత పుందలి పొదలలో తిరుగుచున్న విశ్వనాథవారికి పూర్వాంధ్ర సామ్రాజ్య పుంవీథులందున్న స్వతంత్రునిగా భ్రమ కలిగినది.

పల్లవ రాజెగురవైచిన బావుటా చాళుక్యుల కాలమున ఒడిపోయినది. దేశి కవిత నన్న పార్యుని వ్యాకరణమున నశించి పోయినది. తొలి తెలుగు రాజుల ఆచారము తరువాతి రాజుల దాడులకు విధ్వంసమైనది.

శ్రీకాకుళము నుండి నేటి వరకు ఆంధ్ర పూర్వ రాజ్యముల పేరు వినగానే విశ్వనాథవారి హృదయము చలించి పోవును. చిత్తవృత్తులు పూర్వ జన్మ సంబంధములైనచో ఇట్లగుటకు ఆయన శరీరమున అనేక జన్మలనుండి ఆంధ్ర రక్తములు ప్రవహించి యుండును.

ఈ విషయమును మిత్రులకు చెప్పుటకు గాద్గది కాదులు అడ్డుతగులు చున్నవి.

## చరిత్ర - కావ్యముల సమన్వయము:-

వేగిక్షేత్రమును గూర్చి వ్రాయు చున్నప్పుడు విశ్వనాథవారి హృదయములో నున్నవారు పల్లవులు. అయితే వేగిక్షేత్రమునకు పల్లవులకు సంబంధము లేదు. వేంగి సామ్రాజ్యములో కొన్నిభాగములను పల్లవులు జయించి ఉండ వచ్చునేమో కాని వేంగిని రాజధానిగా

చేసికొని పరిపాలించినవారు కారు వారు. వారి రాజధాని కాంచీపురము. వేంగిని రాజధానిగా వేంగి సామ్రాజ్యమును పాలించినవారు శాలంకాయనులు, విష్ణు కుండినలు.

అసలు 'మాధవ వర్మ'ను పల్లవ రాజుగా భావించుటను బట్టి ఈ పొరపాటు జరిగినది. ఇది మల్లంపల్లి సోమశేఖర శర్మగారి ప్రభావమని ఇంతకు ముందొక సారి ఎత్తుకొంచి యుంటిని ఏది ఏమైన పూర్వాంధ్ర రాజుల ప్రాభవ ప్రశంస యనుటకు అడ్డు ఉండదు.

ఇంత వరకు వ్యక్తుల ప్రశంస సాగినది. ఇది క్షేత్ర ప్రశంస.

కావ్య శిల్పము:-

" 'వేగి క్షేత్రము' పురా వైభవమును తలచుకొని విశ్వనాథ కవి గుండె జల్లు మన్నది. ఆర్ద్ర మానసుడైన కవి కార్చిన వేడి కన్నీళ్ళు కరళ్ళు కట్టి యిట్టిలు పద్యము లయినవి"-ఆంధ్ర రచయితలు.

స్వయంభువ ప్రతిభా సంపన్నుడైన విశ్వనాథవారి అనుభూతి కవితా రూపము దాల్చిన విశిష్ట ఖండిక వేగి క్షేత్రము.

మనో వాక్కాయ కర్మలన్నియు పూర్వ వైభవముతో నిండి నిబిడీ కృతమైన విశ్వనాథ వేగిక్షేత్రమున సంచరించుచు తొల్లింటి మహోన్నత దశకును, నేటి నికృష్ట దశకును గల వ్యత్యాసమునకు పరితపించి, పూర్వముండి నేడులేని స్వాతంత్ర్య లక్ష్మీ వైభవమును స్మరించి కొని వేదనా భరిత హృదయులైనారు.

పూర్వాంధ్ర పౌరుషము నరనరాలలో ప్రవహించగా ఉప్పొంగి పోయిన విశ్వనాథ తననాటి కన్నీరు కార్చుచున్న జీవచ్ఛవాంధ్ర జనులను జూచి హృదయము దహింపగా తీవ్రవేదనా స్ఫులింగ వాక్యములు వెలువరించినారు.

గత ఖండికల యందు తద్గత వ్యక్తుల విశిష్టత ఉగ్గడింపబడి నది. వేగిక్షేత్రమున విడిగా ఏ వ్యక్తి యొక్క విశిష్టత చెప్పబడలేదు. వేంగిని పాలించిన రాజు లందరి ఆచారాది వ్యవహారముల వెనుక నున్న గొప్పతనము వ్యక్తీకరింపబడినది. ఆ ప్రారంభ మిది.

ఏ రాజు పంచెనో యిచట శౌర్యపు పాయ
సమ్ములు నాగుల చవితి నాళ్ళ
ఏ యెఱ్ఱ సంజలో నెలమి పల్లవరాజ
రమణులు కాళ్ళ పారాణు లిడిరొ
చిత్ర రథస్వామి శ్రీరథోత్సవములో
తెలుగు పిల్లలు కత్తి త్రిప్పిరెపుడొ
ఏ రెండు జాముల యినుని వేడిమి పచ్చి
కలసి పోయెనొ త్రిలింగ ప్రభువుల

నా జగచ్ఛ్రే యసంఖులై యులరు తొంటి
వేంగి రాజుల పాద పవిత్ర చిహ్న
గర్భితమ్మైన యీ భూమి ఖండమందు
నశ్రువులు జార్త్రి జీపచ్ఛవాంధ్ర జనులు

పల్లవ రాజులు వేగీ క్షేత్రమునకు సంబంధించిన వారు కారని ముందే చెప్పబడినది. ఈ క్షేత్రమునకు సంబంధించినవారు శాలం కాయనులు, విష్ణు కుండినులు, వీరికి ఆ రాధ్య దైవము చిత్ర రథ స్వామి; అనగా సూర్యుడు. ఒక్క మొదటి పాదమున దక్క తక్కిన పాదము లన్నింటి యందు సూర్యుని ప్రస్తావన తేబడినది.

నాగుల చవితి రోజున పాయసములు పంచిపెట్టు ఆచారము లేదు. విశ్వనాథవారు పంచి పెట్టించినవి శౌర్యపు పాయసమ్ములు, నాగుల చవితిని విశ్వనాథవారు పాయసముల కోసము వాడలేదు. తెలుగు వారికి, ఈ పూజకు అతి ప్రాచీన కాలము నుండి సంబంధ

మున్నది. నాగజాతివారి విజయాలు - ఈ పండుగగా పరిణమించి నవని కొందరి పరిశోధకుల వాదన. ఆ విజయ దివసమైన నాగుల చవితి నాడు వేంగిరాజు శౌర్యపు పాయసమును పంచిపెట్టి నాడని భావము.

తరువాత ఎఱ్ఱసబజ, చిత్రరథస్వామి, అనుని వేడిమి ప్రస్తావన తెచ్చుటకు కారణము వేంగిరాజులు సూర్యారాధకులగుట. ఆ విషయమును నొక్కి జెప్పుటకు కవి సూర్యప్రస్తావన వచ్చు విషయముల నెన్నుకొనినాడు.

ఇచట వేగి రాజుల పాద చిహ్నములు కూడ కనిపించక పోవుటకు కారణము పూర్వాహ్ణ దుష్కాలపు ఘటికలట.

ఇట వేగీశుల పాద చిహ్నములు లేవే! లేవుపో! భావనా
న్పుట మూర్తిత్వము నైనఁబొందవు, నేదో పూర్వాహ్ణ దుష్కాలపుం
ఘటికల్ గర్భము నందిముద్చుకొనియెం గాబోలు, నీపల్లె చో
టట లోకాద్భుత దివ్య దర్శన మటే! యాభోగ మేలాటిదో!

కాలమును కలుగ జేయువాడు సూర్యుడు. దుష్కాలపు వర్జ్యపు గడియలు కాలమునకు సంబంధించినవే. సూర్య ప్రభావమున వృద్ధి పొందిన వేంగి రాజుల పాద చిహ్నములు పూర్వాహ్ణ దుష్కాలపు ఘటికలు తమ గర్భమున నిముడ్చుకొనినవి. మొదటి పద్యమున గల పాద చిహ్నములను రెండవ పద్యమున ప్రారంభమున మరల నెత్తుకొనుటలో వస్త్వైక్య మున్నది. అనగా వేగి రాజుల ఆరాధ్య దైవమైన సూర్యునికి సంబంధించిన విషయ ప్రస్తావనయే చోటు చేసికొన్నది.

విశ్వనాథవారు పల్లవ రాజుగా భావించిన మాధవ వర్మ ధర్మమూర్తి, మరియు వేంగి రాజులు బహు విధములైన క్రతువులు నాచరించి, వేద విద్యలను పోషించి, వైదిక సంస్కృతికి పట్టుగొమ్మలై నిలిచిరి. దానిని మనము నందిదికొని విశ్వనాథవారు వ్రాసిన పద్యమిది.

నీ యతుల ప్రభావ మహనీయత వేగి పురాధి రాజమా!
ఆయత ధర్మమూర్తులు మహాత్ములు వారలు బ్రహ్మకోశ గో
పాయిత లాంధ్ర పల్లవ నృపాలుర హుంకృతి వ్యాఘ్ర గర్జగా
నైయరిలోక భీకర మహాద్భుత శౌర్య తసాకృతింజనెన్

మాధవ వర్మను పల్లవ రాజను కొనిస కారణముగా విశ్వనాథ వారు పల్లవ రాజుల ప్రసక్తి మాటి మాటికిని దెచ్చినారు.

వేంగి రాజులైన శాలంకాయనుల, విష్ణు కుండినుల పరాక్రమము జగత్ప్రసిద్ధము. మీదు మిక్కిలి విష్ణు కుండిన వంశమున గల మాధవ వర్మ నామధేయు లందరను మహా పరాక్రమ వంతులనుట చరిత్రజ్ఞులకు తెలియనిది కాదు.

ఇంకను వేంగీ క్షేత్ర విశిష్టతను ఇట్లు వ్యక్తీకరించినారు.

ఈ నా పదార్పిత క్షోణి నే రాజు ధ
    ర్మాసనం బుండి స్మృత్యర్థ మనెనొ
ఈ నా దృగా వృతంబైన భూములలోన
    నే శౌర్య ధనులు శిక్షింప బడిరొ
ఈ నా శరీర మందివ తళించిన గాలి
    యెంత పౌరా తన్యమేచు కొనెనొ
ఈ నా తనూ పూర్ణమైన యాకాశమ్ము
    నే క్రతు ధ్వనులు శబ్దించి నవియొ

అస్మద జ్ఞాత పూర్వ దివ్యత్వ మొప్ప
నీ పునీ తావనీ ఖండ మిచట నిలిచి
అస్వతంత్రత దారుణ నాయాంధ్ర శక్తి
నన్ను గంపంప జేయు చున్నది భృశమ్ము.

అజ్ఞాత దివ్యత్వముతో నిండియున్నది వేగి క్షేత్రము. అట్టి క్షేత్రమున నిలిచి యున్నాడు కవి. మైని కానినది అతత్ర అస్వతం

ఆంధ్రశక్తి. కనుకనే అది అతనిని కంపింప జేసినది. ఒకప్పుడు సర్వ స్వతంత్రమైన, సుసంపన్నమైన రాజ్యము గలిగిన ఆంధ్రుడు బానిస బ్రతుకు బ్రతుకు చున్నప్పుడు, అజ్ఞాత దివ్యత్వ విశిష్టమైన పూర్వ రాజ్య వైభవము నూహింప గల్గినప్పుడు – అతడు కలిపింప కుండగా నెట్లుండ గలడు? ఆ పూర్వ దివ్యత్వము సామాన్యమైనది కాదు.

ఈ వేగి క్షేత్రమును నేలిన రాజు స్మృత్యర్థము ప్రకారము ధర్మాసనము నిర్వహించినాడు. "స్మృతికి భూమిజాని సుతుడని కాదనిలేదు" అను తీర్పునకు కట్టుబడిన వాడు మాధవ వర్మ. అతని ధర్మమూర్తి మత్త్వమును స్ఫురింపజేయు చున్నదీ చరణము.

వేగి క్షేత్ర భూముల యందు శౌర్యధనులు శిక్షణము నొంది నారు కనుకనే వేంగి రాజ్యము బహు కాలము వర్థిల్లినది.

'స్పర్శ వత్త్వాత్ వాయుః' అనునట్లు కవిగారి శరీర మందిప తళించిన గాలి యొక్క పౌరా తన్య మిప్పటిది కాదు; మూడవ శతా బ్దాంతము నాటిది. వేగి క్షేత్ర ప్రసక్తి క్రీ.శ 350 ప్రాంతము నాటి 'అలహాబాదు స్తంభ శాసనము'న గలదు.

'శబ్ద గుణక మాకాశ'మను నట్లు విశ్వనాథవారి తనూపూర్ణమైన వేగి క్షేత్ర మందలి ఆకాశమున నెన్నియో యజ్ఞ నివాదములు ప్రతి ధ్వనించినవి. వేగి రాజులు ముఖ్యముగా విష్ణు కుండినులు అశ్వమే ధాది బహు విధక్రతువుల నాచరించిన వారు.

దీని తరువాతది పరమాశ్చర్య కరమైన పద్యము. గాథ ద్రవతి భానిష్యందము. తెలుగు నాట బాలు రాడు కొను నాటలలో పూర్వ మున్న యుద్ధ రంగమున వీరులు చేయు సాహస కృత్యములను ప్రతిబింబింప జేసినారు.

వేగి రాజ్యపు పల్లెవీథుల జెడుగుళ్ళ
రిపుల గవ్వించు నేరుపులు తెలిసి
ఎగురు గోడీబిళ్ళ సొగసులో రిపుశిర
స్సుల బంతులాడు శిక్షలకు డాసి
చెరాకి యుప్పు తెచ్చిన నాడె శాత్రవ
వ్యూహముల్ పగిలించు నొరపుగరచి
కోతి కొమ్మచ్చిలో గోట గోడల కెగ
బ్రాకి లంఘించు చంక్రమణ మెరిగి

తెనుగు లంతప్పె యవి నేర్చి కొనియ యుందు
రెన్నగా దెల్గు తల్లులు మున్ను శౌర్య
రసమొడిచి యుగ్గు పాలతో రంగరించి
బొడ్డు కోయని కూనకే పోయుదురట

వేగి రాజ్యపు పల్లె వీథులయందు చెడుగుడి యాడునప్పుడే శతృవులను కవ్వించు నేర్పులను, గోడీబిళ్ళ యాటలో శతృవుల శిరస్సులతో బంతులాడు శిక్షణము, ఉప్పన జట్టిలాడి యుప్పుదెచ్చి నప్పుడే శతృవుల వ్యూహములను భేదించు చాతుర్యములు, కోతి కొమచ్చులాడు నపుడే కోట గోడల మీది కెగ బ్రాకుట యను వీర కృత్యములు తెలుగు వారు చిన్న తనము నందే అభ్యసించినారు.

బొడ్డు కోయని కూనకు కూడ తెల్గు తల్లులు శౌర్య రసమొడిచి ఉగ్గుపాలతో రంగరించి పోయుదు రనుట విశ్వనాథవారికే చెల్లినది. ఇది విశ్వనాథవారికి తెలుగు పలుకుబడిపై గల అధికారమును తేట తెల్లము చేయుచున్నది. తెలుగు పలుకుబడికి ఛందస్సొదిగిపోయినది.

ఇందు ఆవేశమునకు తగిన కల్పన, కల్పనకు తగిన భావ జాలము, భావజాలమును పరిస్ఫుటీ కరింపగల బింకమైన రచన, అదియును నుడి కారపు సొంపుతో తీర్చి దిద్దుట కవితా విశ్వ నాథు

డైన విశ్వనాథకే చెల్లును. ప్రతిభా వ్యుత్పత్తి భ్యాసములు మూట కట్టిన పద్యమిది. ఇది యొక్కటే కాదు; ఇందలి పద్యములు, ప్రత్యే కించి సీస పద్యము లన్నియు నట్టివే.

వేగి క్షేత్రమున నిలిచిన విశ్వనాథ శిలవోలె కదల లేక పోయి నాడు. కాని భావనా చైతన్యుడైనాడు. అప్పుడు పూర్వమే తెలిసిన వేంగీ సామ్రాజ్య గాథల నాలోచించు కొనుచు నాంధ్ర పల్లవ నరేంద్ర శ్రీ యశస్స్తంభము వలె నిల్చుండినాడు.

ఆయన ఆంధ్ర రాజుల కీర్తి స్తంభము. ఆంధ్ర జాతి ప్రతి నిధిత్వమునకు బూనుకొనుటకు ఆయనకున్న విశ్వాసమట్టిది. పూర్వాం ధ్ర వైభవమునకు ఈ'ఆంధ్ర ప్రశస్తి', ఆయన ప్రశస్తి ప్రతీకలు.

శిల వోలన్ గదలంగ లేక హృదయ స్నిగ్ధార్ద్ర సద్భావనా
ఖిల చైతన్యుడనై పురావిదిత వేంగీ పూజ్య సామ్రాజ్యగా
థల యోజించుచు నాంధ్ర పల్లవ నరేంద్ర శ్రీ యశస్స్తంభమున్
బలె నిల్చుంటిన యీ పవిత్ర ధరణీ భాగంబు నందీగతిన్

ఆయన శిల వోలె కదల లేక పోయినప్పటికి, హృదయమున మాత్రము భావనా చైతన్యము కోల్పోవలేదు. కనుకనే వేంగీ సామ్రా జ్య గాథలు యోజించు కొన గల్గినారు. రాజులకు వారి గాథలే కీర్తి స్తంభము. అవి విశ్వనాథవారి హృదయములో నున్నవి. కనుక ఆ గాథలను యోజించుకొన్న చున్న విశ్వనాథయే ఆంధ్ర పల్లవ నరేం ద్ర శ్రీ యశస్స్తంభము. అయితే ఇచ్చట 'పల్లవ నరేంద్ర' పద స్థానమున నుండ వలసినది 'విష్ణు కుండిన' శబ్దము. దీనికి కారణము ముందే చెప్పబడినది.

వేగి క్షేత్రమున నిలిచిన విశ్వనాథ వారికి అతీంద్రియ శక్తి యబ్బుట కారణముగా అచ్చటచ్చట చూచిన పూర్వాంధ్ర రాజుల చరిత్రలు గోచరించినవట.

ఎట గనిన బూర్వ పల్లవ నృప చరితలె
వ్రాయబడి పాడబడి గీయబడి యువన్య
నింప బడి శ్రోత్ర పేయమై చెన్ను దాల్చె
నీ యతీంద్రియ శక్తి నా కెట్టు లబ్బె

ఇది సీస పద్యమునకు ఎత్తు గీతి. క్రియాలంకారము పాటింప బడినది. ఇందలి క్రియాపద బాహుళ్యము ఆంధ్ర రాజుల చరిత్రల పౌష్కల్యమును వ్యంజించు చున్నది.

అచ్చటెచ్చట త్రవ్వినను బంగారమేనట. కాని ఆ చోటిప్పుడనుప భోగ్యమైనది.

ఈ పొలాలెంత చేవెక్కించు కొన్నవో
గుండె వ్రయ్య సముద్ర గుప్తుడడలె
ఈ నేల పావిత్ర్య మెంత కుంభించెనో
చిత్ర రధ స్వామి సేవలు కొని
ఇట పల్లవుల రాచయెల నాగ దేవర్త
మ్ముల చేసిరొ లచ్చినిలుకడ పడె
ఈ కాశ్యపీ ఖండ మేశర జ్యోత్స్నలో
పులకించెనో కీర్తి తెలుగులూరె

ఇట నెచట త్రవ్వినను బంగరే నట, యుది
యెంత శ్రీయొ! యదెంత రాజ్యేందిరయొ! ప
దానత నఖాగ్రపాత నిర్యన్నిధాన
మైన యీ చోటనుప భోగ్యమః యెయ్యనేడు.

సముద్ర గుప్తునితో తలపడిన వాడు హస్తి వర్మ. అతడు శాలంకాయనుడు. శాసనమున అతని పేరు వేంగితో ముడివడి యున్నది. చిత్ర రథ స్వామిని గూర్చి ఇంతకు ముందే వాకొనబడినది.

విశ్వనాథవారు వేంగి స్త్రీల పరిస్తావన పలుసార్లు తెచ్చుట గమ

నింప దగినది. మాధవ వర్మ భార్య చంద్రిపటిదేవి ఎక్కువ కాలము పూజలతోడను, వ్రతముల తోడను గడిపెనిదని చరిత్ర వక్కాణ.

కాలి గోరు వంటి గ్రుచ్చినచో నిధులు వెలువడు వేగిక్షేత్ర మిప్పుడు అనుభవించుటకు వీలు లేనిదైనది. తెలుగుల వైభవము బలవన్నృపుల పాల్భడమునను నశించి పోయినది. మదించిన ఏనుగు కొలనులో దొరబడి తామర తూడులను పెరికి వైచుటే యోగంగును గానీ ఆ పద్మములో మధువును గ్రోల జాలదు గదా! అని తృప్తి పడినారు కవిగారు.

విశ్వనాథ వారికి ఆంధ్ర విష్ణువు రాజధానియైన శ్రీకాకుళము మొదలు కొని ఉన్న ఆంధ్ర పూర్వ రాజ్యముల పేరు చెప్పిన ఆయన హృదయము చలించి పోవునట.

ఇమ్మగ కాకుళమ్ము మొదలీ వరకుంగల యాంధ్ర పూర్వరా
జ్యమ్ముల పేరు చెప్పిన హృదంతర మేలా చలించి పోవునా
ర్ద్రమ్మగు చిత్త వృత్తుల పురాభవ నిర్ణయ మేని నెన్నిజ
న్మమ్ములు గాగ నీ తనువునన్ బ్రవహించునొ యాంధ్ర రక్తముల్

విశ్వనాథ వారు ఆర్ద్రమ్మగు చిత్తవృత్తి కలవారు. కనుకనే ఆంధ్ర పూర్వ రాజ్యముల పేరు చెప్పగానే ఆయన హృదయము చలించి పోవును. అట్టి చిత్తవృత్తి కలిగి యుండుట, పూర్వ జన్మ కారణమైనచో ఎన్నో జన్మముల నుండి ఆయన శరీరమున ఆంధ్ర రక్తములు ప్రవహించు చున్న వనుట తిరుగు లేని విషయము. భారతీయ వేదాంతమున కాయువు పట్టు పునర్జన్మ సిద్ధాంతము. దీనిపై గాఢమైన నమ్మక మున్నవారు విశ్వనాథవారు. ఆయన పలుచోట్ల కర్మసిద్ధాంతమునకు ప్రాణమైన పూర్వజన్మను గూర్చి వక్కాణించినారు.

ఇది వినిపింతు నంచు మదినెంచెద మిత్రులకున్, గళస్థ గా
ద్గదికము — లోచనాంత బహుధా స్రుత బాష్పనదమ్ము — స్పందనా

స్పద హృదయమ్ము నా పనికి జాలక చేసెడు నన్ను నింతగా
నెద పదిలిండు కొన్నదిది యెక్కడి పూర్వపు జన్మవాసనో!

ఈ వక్కణ లన్నియు వారి పూర్వాంధ్ర రాజ్యాభిమానమును స్పష్ట పరచుటకే. అద్విషయమై వారి యను భూతి అట్టిది.

దీనినిక డా.జి.వి. సుబ్రహ్మణ్యంగారి మాటలతో ముగింతును.

"వాస్తవ జగత్తులో నుంచి వాసనా మయమైన అంతర జగత్తు లోకి ఆలోచనను అంతర్భవింప జేస్తున్నవీ పద్యాలు. అంతశ్చేతనమే అక్షరా కృతి తాల్చటం ఈ పద్య రచనా శిల్పం. అచ్చమై అనుభూతికి మచ్చలేని మణి దర్పణాలీ పద్యాలు, 'రమ్యాణి వీక్ష్య మధురాంశ్చ నిశమ్య శబ్దాన్' అన్న కాళి దాసు శ్లోకంలోని రసదృష్టి ఈ పద్యాల్లో కనిపిస్తుంది. అపూర్వ భావనా బంధురమైన రచనంతో ఆలోచనా మృతాన్ని వర్షించటం కంటె సున్నితమైన హృదయ స్పందనాన్ని కలిగించి తన్మయత్వం కలిగించటం కష్టం. రసార్ద్ర చిత్తునికిగాని ఇట్టి రచనం సాధ్యంకాదు." విశ్వనాథ కవితా వైభవము.

లక్ష్యము:-

పూర్వాంధ్రుల వైభవమునకు, నేటి యాంధ్రుల దీనస్థితిని అనగా పార తంత్ర్యమునకు గల వ్యత్యాసమును దలంచికొని మాన మాస్థితికి చేరుకొన వలెనని ఉద్బోధించినారు. బొడ్డు కోయని కూనకే శౌర్య రసము నుగ్గుపాలతో రంగరించి పోయుదు రనుట నాటి యాంధ్రుల శౌర్య మెట్టిదో ఊహించుకొను మనుటయే.

## ముఖలింగము

చారిత్రక నేపథ్యము:-

ఆంధ్ర విష్ణువు, శాతవాహనుడు మొదలగు వారు తెలుగు రేడులు; వేగిక్షేత్రము, ముఖక్షేత్రము మొదలైనవి తెలుగునాడులు.

శ్రీకాకుళము సమీపమున గల వంశ ధారానదికి ఎడమ గట్టున ముఖలింగ గ్రామ మున్నది. ఈ నది గ్రామమునకు మూడు వైపుల ప్రవహించు చున్నది. గ్రామ మందలి ముఖలింగేశ్వరాలయమే ప్రస్తుత శీర్షిక. ముఖ లింగము కళింగ గాంగ రాజులకు పెక్కు శతాబ్దములు రాజధానిగా నున్నది. ఈ ముఖ లింగేశ్వరాలయమును శిల్పరీతిని బట్టియు, వాస్తు విశేషమును బట్టియు క్రీ.శ. 8వ శతాబ్దపు ద్వితీయార్ధమున నందు తొలి గాంగ రాజులు నిర్మించి యుందురని చరిత్రకారుల అభిప్రాయము.

ముఖ లింగేశ్వరాలయమున శివ లింగము మిక్కిలి తెల్లగా నుండును. ఒక చెట్టు గాండము నుండి పుట్టినట్లు భ్రమ గొల్పు చుండును. క్రీ. శ. 1077లో చోడగంగు వేయించిన శాసనమున ఈ దేవుని గూర్చి 'మధూకవృక్ష జననాధీశస్య' అని కలదు. దీనికి 'ముఖ లింగ'మని పేరే కాని ముఖము మాత్రము లేదు.

అరబ్బుల ఖర్జూరపు చెట్టు, కదంబరాజులకు కదంబ వృక్షము కులదైవ మైనట్లే గిరిజనులకు ఇప్పచెట్టు కులదైవము. దీనిని సంస్కృతమున మధూక వృక్ష మందురు. ఇది ఒరియా భాషలో 'మొహూ' గామారి, మొహలింగముగా పిలువబడి ముఖ లింగముగా సంస్కృతీకరింపబడి యుండును. లేదా మూడు ప్రాంతములు గానున్న కళింగ దేశమును పాలించిన రాజులు త్రిలింగేశ్వరులుగా పిలువబడిరి. అందుచే మూడు కళింగములు కలిసి 'ముక్కలింగ'మై 'ముఖ లింగము'గా పరిణమించి యుండును.

కళింగ దేశమును తూర్పు గాంగ వంశము తొమ్మిది శతాబ్దములు పైగా పరిపాలించినది; ఇది క్రీ.శ 497 స. ప్రారంభమై క్రీ.శ 1435 సం. వరకు సాగినట్లు తెలియు చున్నది. గాంగ శకము వీరి వంశము పేర నేర్పడినది. వీరి రాజ్యము ఉన్నత దశలో ఉత్తర

మున గంగా నది నుండి దక్షిణమున గోదావరి వరకు వ్యాపించినది. గాంగుల మొదటి రాజధాని దంతపురము. ఆ ముదాల వలసకు సమీపమున దంతవరపు కోటయను గ్రామ మున్నది. దంతవరపు కోటయే దంతపురమని తలంప బడుచున్నది. 6వ శతాబ్దాంతము నుండి దంత పురమును వీడి కళింగ నగరమును రాజధానిగా జేసికొనిరి. ముఖలింగ క్షేత్రమే కళింగ నగరముగా గుర్తింపబడినది. ఇది 'సర్వఋతు సుఖ రమణీయము' అని శాసనములో పేర్కొనబడినది.

కళింగాంధ్రులు సముద్రయానము నందాసక్తి కలవారు. వీరు ఓడలలో బర్మా, కంబోడియా, చైనా ఇత్యాది దూర ప్రాంతములకు వ్యాపారాది నిమిత్తము పోయి బంగారము, వెండి, అగరు, కర్పూరము మొదలగు వాటిని దిగుమతి చేయు చుండిరి.

క్రీ.శ వేయి సంవత్సరములకు పూర్వపు గంగ వంశము వారిని పూర్వ గాంగు లనియు, తరువాత వారిని అర్వాచీన గాంగు లనియు చారిత్రకుల వ్యవహారము.

అర్వాచీన గాంగ వంశజులలో మూడవ వజ్ర హస్త దేవుడు మొదటివాడు. ఇతని పౌత్రుడు అనంత వర్మ చోడ గంగదేవుడు. గొప్ప పరాక్రమ వంతుడు. వేములవాడ భీమకవి ఇతని కాలము వాడే యని శ్రీపాద గోపాల కృష్ణమూర్తిగారి వంటి చారిత్రకులు నిర్ణయించినారు. ఈ చోడ గంగ దేవుని తండ్రి దేవేంద్రవర్మ రాజ రాజ దేవుడు. ఇతని భార్య రాజ సుందరి. రాజ సుందరి రాజ రాజ నరేంద్రుని కుమారుడైన రాజేంద్ర చోడుని కుమార్తె.

విషయ సంగ్రహము :-

వర్షాధార భూములైనప్పటికి బంగారు పంటలు పండినవి. తెలుగు కళింగ రాజుల గుండె నెత్తురులో రక్షాదీక్ష కదలినది. శ్రీ గంధ కస్తూరు లిచ్చట గుబాళించినవి. గంగై కొండ చోడునితో నీ చోట

నియ్యమందినది. భీమకవి వాక్కు నందు శాపానుగ్రహములు చోటు చేసికొన్నవి.

ఇక్కడనే తొలి సూర్యోదయము. కళింగ రాజుల శౌర్యాగ్ని ఇచ్చటనే పొగలు చిమ్మినది. చాళుక్య విభులతో కళింగము సోదర భావము నెరపినది. పగటి వేషాలను చూడవలెనను వాంఛచే రాజ కళింగ గంగు శత్రుపు ప్రాణములు కోల్పోయినాడు. నాడు వంశ ధారా నదీ ప్రవాహమందు విజృంభించిన తెలుగువారి పరాక్రమము నేడు చల్లారి పోయినది.

కళింగ రాజుల గజసైన్యములు జైత్రయాత్రకు పోవు నప్పుడు అన్యంత భీమేశ్వరుని కంటిమంటలచే శత్రు సైన్యము దగ్ధమగుచుండెడివి. వంశ ధారా నదీ ప్రవాహము నన్నిక్కడ నుండి కదల నీయకుండగా నిలుపు కొనినది. వంశ ధారతో సమానముగా నా గుండె నుండి నెత్తురు ప్రవాహము లాబికి వచ్చినాడు నను గొనలందు నిలిచినవి.

దుఃఖ వేదన కారణముగా నా వాక్కు నూతన పథాల వెంబడి సాగుటలేదు. వంశ ధారా ప్రవాహము విజృంభించి తనలో నన్ను కలుపుకొన నిచ్చు. దరిద్ర చరిత్రలు దక్క నాకు మిగిలినది లేదు. నదులన్నియు గలిసి ఒకేసారి పొంగి తెలుగు నేలను ముంచి వైచిన బాగుండునని విశ్వనాథవారు ముఖలింగ క్షేత్రములో నుండి భావించినారు.

## చరిత్ర - కావ్యముల సమన్వయము :-

"చోళ చక్రవర్తి గంగైకొండని యిద్దరు కూతుళ్ళలో నొక్క రిత రాజమహేంద్ర నగరరాజు రాజరాజునకు, రెండవ యామె చోడ గంగ దేవు తండ్రికిని భార్యలు" అని విశ్వనాథవారు భావించి నారు.

అంధ్ర ప్రశస్తి - పే - 42

"రాజ సుందరి తండ్రి రాజ రాజ నరేంద్రుని కుమారుడు రాజేంద్ర చోడుడే అగుననియు నిశ్చయింప వీలున్నది"

తెలుగు సంస్కృతి - 272.

"కళింగ గాంగులను జయించి కులోత్తుంగుడు తన కుమార్తె రాజ సుందరీ దేవిని గాంగ రాజునకు పరిణయము చేసెను. వీరికి జనించిన పుత్రుడు - అనంత వర్మ చోడ గంగ దేవుడు."

ఆంధ్రుల చరిత్ర - సంస్కృతి. పే - 175 - 176.

అనంత వర్మ చోడ గంగ దేవుని తల్లి పేరు — రాజ సుందరీ దేవి—అనునది తృతీయ 'ఉద్ధరణ వాక్యము' వలన తెలియుచున్నది. అయితే రాజ సుందరి తండ్రి విషయమున మొదటి ఉద్ధరణముతో తక్కిన రెండును విభేదించుచున్నవి,

రాజేంద్ర చోడుడు చోళ సింహాసనముపై నధివసించిన తరువాత కులోత్తుంగ చోడ దేవుడను పేరుతో రాజ్యమును పాలింప సాగెను. కనుక విశ్వనాథవారు తక్కిన వాటితో విభేదించుటకు కారణమును తెలిసికొందము.

తూర్పు చాళుక్య రాజైన మొదటి శక్తివర్మ చోళ చక్రవర్తియైన రాజ రాజు సాహాయ్యము కారణముగా వేంగికి రాజైనాడు. అందుచే వేంగీ మండలము చోళ సామ్రాజ్యమునకు అనుబంధ రాజ్యమైనది. రాజ నీతితో మాత్రమే గాక ఈ చోళ చాళుక్యాను బంధము - వైవాహిక బంధముతో ముడివడినది. శక్తి వర్మ తమ్ముడైన విమలాదిత్యుడు చోళ చక్రవర్తి అల్లుడు. సంతాన రహితుడైన అన్న యనంతరము విమలాదిత్యుడు రాజ్యమునకు వచ్చినాడు విమలాదిత్యునికి ఇరువురు భార్యలు గలరు. చోళ చక్రవర్తి పుత్రిక కుందవ యొకతె; మేళమ మరి యొక్కతె. ఈమె జటా చోడ భీముని పుత్రికయై యుండును.

కుందవ సుతుడు రాజ రాజు; మేలసు సుతుడు విజయాదిత్యుడు. గంగైకొండ చోళుడను ప్రసిద్ధి వహించిన రాజేంద్ర చోడ చక్రవర్తి మన రాజ రాజునకు మేనమామ. ఇతడు తన కుమార్తెను రాజ రాజ నరేంద్రునకిచ్చి పెండ్లి చేసెను. ఈ దంపతుల కుమారుడు రాజేంద్ర చోళుడనెడి కులోత్తుంగ చోడ దేవుడు. ఈ రాజేంద్ర చోడుడు కూడ మేనమామయైన రెండవ రాజేంద్ర దేవుని కూతురు మధురాంతక దేవిని వివాహ మాడెను.

విమలా దిత్యుడు, రాజ రాజ నరేంద్రుడు - అత్తవారిపై గల గౌరవముచే తమ కుమారులకు మాతామహుల పేర నామకరణములు గావించినారు.

ఈ కారణముగా రాజేంద్ర చోడుడను తాత పేరు దౌహిత్రునికి సంక్రమించినది. అందుచే విశ్వనాథవారు మనుమని పేరునకు బదులు తాత పేరును గ్రహించినారు.

తేలిన సారాంశమేమనగా అనంత వర్మ చోడ గంగ దేవుని తల్లి రాజ సుందరీదేవి తండ్రి రాజేంద్ర చోడుడైన కులోత్తుంగ చోడ దేవుడు.

## కావ్య శిల్పము:-

వంశధారా నది యొక్క వరద కారణముగా విశ్వనాథ ముఖలింగక్షేత్రమున నిల్చిపోయినారు. గాంగ వంశ రాజులకు రాజధానిగా నున్న ముఖలింగ ప్రాంత విశిష్టతను గూర్చి వారిట్లు నుడివినారు.

దేవ మాతృకలు వర్ధిత హేమకేదార
ఖండ పుణ్యము లిందు బండెనేమొ
తెలుగు కళింగ రాజుల గుండె నెత్తురుల్
కడగి రక్షా దీక్ష గడలెనేమొ
శ్రీ గంధ కస్తూరి కాగురుద్రవ్యమ్ము
లిట దిగంతముల వాసించెనేమొ

శూర గంగ్గైకొండ చోడుతో నీ చోటు
వియ్యాల బిగువులు బిగిసెనేమొ

దక్ష వాటీపురీ కవిరాక్ష సుండు
ప్రళయ వహ్ని శిఖాధూమ పటల మమృత
బిందు శైతల్య మొకవాక్కు నందె యిచట
బిట్టు మండించి శీతలించి చెనేమొ

ఇచటి భూములు వర్షాధారములు. అయినప్పటికి నిది రాజధానిగా విలసిల్లునట్లుకు కారణము ఈ భూములు బంగారు పంటలు పండి యుండవలెను. సుదీర్ఘకాలము కళింగ రాజుల పాలనము సాగి యుండుటకు వారి గుండె నెత్తురు మిక్కిలి రక్షా దీక్షతో కదలి యుండవలెను. శ్రీ గంధ కస్తూరి మొదలైన సుగంధ ద్రవ్యము లిచ్చుట గుబాళించిన వనగా దూర ప్రాంతమైన చైనా వరకు కూడ నౌకా వ్యాపారము వీటితో సాగెడిది. గంగ్గైకొండ చోడునితో కళింగ రాజులు వియ్యమందు కొనినారనుటకు ఈ చోటు వియ్యాల బిగువులు బిగిసెనేమొ అనిరి కవిగారు. దేవేంద్ర వర్మ రాజ రాజ దేవునికి కూతురు నిచ్చిన వాడు గంగ్గై చోడుడు కాదు; రాజ రాజ నరేంద్రుని కుమారుడైన రాజేంద్ర చోడుడు. చరిత్ర కారుల పొరపాటు విశ్వనాథ వారిని దారి మళ్ళించినది.

ప్రళయ వహ్ని శిఖా ధూమ పటలము, అమృత బిందు శైతల్యము భీమ కవి వాక్కునందు చోటు చేసికొనిన వనుట, అయన వాక్కునకు గల శాపాను గ్రహముల విశిష్టతను దెలుపు రాజకళింగ గంగు కథ వ్యంగ్యమగు చున్నది. ఈ రాజ కళింగ గంగు అనంత వర్మ చోడ దేవుడని చరిత్ర కారుల నిర్ణయము. ఆ కథ ఇది.

భీమకవి ఒకసారి రాజ కళింగ గంగు దర్శనమునకు వెళ్ళినాడు. ప్రతీ వారి చేత కబురు పెట్టినాడు. అదియు శాపాను గ్రహ

పటువుసని పద్యమును పంపించినాడు. రాజు తరువాత రమ్మనినాడు. దానితో కోపపడిన భీమకవి రాజును రాజ్య భ్రష్టుడవగుమని పద్యమున శపించినాడు. కారణ మేదైన కళింగ గంగు రాజ్యము చేజారి పోయినది. ఒక రాత్రి వేళ చీకటిలో కళింగ గంగు కాలు జారి గోతిలో పడినాడు. తన దీన స్థితికి ఆక్రోశించినాడు. ఆ సమయమున నటు వెళ్ళుచున్న భీమకవి 'ఎవరు నువ్వని' ప్రశ్నించినాడు 'భీమకవి చేసిన జోగి'నని గోలపెట్టి పశ్చాత్తాప పడినాడు. భీమకవి అనుగ్రహించి దీవించినాడు. రాజ్యము ప్రాప్తమయినది. భీమకవి శాపానుగ్రహ దక్షతను దెలుపు కథ ఇది. దానిని వ్యంజింపజేసినారు విశ్వనాథ వారు.

ఆదినాల నెంతటి నిశితాను రాగ
ముగు కళా శిల్పములను విద్యలను జూడ
బగటి వేసాల కొరకు దూర్వార పట్టి
ప్రాణములను కళింగ గంగ్రాజు వైరి.

ఇందు కళింగ గంగ్రాజు పగటి వేషము వేసికొని, మరికొందరు హితులు పగటి వేషముల తోడనే తోడురాగా తన శత్రురాజును జంపుట వ్యక్తము జేసినారు. కళా శిల్పములు, విద్యలను జూడ గోరిన నిశితానురాగమే గంగ్రాజు వైరి ప్రాణములను దీసినది.

ముఖలింగ గ్రామమున సోమేశ్వరాలయము, భీమేశ్వరాలయము అను రెండు దేవాలయములు గలవు. అవి జీర్ణ దేవాలయములు. అందు భీమేశ్వరాలయమును గూర్చి విశ్వనాథ వారిట్లు ప్రస్తావించినారు.

ఏ పాపమునకు దానీ ఫలం బబ్బెనో
అన్యంక భీమేశ్వ రాలయమున
తెలుగు కళింగ రాజుల జైత్ర యాత్రల

గజ రాజ యూధముల్ కదలు వేళ
ముందీ శివుండు నిప్పుకలు గ్రక్కెడు కంట
నెదిరి సైన్యంబు ముట్టించునంట
ఆ దేవదేవు దేవాలయంబున నేడు
గబ్బిలంబులు తిరుగాడ జొచ్చె

ద్వార బంధాలపై వ్రాయబడిన తొంటి
తెలుగు లిపి పోల్చుకొని కూడ బలుకు కొనెడు
నా మహా మాతృదేశ బద్ధాను రాగు
లెవరో నా గుండె నెత్తురు లిట్లు కదుప!

గాంగ వంశజుడైన అనంత భీముడను వీరుడు భీమేశ్వరాలయము నిర్మించెను. అది నేడు – ఏ పాపమునకు ఫలమోగాని గబ్బిలములకు నావాసమైనది. కళింగ రాజుల గజ సైన్యములు కాలు కదుపగనే శివుని కంటి మంట వల్ల శాత్రవ సైన్యములు దగ్ధమగుచుండెడి మాహాత్మ్యము కలస్వామియని ప్రతీతి. అట్టిది నేడు జీర్ణమైనది.

ఈ భీమేశ్వరాలయ ద్వార బంధములపై వ్రాయబడిన తెలుగు లిపిని పోల్చుకొని కూడ బలుకుకొను మాతృదేశ బద్ధాను రాగు లెవరో కాదు – శ్రీ మల్లంపల్లి సోమశేఖర శర్మగారు. ఆ సోమశేఖర శర్మగారు చరిత్రను త్రవ్వి తలకెత్తుట హేతువున విశ్వనాథ వారి గుండె నెత్తురు కదలి యాడినది.

కళింగోత్సవమును జూచుటకు వెళ్ళిన విశ్వనాథ వారిని వంశధారా నది వరద రూపమున ఆపివేసినది. దానిని తల్లీ బిడ్డల సంబంధముగా బహు సుకుమారముగా ఊహించినారు కవిగారు.

ఏ పర జన్మలో గలసి యేమొక తల్లియు బిడ్డయైతిమో
నా పయి నీధరా స్థలికి నాటిన ప్రేమ మదెంతయో కదా

తేపకు వంశధార పరతెంచి శిలాఖిల మార్గ రోధమై
యీ వయసప్పు నన్ను జననీయుచు నిల్పి పసన్ దనంతటన్

తననిట్లు నాపి వేయుటను పూర్వ జన్మాను బంధముగా నూహించుట మాతృదేశముపై కవిగారికి గల గాఢాను రాగము వ్యక్తము చేయుచున్నది.

వంశ ధారా నది ఇంకను పొంగి తనను ముంచి వేసినను మంచిదే యని పలుకుచున్న పద్యమిది.

ఈ పొంగెత్తిన వంశ ధార మరి యిట్లే పొంగులై పొంగులై
నా ప్రాణమ్ములు దేహ మీజలము లోనన్ ముంచు కొనిమ్ము, యే
యే ప్రారంభము లేని యీ తెనుగు లిట్లే గూఢ సంవర్తవే
ళా పర్యంతము నుండ నిమ్ము విధి యేలా వారు మాకోసమై.

ఆ స్వతంత్రమైన తెలుగు జాతి దైన్యము తలచుకొన్న విశ్వనాథ హృదయమున వరదవలెనే నెత్తురు పొంగుచున్నది. 'స్వాతంత్ర్య సిద్ధికై ఏ శౌర్య పరాక్రమారంభములు లేని నన్ను ముంచుట ఉచితమే' యని కవి వేదన.

ఇంకను విశ్వనాథవారు తన కాలము నాటి తెలుగుజాతి దైన్యమును, హైన్యము నిట్లు వర్ణించినారు.

నా జాతి పూర్వ ప్రథా జీవ రహితమై
శక్తి నాడుల యందు జచ్చిపోయి
నా మాతృభూమి తేజో మహశ్చ్యుతిని బ్ర
హ్మక్షేత్ర తేజంబు మంట గలిపి
నా మాతృభాష నానా దుష్ట భాషల
యౌద్ధత్యమును దల నవధరించి
నాతల్లి నేల నేనాటి వాదారముల్
పై మెరుంగులు చూచి భ్రమసి పోయి

ఏమి మిగిలిన దీనాటి కిట్లు పొంగు
లొలయు వర్షా నదీ గభీ రోదకముల
దైన్య గర్భ చారిత్రముల్ దక్క ఛిన్న
గిరి శిఖర దుర్గ పరిదీన గీతి దక్క

పూర్వ యశస్సును కోల్పోయి, జాతి శక్తి చచ్చిపోయినది. బ్రహ్మక్షాత్ర తేజములు మంట గలిసినవి. మాతృభాష ఇతర భాషలైన ఆంగ్లము, హిందీ మొదలగు వాటి ఔద్ధత్యమును తలధరించినది. పై మెరుంగులలో పడి ఇతర దేశాచారములను తెలుగు లాచరించుచున్నారు. ఈ అన్నింటిని చూచి విశ్వనాథకు విరక్తి కలిగినది. దరిద్ర చరిత్రలు మాత్రము మిగిలినవి. కనుకనే చివరకు విసుగెత్తి ఇట్లనినారు.

తెలుగు నదులెల్ల పొంగెత్తి ప్రళయ వారి
కెరలి పడి తెన్గు నేల ముగించ నిమ్ము
నేటితో, న స్వతంత్రతా నియతమైన
యీ బ్రతుకు తెన్గువారు భరించలేరు.

నాగావళి, వంశధారాది నదులన్నియు ఒకేసారి పొంగి అస్వతంత్రతా దారిద్ర్యమున మ్రగ్గుచున్న తెనుగు నేలను ముంచివేసిన తప్ప తెలుగు వారీ బ్రతుకును భరింప లేరని తమ యీ వేదననంతటిని ముఖలింగ క్షేత్ర విశేష విషయ స్పష్టీకరణానంతరము వంశధారా నది యొక్క వరదతో స్ఫూర్తి గల్పి హృదయావర్జకములైన ఊహలతో నిశితముగా వెలువరించినారు విశ్వనాథవారు.

లక్ష్యము :-

'అస్వతంత్రతా నియుతమైన యీ బ్రతుకు తెన్గువారు భరించలేరు' అనియు అంతకంటె తెనుగు నదులెల్ల పొంగెత్తి తెలుగు నేలను ముంచి వేసిన మంచి దనియు కవిగారు తమ తీవ్రావేశమును వెలిబుచ్చుట ద్వారా స్వాతంత్ర్య సంపాదనైక లక్ష్యమెంత యావశ్యకమో నొక్కాణించినారు.

# నన్నయ్య భట్టు

## చారిత్రక నేపథ్యము :-

రాజ రాజు క్రీ. శ. 1022 ఆగష్టు 22వ తేదీన పట్టాభిషిక్తుడై నాడు. 1031లో రాజ్యమును గోల్పోయి 1035లో మరల బెజవాడ సింహాసనమును స్వాధీన పరచుకొనినాడు తరువాత మరల రాజ్యమును నుండి తొలగింప బడినవాడై క్రీ. శ 1051లో క్రొత్త రాజధాని అయిన రాజ మహేంద్రవరము నుండి వేంగి దేశమును రాజ రాజు పరిపాలింప సాగినాడు. భారతా వతారికలో రాజధానిగా రాజ మహేంద్ర వర ప్రస్తావన ఉండుటచే 1051 తరువాతనే భారత రచన జరిగినదని చెప్పవచ్చును.

నన్నయ్యకు సహాధ్యాయి నారాయణ భట్టు. ఇతడష్టభాషా విశారదుడు. కన్నడ భాషానిధి. నారాయణ భట్టు కన్నడ భాషానిధిత్వము నన్నయకు బాగుగా ఉపయోగించినది. అనగా కన్నడ భాషా సంప్రదాయము లైన చంపూకావ్య పద్ధతి, సంస్కృత వృత్త ప్రయోగము, సంస్కృత పదముల నుపయోగించుకొను పద్ధతి ఇత్యాదులు.

పావులూరి మల్లన్న 'సార సంగ్రహ గణితం' అను సంస్కృత గ్రంథము నను వదించిన వాడు. ఇతనిని నందంపూడి శాసన గ్రామ దాన గ్రహీతగా వీరేశలింగం గారు పేర్కొనినారు. ఈ గ్రహీత గణిత శాస్త్ర కర్త కాదనియు, తక్కిన వారి వాదము. గ్రామ దాన గ్రహీతకు గణిత శాస్త్ర కర్త మనుమడని పరిశోధకుల నిర్ణయము.

## విషయ సంగ్రహము :-

గోదావరి యందు ఉదయ సూర్యుని కిరణ స్పర్శచే నవ్వుచున్న దానివలె వికసించుచున్న పద్మము నుండి నన్నయ్య భట్టను తుమ్మెద స్వతంత్ర గీతమును పాడుకొనుచు బయటకు వచ్చుచున్నది.

వేద విద్యానిధులైన బ్రాహ్మణులు రాజ మార్గమున వచ్చి రాజులు, సచివులు, సైన్యాధిపతులా సీనులై యున్న సభలో ఉచితాసనముల నలకరించిరి. ముఖమున ఆంధ్ర సరస్వతి తాండవించు చున్న నన్నయ వచ్చు చుండగా మంత్రి లెదురేగి నమస్కరించి తీసికొనివచ్చిరి. అష్ట భాషా విశారదుడు నారాయణ భట్టును, గణిత శాస్త్ర సముద్రుడు పావులూరి మల్లన్నను మొదలగు వారందరిని మందహాస వదనుడైనన్నయ వీక్షించెను. ఇంతలో రాజాగమన సూచకమైన వంది మాగధ కైవారములు విన్పించినవి.

రాజ రాజ నరేంద్రుడు మత్తగజపు టంబారీ నుండి దిగి వంది మాగధులు జయ జయారావములు సల్పుచుండగా సభను ప్రవేశించి సింహాసన మధిష్ఠించెను. భట్టు రాజు పరాక్రమమును ప్రశంసించిన పిమ్మట పండితులు వేద ప్రవచనము గావించిరి. గాయకులు దేశాక్షి మొదలగు రాగముల నాలాపించిరి. శాస్త్ర పండితులు షట్సూత్రము లను పఠించిరి. పండితేంద్రులు భారతార్థమును వక్కాణించిరి. అపుడు రాజు నన్నయ వంక జూచి యిట్లనినాడు.

బ్రాహ్మణులకు దాన మిచ్చుట యందాసక్తి, భారత శ్రవణ కుతూహలము, శివ పూజా కౌతుకము, దాన శీలత, సాధు సాంగత్య మనునవి నన్ను విడువవు.

చంద్రుని దగ్గరి నుండి వచ్చుచున్న మా వంశమున ప్రసిద్ధులై యున్న పాండవుల చరిత్రము నాకు వినకోరికగా నున్నది.

నీ కంటె మిన్నగా కవితానవ పట్టము కట్టుకొన్న దిట్టలేరని నన్నయ వంక జూడగా అతడు ప్రభువునిట్లు దీవించెను.

మీ పూర్వ నృపాలురు బ్రాహ్మణహితముగా పరిపాలన గావించిరి. వర్ణాశ్రమ ధర్మములను రక్షించిరి. వారి వంశమున బుట్టిన

మీకు ఆ శశి తారకమైన కీర్తి సులభముగా లభించినది. అని ఆశీర్వదించిన నన్నయ్య ముఖ పద్మమున సాహిత్య సరస్వతీ తేజఃకణము తోచినది. దేవతలు పుష్ప వర్షమును కురిపించిరి. "శ్రీవాణీ గిరిజాశ్చిరాయ" అను నాశీః పూర్వక శ్లోకము వీణానాదము వలె నన్నయ నోటి నుండి వచ్చినది. ఆ శబ్దములు గోదావరి తరంగ ధ్వనులతో కలసి మరల మరల నినదించి తెలుగు జాతికి ముక్తిని చేకూర్చినవి.

## చరిత్ర - కావ్యముల సమన్వయము :-

పావులూరి మల్లన నన్నయ్య కాలము వాడు కాడు. కాని వీరేశలింగం పంతులుగారి ననుసరించి విశ్వనాథవారు పావులూరి మల్లన్నను గూర్చి ఈ ఖండిక యందు ప్రస్తావించినారు.

## కావ్య శిల్పము :-

ఇందలి తొలి పద్యమునందే తెలుగు భాషలో కావ్యోదయమును ధ్వనింప జేయుట గొప్ప ఎత్తుగడ.

శ్రీ గోదావరి నాంధ్ర శైవలిని రాజీవమ్ము కించిత్ప్కృత
ప్రాగల్భ్యమ్మున చూపె నయ్యుదయ మార్తాండాంశు సంస్పర్శ ఖ
త్రాగారమ్మును కాక వెల్వడి స్వతంత్రమ్మైన గీతమ్ము నా
శా గంధానిల వీచి దేల్చినది గిస్సమార్త్రిట్టు భృంగమ్మొగిన్

ఆంధ్ర నది గోదావరి. ఉదయించు చున్న సూర్యుని కిరణ సంస్పర్శచే నది యందలి పద్మ మించుక విప్పు చున్న దాని వలె వికసించు చున్నది. పద్మ పత్ర గృహమును చెరసాల నుండి నన్నయ్య భట్టారకుడను తుమ్మెద స్వతంత్ర గీతమును పాడుకొనుచు వెల్వడు చున్నది. ఇచట గిస్సమార్త్రిట్టనగా శబ్ద శాసనుడైన నన్నయ్య భట్టు. ఆ గిస్సమార్త్రిట్టు పాడిన స్వతంత్ర గీతమే తెలుగున ఆవిర్భవించిన గ్రంథము.

తూర్పు చాళుక్యులు ముఖ్యముగా రాజ రాజ నరేంద్రుడు వైదిక బ్రాహ్మణ మతమునకు ప్రాధాన్యము నిచ్చుట జరిగినది. దానిని దృష్టిలో పెట్టుకొని వైదిక బ్రాహ్మణుల స్వరూపమును నిట్లు చిత్రించినారు.

ప్రతి వాది ప్రళయుల్ త్రయీనిధులు తత్రాతర్వేద స్వత్ప్రభా
హృతకేశాంత నిమజ్జనాంబు చయు ఋర్వీదేవతల్ త్ర్యంబక
ప్రతిముల్ కుండల దీప్త కర్ణ యుగళుల్ వస్త్రాద్యలంకార భూ
షితులై బ్రహ్మల వోలికన్ నడచి రాస్తిక్య ప్రధానాంగముల్

ఆనాటి వేద బ్రాహ్మణులు త్రయీనిధులు, శిరఃస్నాన శుచులు, శివ సమానులు, కుండల ధారులు, వస్త్రాద్యలంకార భూషితులు, ఆస్తికులు, బ్రహ్మస్వరూపులు.

ఇక విశ్వనాథవారు దర్శించిన నన్నయ స్వరూప మిది.

ఆ జాను లంబమానాం భోజనాళ బా
హాదండముల నందమైన వాని
భసిత త్రిపుండ్రాంక ఫాల భాగమున జం
ద్రార్ధశేఖరు ప్రతియైన వాని
నిత్య గోదావరీ నియమ వేళాకృత
స్నానమ్ముల బవిత్రుడైన వాని
ప్రాథాంధ్ర విజ్ఞాన భాషా మహాదేవి
కావాసమైన యాస్యమ్ము వాని

వచ్చుకవి నన్న భట్టుని వాఙ్మయంత
నెదురుగా బోయి సచివాదు లెరగి తేత
నముచి తాసనమున శబ్ద శాసనుండు
ఉదయ శిఖరి మార్తాండుడై యొప్పమెరసె

ఆజాను బాహుడైన నన్నయ నొసట విభూతి పెట్టి అపర శివుని వలె నున్నాడు. అతడు నిత్య గోదావరీస్నాన పవిత్రుడు ప్రౌఢాంధ్ర విజ్ఞాన భాషా మహాదేవి ముఖమున తాండ వించు వాడు.

అతడు సభలో ఉదయ శిఖరి మార్తాండుడై యొప్పు మెరసినాడు. తెలుగు కైత పొడుపు కొండపై ఉదయ మార్తాండుడు నన్నయ్య అనుట ధ్వని.

నన్నయ్య భారతా వతారిక యందలి 'అఖిల జలధి వేలా వలయిత' అను గద్యము నందలి ముఖ్యాంశములను దృష్టి లోనిడి వ్రాసిన పద్యమిది.

ఆహితాగ్నులు సమంత్రాక్షతలం బూని
యాశీస్త్రయీ పాఠ మనిరి నోట
విమల దేశాక్షి సావేర్యాది సౌమ్యరా
గములు పాడిరి గాయక వ్రజంబు
ఆరు శాస్త్రముల వ్యాఖ్యార్థము చేసిరి
శ్రవణ పేయముగ దోషజ్ఞ వితతి
భారతార్థమ్ముల బహు సంహితా మర్మ
సిద్ధి జూపిరి విపశ్చిన్మహములు

చంద్ర వంశ్యుడౌ రాజ రాజక్షితీంద్రు
హృదయ పద్మమ్ము ప్రహ్వీకరింప బడియె
భారతార్థ గుంఫనముల బలికె నిట్లు
క్షోణి పతి నన్న పార్శ్వపై జూడ్కి నిల్ప

రాజు ప్రవేశించిన పిమ్మట సభ వేద పఠనముతో ప్రారంభ మైనదని చెప్పకుండగా ఆహితాగ్నులు వేద ప్రవచనము కావించి రనుట విశ్వనాథవారి కథా కథన దక్షత, అనగా పండిత వైశిష్ట్య కథనము నందే కథా గమనము సాగుచున్నది.

గాయకులు దేశాక్షి, సావేరి మొదలగు సౌమ్యరాగములు పాడిరి. అనగా వేదాశీర్వాదము తరువాత సంగీత మాలాపింప బడినది. పిమ్మట శాస్త్ర చర్చ. అటు పిమ్మట పురాణ పఠనము. అందు భారతార్థముల విమర్శ. ఈ విమర్శ సందర్భముగ చంద్ర వంశీయులైన పాండవుల ప్రస్తావన వచ్చినది. తన వంశీయుల ప్రస్తావన వచ్చుటచే రాజ రాజ నరేంద్రుని హృదయ పద్మము ప్రహ్వీకరింప బడినది. దానితో భారత శ్రవణాసక్తిని నన్నయ్య భట్టునకు స్పష్ట పరచినాడు. సందర్భానుకూల ప్రస్తావనలో ఒక సొగసున్నది.

ఇది కథా కథన చాతురి. ఇట్టిది నన్నయ్య భారతమున లేద నుట ఆయనను తక్కువ జేయుట కాదు. అచ్చట ఇష్ట కథా వినోదం బుల నున్న రాజ రాజ నరేంద్రుడు నన్నయ్య భట్టును జూచి తన అభిప్రాయంబును జెప్పినాడు.

ఇక్కడ విశ్వనాథ ముందుగా భారతార్థ విమర్శ ప్రస్తావన దెచ్చి రాజ రాజు మనస్సు తదభిముఖముగా వర్తించుటకు తగిన భూమిక నేర్పరచినాడు.

ఇది విశ్వనాథ ప్రత్యేకత. మీదు మిక్కిలి కథా కథనములో గల మెలకువ - కథా సూత్రము తెగి పోకుండగా సాగించుట కథా కథన దక్షత.

కనుకనే నన్నయ్యను గూర్చి "ధారుణి నీకు మిన్న కవితా నవ పట్టము కట్టుకొన్న వారే" రని రాజ రాజ నరేంద్రునిచే విశ్వనాథ వారనిపించిన వాక్యము వీరికి కూడ వర్తించు ననుటలో అతి శయోక్తికి అస్కారము లేదు.

శ్రీతో ప్రారంభమైన ఈ ఖండిక యందు గల మొదటి పద్యమున గోదావరి ప్రస్తావింప బడినది. అట్లే ముగింపు పద్యము శ్రీతో ప్రారంభము గోదావరి ప్రస్తావనతో ముగింప బడినది. దీనితో ఆద్యం

తముల కొక ముడి యేర్పడినది. గోదావరికి భారతమున కున్న సంబంధ మట్టిది.

"శ్రీవాణీ గిరిజాశ్చిరాయ" యను నాశీః పూర్వకారంభ వా
ణీ వైదగ్ధ్యమునందు మ్రోగినది తంత్రీనిస్వనంబొందు గో
దావర్యాప గలోని భంగముల యందా వృత్తులంజూపి గీ
తావేశంబున దెస్గునేల తను దానై ముక్తి చూరాడగన్

ఈ చట్ట చివరి పద్యము భారత ప్రారంభ పద్యముతో ముడిపెట్ట బడినది. అ ముడి "శ్రీవాణీ గిరిజాశ్చిరాయ." అదియును ఆశీర్వచన రూపమున. అ ఆశీర్వచనము వీణానాదము వలె వెలువడినది. ఆ శబ్ద ములు గోదావరీ నదీ తరంగ ధ్వనులతో కలసి పునః పునః ప్రతిధ్వ నించినవి. అవియే తెలుగు జాతికి భారతమును ప్రసాదించినవి.

ఇట్లు కావ్యములోనే భాగమును కూడ ప్రధాన కథను వదలిపో నీయడు విశ్వనాథ వారు.

ఏ వర్ణన చేసినప్పటికిని వస్తువుతో కలసి పోవునట్లు చేయుట ఆయన విశిష్టత. ఇచట వస్తు వనగా ప్రధాన కథ.

నన్నయ బంగారు చిరు గంటల సవ్వడిలో కలిసి పోవు శబ్ద ములతో రాజ రాజును దీవించినాడు. అప్పుడు

అనెనో నన్నయ భట్ట గీష్పతి సుధా స్యాంభోజ రేఖాంతరం
బున రాకా నవ శారదేందు కిరణంబున్ బోలెనైనట్టి మిం
చున సాహిత్య సరస్వతీ ప్రణుత తేజో లేశ మొక్కండు తో
చెను, వర్షించెను సర్వ దైవత కరోత్సృష్టంబులై పుష్పముల్

ఆశీర్వదించెనో లేదో నన్నయ్య ముఖ పద్మమున సాహిత్య సరస్వతీ తేజో లేశము కనిపించినది. తేజో లేశము కనుకనే అరణ్య పర్వమున 'శారద రాత్రులు' పద్యముతో నన్నయ గంట మాగి

పోయినది. అంతియే కాని ఆ 'లేశ' శబ్దము ప్రతిభా లోపమునకు ప్రతీక కాదు. ఆ తేజో లేశ మెట్టిది? రాకానవ శారదేందు కిరణము వంటిది. 'శారద' శబ్దముచే నన్నయ్య చిట్ట చివరి పద్యమును గూడ స్ఫురింప జేసినారు. శారదేందు కిరణంబులను విను వీథిలో వీక్షించు చున్నప్పుడో, భావించు చున్నప్పుడో నన్నయ్యగారి ప్రాణము లనంత వాయువులలో కలిసి పోయినవని పండితు లువాచ. (ఊచుః)

ఈ విషయమును చెప్పుటకే విశ్వనాథవారు నన్నయ్య ముఖ మండలి వెలుగును శారదేందు కిరణముతో పోల్చిరి.

ఇట్టి లేపోలిక నైనను, వర్ణనము నైనను కథా వస్తువుతో నేకీ భవించునట్లు ఉపయోగించు కొనుట ప్రతిభైక సాధ్యము. అది విశ్వ నాథ వారికి నూటికి నూరుపాళ్ళు మించి యున్నది.

లక్ష్యము :-

భారతావతరణము గూర్చి చెప్పుట తెలుగు జాతికి మహా భారతము సరస్వతీ దేవి మహా ప్రసాద మనుట.

---

# ప్రోలరాజు

చారిత్రక నేపథ్యము :-

రెండవ ప్రోల రాజీ ప్రోలరాజు. రెండవ బేత రాజు కుమారు డైన ఈ ప్రోల రాజునే కాకతీయ వంశ కర్తగా తరువాత వారు కీర్తించిరి.

అనుమకొండ పద్మాక్షి గుడి వద్ద నున్న శాసనమును బట్టి ఇతడు క్రీ.శ 1117 నకు ముందే అధికారమునకు వచ్చినట్లు తెలియు చున్నది.

ఇతడు గొప్ప వీరుడు; యుద్ధ ప్రియుడు. ప్రోలరాజు సాధించిన విజయ పరంపరను పేర్కొను శాసనము రుద్రేశ్వరాలయమున కలదు. ఈ శాసనమును బట్టి తైలప దేవుని, గోవింద రాజును, గుండనను, జగద్దేవుని జయించినట్లు తెలియు చున్నది.

చాళుక్య చక్రవర్తి యైన భూలోక మల్ల చక్రవర్తి మృతి నొందిన తరువాత అతని జ్యేష్ఠ పుత్రుడైన రెండవ జగదేక మల్లుడు ప్రతాప చక్రవర్తి బిరుదముతో సింహాసన మధిష్ఠించెను.

చాళుక్య సామంతుడైన ప్రోలరాజు తిరుగుబాటు దారుల నణచి వేయుటకు బయలు దేరిన ప్రతాప చక్రవర్తి సైన్యమునకు నాయకత్వము వహించెను.

చాళుక్య వంశీయుడైన తైలపుడు కందూరునకు ప్రభువుగా నుండి ప్రతాప చక్రవర్తికి సామంతుడుగ నుండుట కంగీకరింప డయ్యెను. అందుచే ప్రోలరాజు సైన్యమును కందూరు మండలముపై నడిపించెను.

తైలప దేవుడు గజ యుద్ధము చేసినప్పటికిని లాభము లేక పోయినది. ప్రోలుని చేతికి పట్టుబడినాడు. అయితే చక్రవర్తికి బంధువగుటచే విడిచి పెట్టబడినాడు.

పొలవాసాధీశుడైన (కరీంనగరు జిల్లా లోనిది) గుండ రాజు చాళుక్య చక్రవర్తి యెడ అవిధేయతను చూపు చుండెను. అందుచే చక్రవర్తి వెంట సైన్యమును నడిపించి మంథెనలో గుండ రాజును పట్టుకొని, తల గొరిగించి చాళుక్యులపై అవిధేయత పనికి రాదని రొమ్ముపై రాజ చిహ్నమగు వరాహ ముద్రను చిత్రించి, ఊరేగించి, చివరకు శిరస్సు ఖండించినాడు ప్రోలరాజు. గుండరాజే మంత్రకూటాధిపతి.

ప్రోలరాజిట్లు చేయుట వలన అతనికి రెండు ప్రయోజనములు చేకూరినవి. మొదటిది రాజాభిమానమును చూరగొనుట. తనను మించిన యోధాగ్రగణ్యుడు లేడనిపించుకొనుట రెండవది. చక్రవర్తి యొక విధేయత నూతగా గొని సాధించిన విశిష్టత. ఇది అతని రాజనీతిజ్ఞతకు నిదర్శనము.

విషయ సంగ్రహము :-

సాయం సంధ్యా సమయమున కాకతి ప్రోలరాజు హనుమకొండ సమీపమున బుజముపై పెద్ద యీటె పెట్టుకొని కన్నులలో క్రోధము తాండవించు చుండగా పాద హతిచే భూమి కంపింపగా ఫాల భాగము ముడిపడగా తారాడుచు నిట్లను కొనెను.

గుండ రాజనగా నెంత? తైలప దేవుడు బాహుబల శూన్యుడు. కాలహరణం బొనర్చుట చేతులు కాలిన వెనుక నాకులకై పరుగెత్తుటగును. చాళుక్య రాజులతో సరిరారు. పూర్వము వలె సామంతులుగా నుండరు. ఆంధ్రరాజ్యము ముక్కలయిన వెనుక హూణులకు గయికోలా నరింతురేమో! ఉత్తరమున యవనులు, హూణులు చెలరేగుచున్నారు. వారి నడ్డుకొన గల భూపతి లేడు. వారి నడ్డుకొనిచో అపకీర్తి వచ్చును. పరులు వచ్చినప్పుడు నలుగురు కలిసి వారి నెదిరింప వచ్చును గదా! మే మేర్పాటు చేయు రాజ సభను భగ్నము చేసిన గుండ రాజు శిరమున పాదము నుంచకుండగా నుండుట నాకు చేవ లేనట్లే. భూపతులను సభకు పిల్చుట, మేము వెళ్ళుటా! యను నూహయే తెన్గులను ముంచి వేయునది. చాళుక్య మహా వృక్షము నీడలో రెక్కలు చాచుకొన్న వారము. అట్టి వారి మీదనే కయ్యమా! ఆ గుండ రాజు వక్షములు చీల్చకుండగా కాకతి పాదములపై తల మోపలేను. ఆంధ్ర రాజెవడో తేల్చుటకు రేపే శుభ లగ్నము. తైలప దేవుని బంధించి కృతజ్ఞతతో విడిచి పుచ్చెదను. ఆ పయి గుండ రాజు సంగతి. కాకతీయ నవరాజ్య నిర్మాణము గావింతును.

ఇట్లు ఉద్రేక పడుటచే పోలరాజు శరీరాంగములు వేడెక్కినవి. అంతలో చంద్రోదయ మైనది. ఆ చల్లని కిరణ ప్రసారముచే వేడి తగ్గి సుఖంబు గూర్చినది. తరువాత దుర్గము వద్దకు జేరగా భటులు తప్పుకొని మార్గ మీయగా నెమ్మదిగా సాగెను.

యుద్ధోన్ముఖుడైన పోలరాజు రాత్రి కాళికను పూజించుట యందు నిమగ్ను డయ్యెను. తెల్లవారగా జైత్ర యాత్రా సూచక మైన కొమ్ము బూరాలు ధ్వనించినవి.

## చరిత్ర - కావ్య సమన్వయము :

పోలరాజు రాజ్య తంత్రజ్ఞు డనుటలో ఎవ్వరికి విప్రతిపత్తి లేదు. అయితే పోలరాజు యుద్ధ యాత్రలో ప్రతాప చక్రవర్తి ప్రస్తావన లేదు. ఇతడు యవన, హూణులపై దండెత్తుటకు రాజులను సమీకరించుట వట్టిది. కాని చాళుక్య నృపతి సైన్యమునకు నాయకుడై తైలప దేవుని, గుండ రాజును ఓడించుట నిజము. కొంత కల్పన చేసితినని విశ్వనాథ వారే నుడివినారు. ఆ కల్పనలోని భాగమే యవన హూణుల ప్రస్తావన; తెనుగు రాజుల సమీకరణ, సభ; దానిని గుండ రాజు భగ్నపరచుట.

## కావ్య శిల్పము:-

ఈ ఖండిక ఎత్తుగడలో క్రమ క్రమముగా ఉద్రేకము పొందుచున్న ఒక వ్యక్తి యొక్క స్వరూపమును కళ్ళకు కట్టినట్లుగా చూపించు చున్న పద్యమిది.

> అంసంబందున బారు టిటె నిడి నేత్రాంభోజముల్ భావతీ
> క్ష్ణాంశుల్ జిమ్మగ ధాత్రి పాద హతికన్ గంపింపగా క్షత్రియో
> త్తంసుండొక్కడు హస్మకొకడ కెలనన్ దారాడె తానొక్క సా
> యం సంధ్యాసమయంబు నందున లలాటాకుంచిత వ్యగ్రుడై

అది ఏకాంత ప్రదేశము. భుజమున బారుటీటె. కళ్ళలో తీక్ష్ణ కాంతులు. భూమి కంపించునట్లు పాద తాడనము. భ్రుకుటిని ముడి చిన వాడు.

వీటిని బట్టి ఆవేశముతో నూగి పోవుచు అటు నిటు తిరుగుచున్న ఒక వ్యక్తి మనకు స్పష్టముగా కన్పించు చున్నాడు.

భావనా మతులు పలువురుండ వచ్చును. కాని తామను కొన్న భావమును అక్షర రూపమున నిక్షిప్తము జేసి పాఠకుని హృదయమున తోపింప జేయుట విశిష్టత. అనగా కవి ఊహించిన వస్తు స్వరూపము పాఠకుని హృదయమున రూప మెత్తు శబ్ద జాలమును వాడుటలోనే ప్రతిభా పరిణతి వ్యక్తమగును.

భావ జాలమునకు తగిన శబ్ద జాలము వాడ వలె. అప్పడే శబ్దార్థములు సమానముగా పోవు జోడు గుర్రముల వలె నుండును. వాగర్థముల దాంపత్య మనగా నది. ఆ దాంపత్య ప్రణయమునకి పద్యము కైలాస శిఖరము.

తెలుగు వాక్య విన్యాస మంతయు అచ్చట కుప్పలు వోసి నారు విశ్వనాథ వారు.

సాయం సంధ్యా సమయమున ఆవేశముతో ఏకాంత ప్రదేశ మున తిరుగుచున్న వ్యక్తి ఇట్లను కొనినాడు.

నాడే మజ్జన కుండు వైరి నృప కాంతారమ్ము ఛేదించుచో
గూడం దీసెను గాని బాసటని, యా గొడ్డళ్ళచే నేమి రా
పాడం జాలడు మంత్ర కూట పతి యౌరా! గుండరా జెంత యా
టాడెన్ దైలప దేవుడింతకును బాహా గర్వ హీనుండగున్

'నాడే మజ్జనకుండు' అను నెత్తుగడయే ఒక విశిష్టత సంతరించు కొన్నది. కూడం దీసెను గాని బాసటని, రాపాడం జాలడు; గుండ

రాజెంత యాటాడెన్. ఇవి పలుకు బడులు. వీటినుపయోగించు కొని విశ్వనాథవారు వాక్య విన్యాసమునకొక ఒడుపును చేకూర్చినారు.

ఆనాడే నా తండ్రి శత్రువులను నడవి ఖండించు నపుడు తోడుగా ఉండునని చేరదీసినాడు కాని ఆ గొడ్డళ్ళచే మంత్రి కూట పతియైన గుండ రాజును చచ్చెడివాడు. అతడెంత ఆటాడినాడు. అడవి కాబట్టి గొడ్డళ్ళు.

ఇటు వంటి పద్యమునకు తాత్పర్యము వ్రాయ బూనుట ప్రొద్దు పొడుపున సూర్య కిరణ ప్రసారమునకు సాలె గూడుపై మిల మిలా మెరిసిపోవుచున్న మంచును చేతిలోనికి దీసికొనగా నీరు గారునట్లగును

గుండ రాజును చంపుటకు నిర్ణయించు కొను నప్పుడు ప్రోల రాజ హృదయము నుండి ఉబికి వచ్చు భావ పరంపర యిది.

పరు లదు దెంచినన్ గల నృపాలురు నల్వురు కూడి వారిపై
నరుగగ రాదొ? యెవ్వరికి నబ్బిన వారికె యుంట! యెంతదోః
పరిణత శక్తి! రాజ సభ భగ్నము సేయునొ గుండరాజు? త
చ్ఛిరమున మత్పదం బిడక చేవ యనన్ గలదే ధరాస్థలిన్

ఇతరులు దండెత్తి వచ్చునప్పుడు బలము గల రాజులందరు కూడి ఎదుర్కొన వలెననునది – నాటి స్వాతంత్ర్య సముపార్జనమునకు దేశీయు లందరేకమై సాగవలె నను విషయమును వ్యక్తీకరించు చున్నది. అసలు విశ్వనాథవారి మనసులో నున్న భావ మదియే. దేశభక్తి ప్రబోధమే ఏతద్రచనా పారమ్య ప్రయోజనము.

“ఎవ్వరికి నబ్బిన వారికె యుంట?” ఇది తెలుగు వాక్య విన్యాసము లోని సొగసు. అంటే ఎవరికి బలముంటే వారిదే – అనుదానికి ఒడుపగు ప్రయోగము. “రాజ సభ భగ్నము సేయునొ గుండ రాజు” గుండ రాజుపై గల తీక్ష్ణ కోపమునకు ఈ చిన్న చిన్న విడి విడి వాక్యము లన్నియు చిహ్నములు. ఎదుటి వారుండగా కోపమును

ప్రదర్శించు నపుడు సుదీర్ఘ వాక్యములుండును. తానొక్కడు తీవ్రా వేశమున నుండగా త్రుంచి, త్రుంచి మాటలాడు కొనును. ఆ స్వభావ మంతయు నీ పద్యమున తాండవించు చున్నది.

•ఇట్టిదే మరొక్కటి

తన శౌర్యంబది యెంత? రాజుల సభన్ దానెంత? యెంతెంతయో
చనకున్ బారలు చాచె? తద్విపుల వక్షంబున్ ప్రభేదింపకుం
డిన శ్రీ కాకతి దేవి పాదముల యందే మోప లేనీ శిర
స్సును, రేపే శుభ లగ్న మాంధ్ర విషయే శుండెవ్వడో తేల్చెదన్

శక యవన హూణుల దాడుల నెదుర్కొనుటకు రాజు లందరు తమ సైన్యములను గలిపిన బాగుండునని ప్రోలరాజు సూచనను గుండ రాజు భగ్న పరచినాడు. దీనిని దృష్టిలో నుంచు కొని ప్రోల రాజను కొనిన మాటలు.

ఇందలి – అది యెంత, తానెంత, ఎంతెంత, బారలు చాచె, మోపలేను, ఎవ్వడో తేల్చెదన్ – అమనవి వక్తయొక్క తీవ్రతను వక్కాణించు చున్నవి.

ఉద్రేకము కారణముగా ప్రోలరాజు శరీరాంగములు వేడెక్కగా చంద్ర కిరణ ప్రసారముచే చల్లబడినవి. అప్పుడు రాజు దుర్గ మార్గ మును బట్టినాడు. తరువాత జరిగిన విషయ మిది.

కాకతి కన్నుదోయి తెలి కల్వల కాంతులలో జ్రసన్నతా
శ్రీ కత దాల్చె నాటి నిశి రేని సభక్తిక మైన పూజలన్
రే కడ ముట్ట విన్నడె నరిందముమై దెసలందు జైత్రయా
తాత్రికకుదంబు నిస్సహాణ రావము భీకర మన్మ కొండపై

ప్రోలరాజు కుల దేవత కాకతీ దేవి. ఆ రాత్రి యంతయు రాజు కుల దేవతను పూజించుటయందు నిమగ్నుడయ్యెను. ఆ దేవి

తెలిగన్నులు ప్రసన్నతను దాల్చినవి. అనుమకొండపై తెల్లవారు సమయమున భయంకరముగా సమర సూచకమైన కొమ్ము బూరాలు మోగినవి.

సాయం సమయమున ప్రారంభమైన ఈ ఘట్టము తెల్లవారుటతో ముగిసినది.

ప్రోలరాజు యుద్ధమునకు బయలు దేరి సాధను విషయమును జెప్పకుండగా జైత్రయాత్రా చిహ్నమైన భేరీధ్వని వినబడిన దనుట కవి ఆలంకారికుడైన ఆనంద వర్ధనుని ధ్వని మార్గము నాశ్రయించి నట్టినది.

ప్రోలరాజనుకొన్న మాటలు క్రియా రూపము దాల్చినవని మనము భావించ వలసి యున్నది.

ఇదొక విశిష్టమైన కథా కథన పద్ధతి. ప్రోలరాజు యుద్ధ యాత్రలను క్రమముగా జెప్పటలో విశేష మంతగా లేదు. ఉద్రేకములో వెలువడిన భావ పరంపర కార్య రూపము దాల్చునట్లు వర్ణించుటలో కథా కథన చమత్కార మున్నది.

ఇక సందర్భాను కూలముగా 'చేగాలిన పెన్న నాకులని గంతులు వైచుట' కత్తుల గోక గట్టిగల క్ష్మాపతి యెవ్వడు, వనీరుహ చ్ఛాయల లోన రెక్కగమి జాచిన వారమ వంటి వాక్యములు వాడుట విశ్వనాథ వారి ప్రతిభా వైశిష్ట్యమునకు ప్రతీకలు.

లక్ష్యము:-

దేశ సమైక్యమునకు పాటు పడిన వ్యక్తిగా ప్రోల రాజును తీర్చి దిద్దుట ద్వారా విశ్వనాథవారు తన కాలము నాటి ప్రజల, నాయకుల అనైక్యమును తొలగించుటకు పూనుకొనినారు. సమైక్య పోరాటము దీని సందేశము.

# ప్రోలరాజు వధ

చారిత్రక నేపథ్యము:-

రుద్రదేవుడు రెండవ ప్రోలరాజు కుమారుడు. తండ్రిని మించిన వీరుడు. ఇతని కాకతి రుద్రుడని కూడ అందురు. రుద్రదేవుడనేక యుద్ధములు చేసి తన రాజ్యమును విస్తరించెను. ఇతని రాజ్యము ఉత్తరమున గోదావరి వరకును, దక్షిణమున శ్రీశైలము వరకును, పశ్చిమమున కళ్యాణి వరకును, తూర్పున తూర్పు కనుమల వరకును వ్యాపించెను. కాకతీయ రాజ్యమునకు స్వతంత్ర ప్రతిపత్తిని సుస్థిరము జేసిన వాడు.

ఆ రోజులలో మత వైషమ్యము మానవత్వమును మంట గలిపినది. జైన మత మడుగంటుచున్నది. బసవేశ్వరుని మతము క్రమ క్రమాభివృద్ధి గాంచుచున్నది.

ప్రోలరాజు మొదట జైనుడు. జీవితాంతమున శైవుడైనాడు. రుద్రదేవుడు వీరశైవము నంది తీక్ష్ణ స్వభావుడై యున్నవాడు.

వీరశైవమున తీక్ష్ణ స్వభావుడైయున్న రుద్రదేవునిచే తండ్రియగు ప్రోలరాజు అనుకోకుండగా చంపబడినట్లు కొందరి పరిశోధకుల కథనము.

విషయ సంగ్రహము:-

ఒక నాటి సాయంకాలము రుద్రదేవుడు శివుని ఎదుట నిల్చుండి ప్రార్థనము చేసికొనుచుండెను. ఆ సమయమున అతనికి ఇతర మతాదుల వారి కృత్యములు స్మరణకు వచ్చి వాటిని గూర్చి శివుని కిట్లు మొరపెట్టుకొనినాడు.

ఓ ఈశ్వరా! అన్యమత వ్యూహములకు దగుల్కొని జనులు నీచింతనమును మరచి పోయిరి. పాప విధ్వంసకుడవైన నిన్ను దేవ

దేవుడన లేకున్నారు. 'సోऽహం' అను సద్వైత మార్గమున పోలేకున్నారు. వేదములు మిథ్య యనుచున్నారు. నిగమాంత గోచరుడవు నీవు మాత్రమే యను సత్య మార్గము వారికి గిట్టదు. దుర్మతములు మేఘములై ఆవరించు చున్నవి. సన్మతమను సూర్య కాంతి తగ్గు చున్నది. నీ యాజ్ఞ కోసము భృత్యుడెదురు చూచు చున్నాడు.

తరువాత ధ్యాన మగ్నుడైన అతని హృదయమున వీరశైవ శిఖ జ్వాలలు వ్యాపించగా మీలితాక్షుడై యుండగా తండ్రియైన ప్రోలరాజు శివ సన్నిధికి నడచి వచ్చెను.

అంతలో సూర్యుడస్తమించినాడు. శివ సన్నిధికి వచ్చు ప్రోల రాజు యొక్క యుత్తరీయపు టంచుల నుండి వెలువడు గాలి రుద్ర దేవునికి తాకినది. శైవ మతముపై పగ గలవాడెవ్వడో తన తపః పరిశుద్ధతను భగ్నము చేయుటకు వచ్చెనను నావేశముతో చేతిలో నున్న కత్తిని ఆ వ్యక్తి వక్షమున గుచ్చెను. అతడెవ్వరో కాదు; తన తండ్రి ప్రోలరాజు.

తండ్రియని తెలిసిన నిముసములో రుద్ర దేవునకు తల తిరిగినది. తండ్రి పాదముల వద్ద మూర్ఛ పోయినాడు. తెలివి వచ్చిన తరువాత ఇట్లు చింతించినాడు.

తండ్రీ! నీవు ధనుస్సు పూరించి నిలువగా నీ సైన్యములు ముందు కురికినవి. అట్టి నీ హృదయమున నా బాకు గాఢముగా నాటు కొనినది. ఎంత క్రూర కర్మమునకు పాల్పడితిని. శత్రువుల నెందరి నో జయించిన నీవు తేజోహీనమగు నా కత్తికి గురైతివి. నేనిక వధ్య స్థాన యోగ్యుడను. ఈ పితృహంత కాకతి రాజ్యమునకు ప్రభువు కావలసి వచ్చినది. తండ్రి రక్తమున దోగిన చేతులతో రాజ్య పాలనము చేయుటకు నేననర్హుడను. కాకతి రాజ్యలక్ష్మి నిల్వ నీడ యిన నీ యెదురు రొమ్మున కత్తిని దింపిన పాపాత్ముడను యమ

పట్టణమునకు పంపుటకు యోగ్యుడగు వాడను. ఇంకను ఈ నిర్భా గ్యునిపై పుత్రవాత్సల్య వీక్షణములు ప్రసరించు చుంటివి. శరీరము పగులుట లేదు. ప్రాణములు పోకున్నవి. నా దౌర్భాగ్యమున కంతు లేదు. పితృ హంతనైన నేను నవ్యాంధ్ర శ్రీ మహా రాజ్య లక్ష్మి కళ్యాణవతికి సపత్నియై ఇకపై అమంగళ మూర్తి కానున్న నాతల్లి నెట్లు జూడ గలను? అని పలవించి మూర్ఛిల్లిన రుద్రదేవుని వద్దకు మంత్రులు వచ్చి ప్రోలరాజునకు దహన సంస్కార కార్యములు గావించిరి. ఆనాటి నుంచి అతని ముఖము నందు మందస్మితమే కనిపించ లేదట.

## చరిత్ర - కావ్యముల సమన్వయము :-

"ఈతడు (ప్రోలరాజు) ప్రమాద వశమున తన కుమారుడగు రుద్రదేవునిచే చంపబడినట్లు ఐతిహ్యము కలదు. కాని దాని కిత రాధారములు లేవు. ఈతడు తూర్పు తీరమున తన రాజ్యము విస్త రింప జేయుటకై యుద్ధము చేయుచు, వెలనాటి ప్రభువుచే నిహతు డయ్యెను. ద్రాక్షారామ మందలి యొక శాసన మీ యంశము ను సూచించు చున్నది." ఆంధ్రుల చరిత్ర - సంస్కృతి.

ఈ శాసనమున వెలనాటి వంశీయుడగు రెండవ చోడ రాజు నకు 'కాకతి ప్రోల నిర్దహన' అను బిరుదము వాడబడినది. ఇదియే దీనికి ప్రమాణము.

అయితే విశ్వనాథవారు కుమారుని చేతిలో ప్రోలరాజు ప్రమాద వశమున చనిపోయెనను నైతిహ్యము నాధారము చేసికొని దీనిని రచించినట్లు తెలియు చున్నది.

## కావ్య శిల్పము :-

ఈ ఖండిక యందు కాకతి రుద్రదేవునకు వీరశైవమునందు గల అభినివేశము వ్యక్తీకరింపబడుట తోపాటు తండ్రినే అనుకోకుండ

గా పొడిచి చంపిన తనయుని వేదన నిక్షిప్తము గావించినారు విశ్వనాథవారు.

ఒక నాటి సాయంకాలమున శివాయతనమున కాకతి రుద్రదేవుడు శివుని కెదురుగా నిల్చి శైవమత మెంత దిగజారి పోయెనో విన్నవించు ప్రారంభ పద్యమిది.

ఓహో చాలును జేటువోక కుమతవ్యూహంబులం జిక్కినీ
యూహల్ మానెద రోయి సాంబ! కరుణా వృష్టిన్ విలోకించెదం
హో హారిన్ నిను దేవదేవుడన లేడు గ్రాక్ష! నీ భక్తిలో
సోహం మార్గము పోడు నాస్తికత యెట్లో ర్వంగనౌ జెప్పవే

జనులు జైనాది అన్యమత వ్యూహములందు జక్కి నీస్మరణనే మరచినారు. పాప విధ్వంసకుడవైన నిన్ను వారు దేవదేవునిగా పూజింప లేకున్నారు. సః + అహం = సోఽహం = ఆ దేవుడే నేను అను నద్వైత సిద్ధాంతము నెరుంగక నాస్తికులై తిరుగుచున్న నెట్లు సహింప వచ్చును.

అంతే గాకుండగా వేదాంత గోచరుడు శివుడే యనియు, ఈ మత ప్రవక్త లందొక్కడు కూడ ఋత మార్గము ననుసరించుట లేదనియు అకాలపు మౌనము పనికి రాదనియు ననుచున్న పద్యమిది.

చెడు తలపుల్ ఫలించె శశిశేఖర! వేదము లెల్ల మిధ్యలే
మ్పడ! నిగమాంత గోచరుడవీ వాకరుంతవ, యెంతమందియే
ర్పడిరి మత ప్రవక్తలు శివా! ఋత మార్గము పొంత వోడొ
క్కడు, నికనేమి కావలె నకాలపు మౌనము నీక యబ్బెపో।

కాకతి రుద్రదేవుడు క్రమ క్రమముగా వీరశైవ మతాభినివేశము కారణముగా ఉద్రేకము పొందుచున్న స్థితియే ఈ భావ పరంపర. ఈసారి నీ యాజ్ఞ కోసము దాసుడనైన నేను సిద్ధముగా నున్నానని ను చున్నాడు.

చాలున్, మౌనము మించి వచ్చినదివో చక్షుః శ్రవో భూష! క్షో
ణీపీలారథ! అస్థి హార! శివ కంఠే కాల! మృత్యుం జయా!
శూలీ! దుష్ట మతాంబు వాహములు మించున్ సన్మతాబ్జార్క తే
జోలుంఠాకము లయ్యె, నీముదల వేచున్ భృత్యుడీశా! ప్రభూ!

అకాలపు మౌనమునియు, మోనము మించి వచ్చినదియు ననుట తగిన చర్య తీసికొన వలెనను అభిప్రాయము వ్యక్తమై పోయినది. కనుకనే నీ యాజ్ఞ కోసము వేచి యున్నా ననినాడు.

అతని దృష్టిలో ఇతర మతము లన్నియు దుష్టములే. అందు చే దుర్మతములు మేఘములై ఆవరించు చున్నవనుట. సన్మత మను సూర్య కాంతికి అడ్డు పడు చున్నవి.

ఇతరము లన్నియు దుష్ట మతములు; తమది సన్మతమను కొనుట, వారిని చీల్చి చెండాడుటకు ఆజ్ఞ ఇమ్మనుట ఇవి యన్నియు వీరశైవమునకు సంబంధించినవే.

అట్లు రుద్రదేవుడు 'మనమున వీరశైవ శిఖమంటలు గ్రమ్మగ' కన్నులు మూసికొనినాడు. ఆ సమయమున నక్కడకు తండ్రియైన పోలరాజు వచ్చునంతలో సూర్యుడస్తమించు వర్ణన చేయుట ఔచిత్య శోభితము. ఆ చీకటిలో వచ్చిన వ్యక్తి యెవరో రుద్రదేవునకు తెలియ కుండగా నుండుటకు తగినట్టిది. అంతియే గాక

'తజ్జనకుడు పోలరాజు శివ సన్నిధికన్ జనుదెంచె నత్తరిన్' అని చెప్పి సూర్యాస్తమయమును వర్ణించుట పోలరాజు కథ తేర బోవు చున్నాడనునది సూచించి నట్టైనది. ఆ వర్ణన ఇది.

ఆరబ్ధేశ్వర తాండవ భ్రమణ పాదాంభోరుహాస్రస్త మం
జీరంబో, గగనేందిరా కర వత్సచ్ఛ కందుకంబో, పున
స్స్వారాజ్య చ్యుత భుక్త పుణ్యమగు నక్షత్రంబొ నా బశ్చిమా
శారత్నాకర మందు గ్రుంకెను వివస్వద్బింబ మల్లంతలో

సంధ్యా తాండవ లోలుడై యున్న శివుని పాదము నుండి జారి పడిన మంజీరమో, ఆకాశ లక్ష్మి హస్తము నుండి పడుచున్న కందుకమో, పుణ్య ఫల మనుభవించి స్వర్గమునుండి జారిన నక్షత్రమో యనునట్లు పశ్చిమ సముద్రమందు సూర్యబింబము గ్రుంకినది.

'సంధ్యా తాండవము గావించుచున్న శివుని పాదము నుండి జారిపడిన మంజీర మని' సూర్యాస్తమయ వర్ణనలో కూడ శివుని ప్రస్తావన తెచ్చుట - వస్తువుతో వర్ణన కలిసి పోవుట. ఇట్లు చేయుట ప్రతిభా హంవీరులకే సాధ్యము. ఈ పద్యము విశ్వనాథవారి ఊహా వైభవమునకు ప్రతీక. అయితే చివరివరకు ఆ వచ్చిన వ్యక్తి ప్రోలరాజను విషయము పాఠకునకు కూడ తెలియకుండినచో కథా కథన మింకను రక్తి కట్టెడి దేమో!

సూర్యుడు గ్రుంకగా చీకటి వ్యాపించినది. దేవాలయ మంధకార మయమైనది. ఆ సమయమున శివ లింగము చెంతకు వచ్చునది తండ్రియో, లేక శివహాని యొనర్చుటకు వచ్చిన శత్రువో రుద్రదేవునకు తెలియదు. అట్లు తెలియ లేదని చెప్పుటకై ఈ సూర్యాస్తమయ వర్ణన. అదియును గాక ధ్యాన మగ్నుని భంగము గావించు కొల్లని వాడై ఆవతలి వ్యక్తి శబ్దము చేయకుండగా వచ్చును. అందుచేతనే రుద్రదేవుడు కోపించుటకు శబ్ద కారణము చెప్పజాలేము. ప్రోలరాజు యొక్క ఉత్తరీయపు టంచుల నుండి వెలువడిన గాలి కారణముగా.

పెగలుచు కొన్న సాహసి పవిత్ర! హుతాశన దృష్ట తంబుపై
పగ గల యెవ్వడో నిజతపః పరిశుద్ధత గల్మషంబు చే
యగ దనుమట్ట వచ్చెనని, యాగ్రహ ఘూర్ణిత తారకాక్షుడై,
భగ భగ మండిపోయి పితృపక్షము గ్రుచ్చె గరాసి న్యగ్రుడై

శైవముపై పగ గల యెవ్వడో తన తపః పవిత్రతను భగ్నము

చేయ వచ్చుటకొనుటకు వచ్చెనని ఆవేశముతో తన చేతిలో నున్న ఖడ్గ మును ఆ వ్యక్తి వక్షమున గ్రుచ్చినాడు.

వీరశైవులు శైవేతరుల దర్శన స్పర్శనాదుల నంగీకరింపరు.

"భవి జన దర్శన స్పర్శనాలాప
వివిధ దావాదాన విషయ దూరగుఁడ" అను పండితారాధ్య చరిత్రలోని వాక్యములే అందుకు ప్రమాణములు.

ఇచ్చట స్పర్శనమును అపవిత్రతగా భావించినాడు రుద్రదేవుడు.

దాని ప్రభావము కత్తితో పొడుచుట. పరిణామము రుద్రదేవు డు పితృహంత. తాను పొడిచిన వ్యక్తి తండ్రియే అని తెలిసికొని మిన్నును మన్ను నేక మౌనట్లుగా విలపించినాడు. అది విశ్వనాథవారి దృష్టిలో వృథా పరిదేవనము.

రుద్రదేవుడు పితృహంతకుడై విలపించిన తీరు తెన్నులను విశ్వనాథవారు కరుణ రస ప్లావితము చేసినారు.

ఈ పితృహంత వీడటవె యీపయి కాకతి రాజ్యభోక్త యీ
పాపము పేరుగా ప్రళయ పావక కీలలు నన్ను మ్రింగ వొ
రా! పరమేశ! తండ్రి రుధిరమ్మున దోగిన చేతులన్ ధరి
త్రీ పరి పాలనమ్ము గడి దేరి నదే! యిక నేననర్హుడన్

కాకతి రాజ్య పాలనకు తన కర్హత లేదని దుఃఖించినాడు. ఏ మొగము పెట్టుకొని తండ్రిని హత్యచేసిన తాను తల్లి మొగమును జూడ గలనని విలపించి నాడు.

ఈ కృత్యంబున జేస వైరినయి యేనెట్టేగి దర్శించెదన్
వా కన్నన్ బితృ హంత యెవ్వడు నవాంధ్ర శ్రీ మహారాజ్యల
క్ష్మీ కల్యాణపతీ సపత్నియయి లక్ష్మింబోలు నా తల్లి నా
శోకా మంగళ మూర్తినే విధమునన్ జూతున్ వచింపం గదే?

ఇట్లు పునరుక్తము కాని, వెల్తికాని లేని విధముగా ఈ రచనను నిర్వహించినారు విశ్వనాథవారు.

"ఘనుడౌ రుద్రనృపాలు జీవితములో గన్పించనే లేదటా
తని యాస్యాంచలసీమలందు నవమందశ్రీ ప్మితాంకూరముల్" అవి ముగించుటచే - పాఠకుడు - జీవితములో నవ్వులేని రుద్రదేవుని మొగమును మరచిపోలేడు.

లక్ష్యము:-

మత మౌఢ్య రూపమైన మతాభినివేశ మెంత యనర్థమునకు దారి తీయునో చెప్పుటయే కవిగారి ముఖ్యాశయము.

# కొండవీటి పొగమబ్బులు

## చారిత్రక నేపథ్యము:-

గుంటూరు జిల్లా యందలి నరసరావుపేట సమీపమున గల దుర్గారణ్య స్థలమే కొండవీడు. ఈనాడు పాడుపడియున్న వల్లెయే రెడ్డి రాజుల కాలములో అష్టైశ్వర్యముల ననుభవించిన కొండవీడు. ఈ పర్వతమున దాదాపు నలుబది శిఖరములు, ఆరు గుహలును కలవు.

కొండపై కోట గోడలు శిథిలములై కన్పించు చుండును. కొండ వీటి దండ కవిలెయందు ప్రప్రథమమున 800 సంవత్సరముల క్రిందట "విశ్వంభర దేవుడ"ను రాజు కట్టించెనని యున్నది. 'కవిలె' యనగా గ్రామ చరిత్రదులు వ్రాసి పెట్టుకొనిన పుస్తకము. మరీ పాతదైనచో 'దండ కవిలె' యందురు.

కొండవీటికి పూర్వము కుండిన నగరమని పేరుండె ననియు, విదర్భ దేశమున కది రాజధాని అనియు, ఇందే దమయంతి, రుక్మిణి జన్మించి ననియు, కొండపైనున్న ముల్ల గూరమ్మయే రుక్మిణి పూజించిన పార్వతి యనియు జనశ్రుతి.

కొండవీటి రాజ్యము కృష్ణా, గోదావరి, గుంటూరు, నెల్లూరు, కర్నూలు మండలములకు వ్యాపించి యున్నట్లు రెడ్డి రాజుల శాసనములు బిరుదుల వలన తెలియుచున్నది.

కొండవీటిని పాలించిన ప్రథమాంధ్ర సామ్రాజ్యాధిపతి ప్రోలయ వేముడు. అయితే ప్రోలయ వేమారెడ్డికి రాజధాని అద్దంకి యని శాసన ప్రమాణము. తరువాత ఇతని కుమారుడు అనపోతారెడ్డి తన రాజధానిని అద్దంకి నుండి కొండవీటికి మార్చినట్లు తెలియుచున్నది.

ప్రోలయ వేమారెడ్డి ఎర్రాప్రగడాది కవులకు ఆశ్రయమిచ్చినవాడు. అనపోతారెడ్డి దుర్గమునకు బలమైన ప్రాకారము నిర్మించిన వాడు. అన వేముని కాలమున కొండవీడు కస్తూరి ఘనసారాది సుగంధ ద్రవ్యములతో ఘుమ ఘుమ లాడుచుండెను. వసంతోత్సవములు విరివిగా సాగుచుండెడివి. శారదా వల్లభుడను త్రిలోచనాచార్యుడు ఆస్థాన పండితుడు. కొమరగిరిరెడ్డి కాలమున కొండవీడు నౌకావ్యాపారస్థులకు ఆటపట్టు. పెదకోమటి వేమారెడ్డి కాలము స్వర్ణయుగము. వామన భట్ట బాణుడు, శ్రీనాథుడు మున్నగు విద్వత్కవులు, మామిడి సింగనామాత్యుడు, వేమనామాత్యుడు మొదలగు అమాత్య శేఖరు లుండెడివారు.

విషయ సంగ్రహము :-

విశ్వనాథ వారొక నాటి ఉదయమున కొండవీటి కోటలను, బురుజులను, కొండ కొనలను దర్శించినారు. వాటిపై అలముకొని యున్న పొగ మబ్బులు వారికి పరి పరి విధముల ఊహలు పుట్టించినవి. అవి అక్షర రూపము దాల్చినది.

ఆ పొగ మబ్బులు దగ్ధాంధ్ర రాజ్యము నుండి పైకెగయు పొగవలెను, వీరజాలని రెడ్లకీర్తి పరెను, రెడ్లవంటింటి పొగలవలెను, పచ్చగడ్డికై తారాడు తెల్లయావుల మందలవలెను కన్పించినవి.

వంగిన ముత్యాల గొడుగు వలె, రెడ్డిరాజు కిరీటము వలె, అంతఃపుర కాంతలు ధరించు మేలి ముసుగువలెను, తెల్లుపీరని బద్దము వలెను కన్పించుచున్న ఈ పొగ మబ్బులు వంద లేళ్ళుగా రాజసేవ చేయుచున్నట్లున్నవి. కొండల కొనల యందున్న మబ్బులు-అతిథ్యమిచ్చు రెడ్డి రాజుల వంటశాలలోని పొగవలెను, శ్రీనాథ కావ్య శ్రోతలకు పరచిన సందళ్ళ వలెను, ఆంధ్ర భటుల వీర గంధము వలెను, ఉత్సాహగతులైన జనులను వీక్షించు రెడ్డి వంశపు ముగ్గుల వలె నగుపించినవి. ముత్యాల వలిపెము చుట్టుచున్నట్లుగను, జఘన భాగము నుండి జారుచున్న వస్త్రము వలెను, గిరిలక్ష్మి మొగము పై పూసిన మొగలి పుప్పొడి వలెను. రత్యంత సమయమున కుచములపై దోచు స్వేద బిందువుల వలెను శిథిల దుర్గలక్ష్మిని అలంకరించునట్లు పొగ మబ్బులు కనిపించినవి. దమయంతి యెక్కిన రథముపై నెగురు గరుడధ్వజము. గజపతుల గజములు తొండములతో జిమ్ము నీటి తుంపురులు, రెడ్ల కీర్తి పతాక. నైషధ కావ్యమున హంసాధి నాథుని రెక్కలు. కసవా పాతురిని జయించిన కృష్ణరాయుల క్రోధాగ్ని ధూమము కలిసినట్లు పొగ మబ్బులున్నవి. ఉత్కళ సైనికులైన పాతురిలు బురుజులపై లేరు. ఈటెలు దాల్చి నిల్చుండు రెడ్డి వీరులు కోటపై లేరు. కత్తులకు గుండె లెదు రొడ్డు రాయుల ఏనిక గున్నలు కోట బురుజులపై లేవు. పాత్రివాపహారకులైన రక్షక భటులు లేరు. కనుక పొగ మబ్బులు స్వేచ్ఛగా తిరుగాడ వచ్చును. నిర్భయముగా ఏ అడ్డంకి లేకుండగా అంతఃపుర సౌధములపై తిరుగాడు పిచ్చి పొగ మబ్బులార! సర్ప ముల వంటి అద్దంకి రెడ్లు మిమ్ము లను చీల్చి చెండాడుదరు. దుర్గ కుడ్యముల ద్వారములపై వ్రాయబడిన ముత్యాల అక్షరములో, కొండపై గీచిన ముత్యాల ముగ్గులో, మంద పవనములకు అల్లలాడు తోరణమో. నీటి తుంపురుల జిమ్ము జలధారా యంత్రమో అనునట్లు రెడ్ల పూర్వాంధ్ర ప్రశస్తిని చాటుచున్నవీ పొగ మబ్బులు. రెడ్డి రాజుల హృదయములలో మిగిలిపోయిన కోరికల వలె, తెలుగు

యోధుల తృప్తి పొందని యాత్మలవలె, ఎర్రాప్రగడ, శ్రీనాథుల కావ్యముల కవిత్వము నందింకను చెప్పవలసిన భావముల వలె, తిరిగి వచ్చిన అవచి తిప్పయ సెట్టి ప్రాణముల వలె కొండవీటిని వదలి పోలేనివై ప్రేతాత్మల రూపమున ఈ పొగ మబ్బులు తిరుగాడు చున్నవి. నా ప్రాణములకు ఈ పొగ మబ్బుల కేమి సంబంధమో కాని నేను కూడ ఒక మబ్బునై కొండ కొనలపై తిరుగాడుచు వాటితో కలిసి పోవలె నని యున్నది. నాయూహ ఈ పొగ మబ్బులనే అను సరించి తిరుగుచున్నది. తూర్పు కనుమలు విడుచు నిట్టూర్పులవలె నివి మనసులోని లలిత గీతిని వెలార్చు చున్నవి.

## చరిత్ర - కావ్యముల సమన్వయము :-

కొండవీటిని పాలించిన రాజుల ముఖ్యముగా రెడ్డి రాజుల ప్రశంస ఇందు గావింప బడినది. చరిత-కావ్యముల విరుద్ధాంశము లిందు లేవు. అద్దంకి రెడ్లు కూడ కొండవీటి రెడ్డిరాజులే. అనగా కొండ వీటి సామ్రాజ్యమును అద్దంకి రాజధానిగా నేలిన రెడ్డిరాజులు, అట్లే ఎర్రన. శ్రీనాథులు రెడ్డిరాజులతో సంబంధ మున్నవారు. గజపతి, కృష్ణరాయలు కొండవీడును జయించిన వారు. కనుకనే వారి ప్రస్తావన కావ్యమున తేబడినది.

## కావ్య శిల్పము :-

'ఆంధ్ర ప్రశస్తి'కే విశిష్టతను చేకూర్చిన కవితా ఖండిక 'కొండ వీటి పొగ మబ్బులు'! ఇది క్షేత్ర ప్రశస్తికి సంబంధించినది. విశ్వ నాథవారు సభలలో తరచుగా చదివెడి పద్యములలో నివి పేర్కొన దగినవి. ఈ పద్యములను వారు చదివిన తీరును గూర్చి, విశిష్టతను గూర్చి, సభ్యులు పొందిన పరవశత్వమును గూర్చి నెంపరాల సూర్య నారాయణ శాస్త్రిగారి వాక్యములిట పేర్కొనదగినవి.

"ఏలూరు 'సాహితీ సమితి'లో ఆయన నిజముగు వీరుడగు నాంధ్ర పుత్రుడనినట్లు చేయెత్తు దృఢమైన మూర్తితో నిలువబడి యుత్తరీయము నడుమునకు జుట్టుకొని గొంతెత్తి గానయుక్తముగా చదివిన కొండవీటి పొగమబ్బులు చెవులలో గుండెలలో అమృతవర్షము కురిసినట్లయి పరవశించిన సభ్యులందరిలో నేనొకడను. ఏమి భావన! ఆ గాలి మూలముగా రెడ్డిరాజుల నిరుపమ రాజ్య వైభవముల పరిమళములిమిడి యుండుటచే ఆ మూట కదిలించిన మాత్రమున 'గప్పు'మని మిన్నంట లేచి దశదిశలు గ్రమ్మినట్లయినది....... ....

కాళిదాసు స్వయముగా వచ్చి 'నభూతోన భవిష్యతి' అని ప్రసిద్ధమైన తన మేఘసందేశ కావ్యమును శృంగార రసము చిప్పిల్ల నాటి యీ సభావేదిక నిలిచి యెంత మధురముగా జదివినను రాజ్య వాంఛాపిపాసితమైన నాటి కాలమున ఆషాఢ ప్రథమ దివస మేఘము వీరకరుణ రస భర భరితములగు విశ్వనాథవారి పొగమబ్బుల ముందు దూదిపింజయై తెల్లపోవలసినదే కాని నిలుచునా? అనిపించినది.

కవియగు వానికి ముఖ్యముగ నుండవలసిన ప్రతిభకు ఈ ఖండము మచ్చుగా చూపితిని"

ఇవి కవి సార్వభౌముని గూర్చి విద్వత్కవి తూచి, తూచి పలికిన సత్యయుక్తమైన మధుర భాషణములు.

దీనిని బట్టి విశ్వనాథవారి ప్రతిభకు గీటురాయిగా 'కొండవీటి పొగమబ్బులు' ఖండికను పేర్కొన వచ్చుననుట సమంజస రంజితము. విశ్వనాథవారి సకలోహ వైభవ సనాథము ఈ ఖండిక.

ఒక నాటి ఉదయ సమయమున 'కొండవీటి పొగమబ్బుల'ను జూచిన విశ్వనాథవారి హృదయమున కలిగిన విచిత్ర మధుర భావనానుభూతి పరంపరకు అక్షరాకృతి ఈ ఖండిక.

కొండ కొమ్ములపై అలముకొనిన పొగ మబ్బులు విశ్వనాథ సత్యనారాయణ గారికి ఈ క్రింది విధముగా కనిపించినవి.

దగ్ధాంధ్ర రాజ్య నిత్యవిధూత ధూమమ్ము
వలె గొండ బురుజుల కెలనలేచి
బురుజు కొమ్మల వీడిపోలేని రెడ్లకీ
ర్తివోలె బెనురాళ్ళ నతుకులు బడి
రెడ్ల కందా వెన్క రేగు వంటింటి
పెన్పొగ వోలె గుమురులై ముందుసాగి
దాగ్ధావ దాంధ్ర స్వతంత్రతా రమవోలె
గొండ లంటి యంట కుండబోయి

శ్యామలీ భవద్గ్రాస ఘాసాద నార్థ
మొలయు వెల్లావుల కదంబములుగ నిలిచి
కొండ కొమ్ములు లోదాచుకొన్న క్రొత్త
క్రొత్త పొగ మబ్బులలమె నీ కొండ కొసల

కొండవీటి కోటలు, బురుజులు శిధిలములై యున్నవి. కనుకనే దగ్ధాంధ్ర రాజ్యము'తో పొరంభించినారు. ఆ శిథిలము లిప్పుడు పూర్వుల గొప్పతనమును చాటు చుండును. అందుచేతనే వీడిపోలేని రెడ్ల కీర్తితో పొగ మబ్బులను పోల్చినారు. అదియును గాక కీర్తి తెల్లగా నుండు ననుట కవి సమయము. శిధిలములు రెడ్ల కీర్తికి గుర్తులు. ఆ రెడ్ల కీర్తి వలె పొగ మబ్బులున్న వనుట విశేషము. పచ్చ గడ్డికై తారాడు తెల్ల యావుల మంద వలె పొగ మబ్బులు కని పించిన వనుట విశ్వనాథ వంటి ప్రతిభావంతునికే సాధ్యము.

వంటింటి పొగ, వెంటనే పరుగెత్తిపోవు స్వాతంత్ర్యలక్ష్మి — ఈ పోలిక లన్నింటిలో గూడు కట్టుకొనిన విషయ మేమనగా ప్రస్తుతము కొండవీడు తలకు మాసియున్నదనుట.

'రెడ్ల కందావెన్క రేగు వంటింటి పెన్భొగ వోలె' - అనునది- పొగ చూరి పోయినదను విషయమును స్పష్టము చేయుచున్నది. "దాఘ్రిద్గావ దాంధ్ర స్వతంత్రితారము"యనుట - వస్తుతము పరుల పాలనలో ఉన్నదనుట. వెంటనే పరుగెత్తిపోయె ననుటలో గలధ్వని.

తెల్ల యావుల మంద పచ్చగడ్డి కొరకు తిరుగుచున్నవనుటలో- పచ్చగడ్డి మొలచుట - ప్రస్తుతము బీడుపలె తయారైనదనుట.

ఈ పోలిక లన్నింటి వెనుక కొండవీటి శిథిల స్వరూపము ధ్వనించుచున్నది. వర్ణన వస్తువుతో కలిసి పోవుటనగా ఇది.

ఈ జగా పొగ మబ్బులు నేటికిని రాజసేవ మరచి పోలేదనిన పద్యమిది.

ఒక రెడ్డి సభ తీర్చియున్న కొండకు వాలు
కొసలలో ముత్యాల గొడుగు పట్టు
ఒక రెడ్డి మూర్తి పోలిక తీరియున్న కొం
డకు గోసగా గిరీటమ్ము పెట్టు
ఒక యంతి పురము వధూత్ప్రేక్ష జను బురు
జున సన్న మేలి మునుంగు తొడుగు
ఒక తెల్గు బంటు ఠీవికి ముద్రగొనియున్న
బురుజు వజ్ర మహాసి వోలె వ్రేలు

ఈ జగా పొగ మబ్బులు రాజసేవ
మరచి పోవులే, రసధునీ మహిత మూర్తు
లేము లెక్కించుచుంటిమి యెన్నినాళ్ళ
చనినొయని వందలేళ్ళుగా సొచుకొంచు

ఇచ్చట ముత్యాల గొడుగు, కిరీటము, మేలి ముసుగు, మహా ఖడ్గము వీటి వలన పట్టాభిషేకోత్సవము, మరియు వివాహోత్సవము ధ్వనించుచున్నవి.

ఒక రెడ్డి సభ తీర్చుట - ముత్యాల గొడుగు పట్టుట - ఒక రెడ్డి మూర్తి పోలిక తీరి యుండుట - కిరీటము పెట్టుట. అంతఃపుర వధువు - మేలి ముసుగు తెల్గు వీరుడు - మహా ఖడ్గము.

అనగా ఒక రెడ్డి వీరునకు యువరాజ పట్టాభిషేకము గావించి, వివాహము చేసి, మహా ఖడ్గము బహూకరించుట ఇందలి వృత్తాంతముగా మన మూహించుకొన వచ్చును

కొండవీటి పొగ మబ్బులను పలురకములుగా ఊహించుటలో నే ఒక సన్నివేశమును, అదియు దాని ప్రాశస్త్యము తెలుపు నట్టిది - వ్యక్తము చేయుట ప్రతిభా నిష్యంద మనక తప్పదు.

వారి కింకను మబ్బులగుపించి, క్రింది విధముగా భ్రాంతి గొలిపినవి.

అస్మదర్థాతి థేయార్థములు రెడ్ల
భువి వంట శాలల పొగ లటంచు
అచట శ్రీనాథ కావ్య శ్రోతలగు మాకు
బరచిన పండిళ్ళ పరపు లంచు
కొండ కొమ్ముల దీర్చికొని నిల్చియున్న యాం
ధ్రీజటాళి వీర గంధాల టంచు
ఉత్సవాగత జన మెక్కిరిగిపో గొండకొ
మ్ముల దొంగి కను రెడ్ల మా గుర్రలనుచు

మున్ను గుర్రాల దూకించుకొన్న చోట
నడుగడుగునందు జాతంబులైన మాకు
నప్పుడప్పుడు తలలెత్తి నంత కొండ
కొసల మబ్బుల పొరపెట్టి విసరులాడు.

కొండ కొసల యందు గల మబ్బులు - ఆతిథ్య మిచ్చు రెడ్డి రాజుల వంటశాల లోని పొగ వలె కన్పించె ననుట - కొండవీటి రెడ్డి

రాజుల అతిథి మర్యాద నుగ్గడించుట, శ్రీనాథ కవిత్వము వినుటకు వచ్చిన వారికి పరచిన పందిళ్ళ వలె నున్నవనుట - రెడ్డి రాజాదుల కావ్య స్వీకరణోత్సవము చెప్ప బడినది; ఆంధ్ర భటుల కదన వీర గంధము వలె నున్నవనుట - రెడ్డి రాజులు వీరులను సన్మానించుట వ్యక్తమగు చున్నది; ఉత్సవాగత జనులను వీక్షించు రెడ్డి వంశపు ముగ్ధల వలె నున్నవనుట - వసంతోత్సవములను దలపింప జేయు చున్నవి.

ఇట్లు పొగ మబ్బుల పోలికలలో మధుర చారిత్రక సంఘటనలను పొందు పరచినారు విశ్వనాథవారు.

ఒక సారి వలిపమ్ము చికిలి ముత్యాల యం
చుల వోలిక నుపత్యకల జరించు
ఒక సారి జఘన భాగోపరి స్రస్త చే
లవిధాన గిరిమొదళ్ళ బడిపోవు
ఒక సారి గిరిలక్ష్మి మొగముపై మొగలి పు
ప్పొళ్ళూదు కొన్నట్లు చెల్లరేగు
ఒక సారి స్వేద బిందుకములు రత్యంత
వేళా కుచావృత్తి విస్తరించు

చిరుత పొగ మబ్బులీ కొండసీమ బలుచ
బడి, విశీర్ణమై, ధూతమై, తడిసి, రాచ
సిరి యుడిగి పోయినట్టి యీ శిథిల దుర్గ
లక్ష్మి కొనగూర్పు వెర్రి యలంకృతులను

శిథిల దుర్గ లక్ష్మికి అలంకారము లొనర్చుచున్న చిరుత పొగ మబ్బుల చేష్టలందు సంభోగ శృంగార విషయమును పదిల పరచినారు కవిగారు.

ముత్యాల వలిపెము చుట్టు చున్నట్లుగా కొండప్రాంత భూమిని

చుట్టుట, కటి భాగము నుండి జారుచున్న చీరవలె గిరి మొదళ్ళ బడి పోవుట, గిరి లక్ష్మి మొగముపై బడిన మొగలి పుప్పొళ్ళూదు కొన్నట్లు చెలరేగుట, రత్యంతమున కుచములపైగల స్వేద బిందువుల వలె విస్తరించుట-ఈ పొగ మబ్బుల చేష్టలందు సంభోగ విషయ క్రమత కలదు. చరించుట, పడుట, చెల్లరేగుట, విస్తరించుట - ఈ క్రియా పదములందు కూడ నొక క్రమత నూహింప వచ్చును.

పొగ మబ్బుల నూహించుటలో చారిత్రకాంశములను వ్యక్త పరచుచున్న పద్యమిది.

అధిరూఢ కుండినేశాత్మజమ్మయిన స్యం
దన గరుత్మన్మండిత ధ్వజమ్ము
గజపతి ప్రౌఢోగ్ర కరిఘటా శుండావి
ధూతాంబు నిచయ బిందూత్కరంబు
రెడ్ల కీర్తి పతాక, శ్రీనాథ కవి కావ్య
దూత హంసాధి నాథుని గరుత్తు
అలకనవా పాత్రునంటి రాజిన కృష్ణ
రాయ బాహోగ్ర జాగ్రన్మహోగ్ని

ఒకటొకటి గాగ స్మృతి తెచ్చు చున్నవన్ని
చిరుతలీ పొగ మబ్బులు చిందులాడి
కొండవీటి ప్రాగ్గోట పైకొమ్మలందు
నవ్య వర్షేందిరా ధురంధర నిరూఢి

దమయంతి అధిరోహించిన రథముపై నెగురు ధ్వజము-అని గాని రుక్మిణి యెక్కిన రథముపై నెగురు ధ్వజము-అని గాని చెప్పు కొన వచ్చును. కొండవీటికి పూర్వనామము కుండిన నగర మనియు, విదర్భకు రాజధాని అనియు నున్న జన శ్రుతిని బట్టి అట్లని యుండ వచ్చు కవిగారు. దమయంతి, రుక్మిణి-వీరిరువురు కుండిన నగరము

వారే కదా! ముఖ్యముగా నిక్కడ 'అధిరూఢ' అను మాటతో ప్రారం భించుటచే కృష్ణుడు తన రథముపై రుక్మిణిని తీసికొని పోవు కథను తలపింప జేయు చున్నదని నా అభిప్రాయము. గజపతుల యేనుగులు చిమ్ము నీటి తుంపురులు-దీనిచే గజపతుల గజ సైన్య సమృద్ధి వ్యక్తమగుచున్నది. కొండవీడును గజపతులు కొద్ది కాలము పరిపాలించిరి. శ్రీనాథ కవి కావ్యదూత హంసాది నాథుని గరుత్తు-నైషధము-మామిడి సింగనామాత్యుని కంకిత మీయబడినది. అందు గల నాయికానాయకులకు రాయబారము నడిపిన హంస రెక్కలు, కసవాపాత్రుని జయించిన కృష్ణదేవరాయల కోపాగ్ని ధూమము-కలిసి పోయినట్లుగా పొగ మబ్బులున్నవి.

విశ్వనాథవారు పునర్జన్మ సిద్ధాంతముపై ప్రబలమైన నమ్మకము గల వ్యక్తి. మనిషి చనిపోయిన తరువాత కోరికలు తీరని వారి ప్రేతాత్మలు ఆయా ప్రాంతము లందు తిరుగు చుండు ననియు, కోరికలు తీరిన తరువాత వాటి స్థానమును చేరుకొను ననియు ఆ సిద్ధాంత కర్తల విశ్వాసము. వీటిపై విపరీతమైన నమ్మక మున్న విశ్వనాథవారికి అచ్చట వారి ప్రేతాత్మల రూపముగా పొగ మబ్బులు కనిపించిన వట.

ఇవి రెడ్డి రాజుల యెదలలో బూరించు
కోరాని కోర్కెలు గుమ:లు కట్టి
ఇవి తెన్గు బంటుల యిందు పగింజత్తై
నాత్మలు వీడలేకరుగు దెంచి
ఇవియు శ్రీనాథుని యెరప్రగడ కావ్య
తకు రాని భావముల్ తరకగట్టి
అవని విప్పియసెట్టి నవరత్న రాశిగా
మలచిన ప్రాణముల్ మగిడి వచ్చి

కొండవీటి పొలాల్ వీడికోనులేక
ఆశబలమున మగుడు ప్రేతాత్మల వలె
సొరిది నీగిరి కొమ్మల జుట్టు పట్టి
నిట్టి పొగ మబ్బులై భ్రమియించు గాక

రెడ్డి రాజుల హృదయములలో మిగిలి పోయిన కోరికలు, ఆశ వీడని తెలుగు యోధుల యాత్మలు, రెడ్డి రాజుల పోషణ కవులైన ఎర్రన్న, శ్రీనాథుల కవిత్వము లందింకను చెప్పవలసిన భావములు, అవచి తిప్పయ్య సెట్టి రత్న రాశిగా మెలచిన ప్రాణములు కొండ వీటిని వీడిపోలేక ప్రేతాత్మల రూపమున తిరుగుచున్నట్లు పొగ మబ్బులు తారాడుచున్నవనుట విశ్వనాథవారి ఊహా వైభవమునకు పరాకాష్ఠ.

చివరగా ఆయన ప్రాణములకు కొండవీటి పొగ మబ్బులకు ఏమి సంబంధమో యని యనుచున్న పద్యమిది.

నా ప్రాణములకును నీ పొగ మబ్బుల
కేమి సంబంధమో! యేనుగాక
పొగ మబ్బునై కొండ చిగురు కోసలపైన
బురుజుల పైని గొమ్మలకు పైని
ప్రాలి పోనో మధ్య వ్రీలి పోనో నేల
రాలిపోనో గాలి తేలిపోనో
నాయూహ చక్రసుందర పరిభ్రమణమై
యీ పొగ మబ్బులనే వరించె

యెన్ని పొగ మబ్బ లెరిగి లేనేను మున్ను?
తూర్పు కనుములు విడుచు నిట్టూర్పులట్టి
విచటి యీ పొగ మబ్బులే యెదద లోని
లలితము మదీయ గీతి నేలా వెలార్చు?

కొండవీటి పొగ మబ్బులలో తాను నొక పొగ మబ్బై కొండ బురుజులపై గాలిలో తేలి పోవలెనని వాంఛించినారు. ప్రకృతిలో లీనము కావలె ననుకొనుట భావకవితా ప్రభావము. మొత్తము మీద కొండవీటి పొగ మబ్బులు విశ్వనాథ హృదయమున చిత్ర విచిత్ర భావములు వెలార్చినవి.

ఈ ఖండిక మొదట ప్రత్యేకముగా ప్రకటింపబడి తరువాత 'ఆంధ్ర ప్రశస్తి'లో చేర్చబడినది.

## లక్ష్యము :-

రెడ్డి రాజుల ప్రాభవ వైభవములు స్మరింప బడుట ద్వారా తద్వైభవమును మరల పుంజుకొనవలె ననుటతోపాటు, వారాదరించి నట్లు కవిరాజుల నాదరించ వలెనని హితోపదేశము.

---

# చంద్ర వంక యుద్ధము

## చారిత్రక నేపథ్యము :-

చంద్రవంక నది యొడ్డున జరిగిన యుద్ధము - చంద్రవంక యుద్ధము. చంద్రవంక గుంటూరు జిల్లాలో ప్రవహించు చిన్న నది. పల్నాడు తాలూకా లోని పర్వతశ్రేణి దీని జన్మ స్థానము. మాచెర్ల వద్ద అర్ధ చంద్రా కారమున ప్రవహించు చున్నది గనుక 'చంద్రవంక' అనునామము వచ్చినది. ఇది పల్నాడు తాలూకా గుండా ప్రవహించి తూమురాంకోట అనుచోట కృష్ణానదిలో కలియుచున్నది 'చంద్రవంక' ప్రవాహము పొడవు ఇరువది రెండుమైళ్ళు. దీనికి 'చంద్ర భాగ' యనునది మరియొక పేరు.

అనుగు రాజు పలనాటికి రాజు. ఇతని మంత్రి దొడ్డనాయుడు దొడ్డనాయుని కిరువురు కొడుకులు - బాదన్న, బ్రహ్మనాయుడు. బాదన్నకు పెద్దన్న అను పేరు కూడ కలదు. సంతానము లేని అనుగు

రాజు బాదన్నను పెంచు కొనెను. తరువాత నలగామ రాజాదులు పుట్టుటచే రాజ్యము బాదన్నకు దక్కలేదు. ఈతని గుర్రము పేరు కారుబొల్లడు.

అలరాజు కల్యాణము నేలిన వీరసోముని పుత్రుని కొడుకు. కొమ్మరాజు చల్లమాదేవుల పుత్రుడు. నలగాముని ఏకైక కుమార్తె యగు రత్నాల పేరమ్మకు భర్త. పెద మలిదేవుని భార్యయైన సిరాదేవి ఇతని మేనత్త. ఈ విధముగా నలగామ మలిదేవుల కిరువురకు దగ్గరి చుట్టము. ఇతడు నూరుగురు రాజులను జయించి 'రాచమల్లు' అను బిరుదమును పొందినవాడు. ఈతని గుర్రము పేరు 'నవరాల జిమ్మడు', లేక 'నవరాల గోడిగ'. అతని ఖడ్గము సూర్యభేతాళము'.

మలి దేవుడు మాచర్ల నేలుచున్న రోజులు. అలరాజు గుర్రమును మేపు 'గంగాధరుడు' ను, బాదరాజు గుర్రమును మేపు 'దాది వారి మల్లు'ను దెబ్బలాడుకొనిరి. అలరాజు గుర్రమును దాది వారి మల్లు కొట్టుట కారణముగా అది మేత మానివేసినది. గుర్రము మేతమాని వేయుటకు కారణము నలరాజు ప్రశ్నింపగా గంగాధరుడు విషయమును విన్నవించెను. అలరాజు కన్న బాదన్న గొప్పవాడగుట ఒకటి; అలరాజు గుర్రము కంటె, బాదన్న గుర్రము గొప్పదనుట రెండవది. అందుచే తన గుర్రమువచ్చు త్రోవకు నడ్డుతొలగ వలెననునది దాది వారి మల్లు భావము. అది తెలిసికొనిన అలరాజు తన గొప్పతనమును నిరూపింప దలచి పెద్దన బొమ్మను తన అశ్వపాదమునకు గట్టెను. దానిని పెద్దన్న చూచెను. ఇరువురు తమ గొప్పతనమును దేల్చ కొనుటకు కంభంపాడు మిట్టలపై యుద్ధము చేయ సాగిరి. అది తెలిసి కొనిన బ్రహ్మనాయుడు పరుగున వచ్చి వారిని విడదీసినాడు. పెద్దన్న గుర్రము మాగినది కాని అలరాజు గుర్రము ముందు కురుకు చున్నది. తన కంటెను, పెద్దన్న కంటెను అలరాజు బలశాలి యని గుర్తించిన బ్రహ్మన అతనివలన ముప్పు రాగలదని భావించినాడు. అది మనసులో

నుంచి కొని తరువాత, తరువాత బ్రహ్మన తల్లు, బ్రాహ్మణులు వెళ్ళ వలసిన రాయబారమునకు అలరాజును పంపినాడు. నాగమ్మ కుతంత్రము బ్రహ్మన్న ముందే యూహించిన వాడు.

అలరాజు పెద్దన్నల యుద్ధము, కుటిల బుద్ధితో బ్రహ్మనాయుడు అలరాజును రాయబారమునకు బంపుట - ఇవి వీరభద్రి కవి. వ్రాసిన పద్య కావ్యమునందు మాత్రమే గలవని శ్రీ డా. తంగిరాల వారి వక్కాణ. అనగా ద్విపద ప్రతుల యందు లేవను - స్పష్టము.

కథా సంగ్రహము :-

ఒక నాటి ఉదయమున చంద్రభాగా నదీ తీరమున కన్నమదాసు పట్టుకొనిన నిలువుటద్దమున బ్రహ్మనాయుడు తిరుచూర్ణము ను దిద్దుకొను చుండెను. అప్పుడద్దమునందు తళుక్కుమని మెరిసిన మెరుపును గ్రహించి దూరమున నెవ్వరో ద్వంద్వ యుద్ధము చేయు చున్నట్లున్నదనియు, తెలిసికొని రమ్మనియు కన్నమదాసును పంపించెను.

కన్నమదాసు వెళ్ళి, తిరిగివచ్చి వారు బాదన్న - అలరాజులని విన్నవించెను. బ్రహ్మనాయుడు వెనువెంటనే వారి సమీపమునకేగెను.

బాదన్న తన అశ్వమగు 'కారు బొల్లని' పైని, అలరాజు తన గుర్రమగు సవరాల గోడిగపైని అధిరోహించి క్రోధోద్రేకులై యుండిరి. వారి గుర్రములు నురగలు గ్రక్కుచు కయ్యమునకు కాలు దువ్వుచు ముందు కురుకుచున్నవి. బ్రహ్మన మధ్యలో నిలిచి కుడి చేతితో బాదన్న గుర్రమును, ఎడమ చేతితో అలరాజు గుర్రమును ఆపుటకు ప్రయత్నించెను. కారుబొల్లడు వెనుకకు తగ్గెను కాని సవరాల గోడిగ మాత్రము బ్రహ్మనాయని లక్ష్య పెట్టలేదు.

బ్రహ్మన అలరాజును 'అల్లుడా' యని పిలిచి 'ఆగ రాదయ్యా'

అనినాడు. 'బలి యొసంగక నాకత్తి యొరవీడి మరలిపోదు' అని అలరాజు పలుకగా 'అంత కసటేల' యని బ్రహ్మన ప్రశ్నించెను. అప్పుడలరాజు యిట్లు చెప్పెను.

మామా! యిది నెల నాళ్ళ మాట. లింగ ధానకుడు, గంగ ధానకుడు ఈ రెండు గుర్రములను చంద్రవంకరేవులో నీరు త్రాగించుటకు తీసికొని వచ్చిరి. ముందు నా గుర్రము, నా గుర్రము నీరు త్రాగవలెనని పంతాలకు బోయి కొరడాలు విసరుకొనిరి. అప్పుడు బాదన్న గారి అశ్వపాలకుని కొరడా దెబ్బ సవరాల గోడిగ కనుగ్రుడ్డు తాకినది. నాటి నుండి నీరు త్రాగదు; మేత మేయదు; కన్నుల నుండి నీరు గార్చును. అవమానముతో కృశించినది.

అది గమనించిన నేను బాదన్న బొమ్మను చెక్కి దాని పాద మంజీరమునకు బిగించితిని. దానితో కసిదీరి తిండి తినినది. తరువాత గోడిగ నలంకరించి రాజ సభకు తీసికొని పోయితిని. అక్కడ గోడిగ పాదమునకున్న తన బొమ్మను బాదన్న చూచి దానిని తీయుమని బట్టు ద్వారా కబురు పంపెను. నాతో యుద్ధమునకు రాజాల నన్నచో తీసెదనని సమాధానించితిని. బాదన్న చంద్ర వంక పచ్చ గడ్డలపై నేటి యుదయము యుద్ధము నిర్ణయించి వెళ్ళెను. ముందుగా వచ్చినదతడు. సవరాల గోడిగ బొమ్మకాలు ముందుకు చాచుచున్నది. నా కత్తి బలిలేక మరలిపోదు.

ఆ మాటలు విన్న బ్రహ్మనాయుడు ఆలోచనలో మునిగినాడు. కొంతసేపటికి కన్నమదాసుని పిలిచి, అతనిచే అరటి దవ్వలను తెప్పించి, అందొక దానికి తనపేరు పెట్టి వీనిని బలివేయుమని అలరాజుతో ననెను పెద్దవారుండ నేముందు వేయనని అలరాజనగా బ్రహ్మన్న యాజ్ఞపై బాదన్న బ్రహ్మనాయని పేరిటిది దక్క నన్నింటిని తెగనరికెను. అప్పుడు అలరాజు చటుక్కున సూర్యఖేతాలము దూసి దవ్వ సహస్రములగు నట్లుగా విసరి వైచెను. కత్తి పిడిదాక

భూమిలో దిగబడినది.

అప్పుడు దిగబడిన కత్తిని తీసియిమ్మని బ్రహ్మనాయని నడిగినాడు. రాచవారి కత్తులు రాచవారికే గాని మాకు ననువు పడవని బ్రహ్మనాయుడుల్లస మాడెను. అలరాజు వెంటనే ఉద్రేకముతో నొక్కయుదుటున పిడి నెడమ కాలితో పట్టి లాగినాడు. ఆ వేగమునకు నేల గడ్డ పెళ్ళ పెళ్ళలుగా విరిగి ఒక చిన్న మట్టిపెళ్ళ బ్రహ్మనాయని నొసటకు వచ్చి తగిలినది.

పిమ్మట ముప్వురును మారు మాటాడక ఎవరి తోవను వారు పోయిరి. చంద్రభాగపై దూరముగా ఒక్క నీల మేఘము నల్లత్రాచు వలె లేచి అలరాజు ప్రాణముల ననుసరించినది.

ఇది విశ్వనాథవారు వర్ణించిన బాదన్న - అలరాజులకు సంబంధించిన యుద్ధ క్రమము.

## చరిత్ర - కావ్యముల సమన్వయము :-

విశ్వనాథవారి కావ్యకథకు ముదిగొండ వీరభద్ర కవి రచించిన "వీర భాగవతము" (పద్య కావ్యము)లోని కథయే మూలము. ఈ రెండింటికిని పెద్దభేదము లేదు. అశ్వపాలకుల పేర్లు మాత్రమే విభేదించినవి. వీర భాగవతము ప్రకారము - అలరాజు అశ్వపాలకుని పేరు గంగాధరుడు, బాదరాజు అశ్వపాలకుని పేరు దాదివారి మల్లు. ప్రస్తుత కావ్య ప్రకారము-అలరాజు అశ్వపాలకుడు గంగధానకుడు; బాదరాజు-అశ్వపాలకుడు లింగ ధానకుడు. కథలో చెప్పదగినంత మార్పులు లేవు; కొన్ని కల్పనలు తప్ప.

## కావ్యశిల్పము :-

విశ్వనాథవారు కథనెత్తుకొనుటలోనే తమ ప్రజ్ఞను చూపినారు.

కథ మూలమున అశ్వపాలకుల కలహముతో ప్రారంభమైనది.

కవి సమార్థులు కథ మధ్యలో నెత్తుకొనిరి. బ్రహ్మనాయడు చంద్రభాగా నదీ తీరమున నిలువుటద్దమున తిరువంటి తిరుచూర్ణము దిద్దు కొనుటతో ప్రారంభమైనది. పాఠకుని కెక్కడనూపిరి సలుపనీయక పోవుట కథా శిల్పము. ఆ శిల్పమున అందెవేసిన చేయి విశ్వనాథ. కనుకనే పాఠకుని కుత్సుకత రేకెత్తించుటకై ఇట్లు ప్రారంభించిరి.

బ్రహ్మనాయడు చంద్రభాగా సరిత్తీర్థ
మందు ప్రాతస్నాన మాచరించి
బాల సూర్యోదయము ప్రభలు గోదుమవన్నె
పసితాంచు కానల పగిది లేత
పిల్ల తెమ్మెరల కంపిల్లు చిన్నారి పిల్ల
యలల జరుగిన జారులాడుచుండ
నిలువు టద్దమ్ము లోపల దిరు పండి దిరు
చూర్ణమ్ము దిద్ద నిల్చున్న వేళ

శారదా కాశమున రెండు సాగి క్రింద
నమ్ము మెరపుల సంఘర్షణమ్మువోలె
నిలువు టద్దాన ధగ దగై నిగ నిగైని
మేష పరి కల్పితోద్దీప్తి మెరపు కలిగె

బాల సూర్యోదయ ప్రభలు - గోదుమ వన్నె ప్రసితాంచు కానల పగిది లేత పిల్ల తెమ్మెరలచే కంపిల్లు నట్టివి - చిన్న విషయమునకే పట్టుదలగా పోయిన అశ్వపాలకులను సూచించు చున్న ఉపమానమిది. 'లేత పిల్ల తెమ్మెరలచే' అనునది 'అశ్వపాలకుల' కురతనపు చేష్టలను వ్యంజించుచున్నది. ఆ కురత తనపుచేష్టలే అలరాజు-బాదన్నల యుద్ధమునకు మూల కారణములైనవి. ఆ విషయమును సూచించుటకే ఈ యుపమానము.

శరత్కాలాకాశమున ననగా నిర్మలమైన చో :- మెరుపుల

సంఘర్షణమ్ము వోలె – మెరుపు క్షణికమైనది. అలరాజు – బాదన్నలకు అంతకుముందు విరోధము లేదు. వీరు చేసిన యుద్ధము కూడ క్షణ కాలమే.

బ్రహ్మనాయడు తన ముందున్న అద్దమునందు ప్రతి ఫలించిన మెరుపులను బట్టి ఎవరో చంద్ర భాగపై తట్టున యుద్ధము చేయుచున్నారని కన్నమ దాసును చూచి రమ్మని పంపించినాడు. కన్నమదాసు వెళ్ళివచ్చిన వేగమును సూచించిన పద్యమిది.

పరుగుల బోయి నాడతడు పర్వుల వెంబడి వచ్చినాడు "క్రొ
న్నురుసుల గ్రక్కు గుఱ్ఱముల నూకెద రడ్డము బాద నాయడున్
బోరి నలరాజు" నంచు తన పొంగిన చట్టలు పట్టుచున్ గనుల్
గిర గిర త్రిప్పుకొంచు బలికెన్ త్వర యాకృతి పొందెనోయనన్

ఇందు కన్నమదాసు వేగమును మనసుననే గాక కన్నులకు కూడ కట్టినట్లు వర్ణించినారు.

కన్నమదాసెంత పరుగున బోయినాడో అంత పరుగున వచ్చినాడు. ఆ విషయమును జెప్పుటకు.

"పరుగుల బోయినాడతడు పర్వుల వెంబడి వచ్చినాడు" అనినారు. కనుకనే చట్టలు పొంగినవి. వాటిని బట్టుకొంచు, కనులు గిర గిర త్రిప్పుచు పలుకుట – తాను వెళ్ళివచ్చిన వేగమును, అక్కడ జరుగుచున్న సంఘటనను వ్యక్తీకరించుటకు.

కన్నమదాసు మాటలు విని బ్రహ్మనాయ డొక్కటే పరుగుగా జని అలరాజు – బాదన్నల అశ్వముల నాపిన తీరును చేయి తిరిగిన చిత్రకారుడెవరైన చక్కని చిత్రమును గీయవచ్చును.

రెండు గుఱ్ఱముల మధ్య నిలిచిన బ్రహ్మనాయుడు

కాదు బొల్లని ముఖాగ్రమ్మున హేమకం
కణ రమ్య దక్షిణ కరముసాచి
సవరాల గోడిగ నవ ఘంటి కాలగ్న
గళ సీమపై సవ్యకరము నుంచి
బ్రహనాయుడు వారి బవరము సాలింపు
డని మాటపెట్టె, నంతన తనంత
గారు బొల్లడును వెన్కకు దగ్గె, సవరాల
గోడిగ యతని మూటాడ దోచె

బ్రహ్మనాయని లోపలి భావ గర్భ
మందు నేమూలనో తెలియంగ బడక
లోన గలగెనో పొరగాలి లేని సరసి
సరసి జము లట్లు స్తిమిత లోచనము లొప్ప

ఆరోహకులతో ఒక దాని కొకటి ఎదురుగా నిలిచియున్న గుర్రములు. వాటి మధ్య బ్రహ్మనాయడు - హేమ కంకణమున్న కుడి చేతిని ఒక దానిపైన, ఎడమ చేతిని మరియొక దాని నవ ఘంటికా లగ్న గళ సీమపైన నుంచి నిలబడినాడు. అదీ చిత్రము.

కాదు బొల్లడు వెన్కకు తగ్గినది కాని సవరాల గోడిగ మాత్రము అతని మూటాడ దోచినది. బ్రహ్మనాయుడే మూలనో లోపల కలగి నాడు. ఈ కలగిన పరిభావము భవిష్యత్కథపై నున్నది. అనగా అలరాజు మరణమునకు ఈ కలగుట రేఖా మాత్ర సూచకము. మన సులో కలగినను పొరగాలి లేని సరసి సరసి జము లట్లున్న స్తిమిత మైన కన్నులు - అనగా అతని కన్నులలో ఏ విధమైన మార్పులేదు - ఆ కలగుట బైటకు పొక్కలేదని భావము.

తరువాత

"అల్లుడా! ఆగ రాదయ్య" అనియెనతడు,

"మామ! నా కత్తి యొరవీడి మరలి పోదు
బలి యెరుంగక" యని రాచవాడు పలుక,
"నంత కసటేల"యనుచు నాయడు వచించె.

అప్పుడలరాజు సవరాల గోడిగ కళ్ళెము నాచిబట్టి దెబ్బలాటకు మూలమును వరుసగా జెప్పె.

కాగ బొల్లనిమెయి నలంకార మరయు
చూడు సవరాల గోడిగ కూడ బొమ్మ
కాలు ముందుకు జాచెడు గర్వరేఖ,
మామ! నా కత్తిబలిలేక మరలిపోదు.' అని ముగించినాడు.

మన మిట "మామ! నా కత్తి యొరవీడి మరలిపోదు"

"మామ! నా కత్తి బలిలేక మరలిపోదు." అను వాక్యములు గుర్తుంచు కొన వలసి యున్నది.

అలరాజు సూర్యభేతాళమును బయటకు దీసినచో దానిని ప్రయోగింప వలసినదే. తిరిగి వ్యర్థముగా ఒరలోపల బెట్టుటుండదు. ఇట్టిది శూర వరేణ్యుల పరమ నియమము. శిక్కులలోను, ఘూర్కాల లోను ఇట్టి నియమమున్నదని తజ్ఞుల మాట. శూరుల శూరత్వ మంత యు వారు ధరించు నాయుధములపైన, ఆరోహించు గుర్రములపై నాధారపడి యుండును. కనుక వాటిపై శూరుల కంత గౌరవము.

అలరాజు పట్టుదలకు బ్రహ్మనాయ డరటి దవ్వలు కన్నమ దానుచే తెప్పించి, వరుసగాపాతి, అందొక దానికి తనపేరుపెట్టి బలి వేయు మనినాడు. పెద్ద వారుండగా ముందు వేయునని పట్టుదలలో కూడ గౌరవము నెరపినా డలరాజు.

మూలమున అలరాజు ఖడ్గమున కాహారముగా నున్నపోతులు మొదలగునవి బలి యిచ్చినట్లు గలదు.

బ్రహ్మనాయడు బాదన్నను వేయు మనినాడు.

బ్రహ్మనాయని పేరిటి బద్ద దక్క
నరటి దవ్వల నన్నింటి దరిగి పోసె
బాదనాయని కత్తి విస్ఫారధార
రాచమల్లునేత్రాంతముల్ ప్రజ్వరిల్లె

బ్రహ్మనాయని పేరిటిది కాబట్టి ఆ ఒక్కటి మిగిలినది. అల రాజునకు దానిని వేయక తప్పలేదు.

కాళము మామ పేరిటిది కాక యికొక్కడు దవ్వయుండగా
దాళడు బాదనాయ, డిక తగ్గుట యేలని యాననాగ్రరే
ఖాళిని గంటుపెట్టుకొని యంత చటుక్కున దూసి సూర్యభే
తాళము రివ్వునన్ విసరె దవ్వ సహస్రము తౌచు వ్రీలగా

వేయక పోయిన వ్రత భంగము; వేయుటకు పూనుకొన్నచో మామ పేరిటిది. అతడు కాళము - పాము. అని మొదట సంశయించినాడు. చివరకు తగ్గుట యేలని అలరాజు దానిని తెగవేసినాడు.

ఇట్టి సంఘటన కల్పించుటకు కవి కథాకథన శిల్ప పారీణుడై యుండవలెను. బ్రహ్మన్న పేరిటిది తెగవేయుట అతని కవమానమే.

అలరాజు బ్రహ్మనాయని పేరిటి దవ్వను తెగవేయగా అప్పటి వారి ముగ్గురి పరిస్థితి

సూర్యభేతాళమ్ము క్షోణిలో పిడిదాక
దిగబడె, బాదన్న మొగము చివర
యెర్రనై పండిన యెరుపురేకలు తీర్చె
బ్రహ్మనాయడు మోము వాల్చుకొనియె
తనలోని కదలిక తాళుకొన్నాడు నా
యడు, రాచమల్లు బ్రహ్మన్న జూచి

"మామ! భేతాళమ్ము మహిలోన దిగబడె
కొంచెము తీసి పెట్టంచు నడిగె

బ్రహ్మనాయుడు "నౌనయ్య రాచవారి
కత్తులవి రాచవారికే గాని మాకు
ననువు పడ" వన్న, నలరాజు హయము పరపి
పిడి యెడమ కాల జర్రున వ్రీల లాగె

పూర్వ మలరాజు గుర్రము సవరాల గోడిగ ఊటాడ ద్రోచి నప్పుడు లోన గలగినాడు. ఇప్పుడు తన పేరిటి దవ్వాను నరికి వేయగా స్వీయాంత రంగములోని కదలికకు తాళు కొన్నాడు. కత్తి తీసి పెట్టుమను నలరాజుతో 'రాచవారి కత్తులు మాకనువు పడవ'ని ఉల్లసమాడినాడు. ఇచ్చట అంతరంగము లోని కదలిక వాక్కులోనికి వచ్చినది. దానికి తోడు సూర్యభేతాళమును అలరాజు నేలలో నుండి లాగు నప్పుడు చిరు మట్టి పెళ్ళ వచ్చి నాయునికి తాకినది. అదియే అలరాజు ప్రాణములను భుజగము ఎలె అనుసరించినది.

ఎవ్వరి త్రోవ వారు చనిరెవ్వరు నెవ్వరి వంక జూడ లే
దెవ్వరు నెవ్వరిం బలుకరించను లేదల చంద్ర భాగపై
దవ్వుల నొక్క నీల జలదంబు వినీల భుజంగి కైవడిన్
రివ్వున లేచి తానను సరించెను బో అలరాజు ప్రాణముల్

బాల సూర్యోదయ ప్రభలు గోదుమ వన్నె పసిత్రాచు కానల పగిది యని ప్రారంభమునందే పాము ప్రస్తావన పోలిక రూపమున తేబడినది. మధ్యలో 'తాళము మామ'యని అలరాజే భావించినాడు. చిట్ట చివర నీలజలదంబు వినీల భుజంగి కైవడి అలరాజు ప్రాణముల ననుసరింప జేసినారు విశ్వనాథవారు.

ఇచ్చట కవిగారు వ్యంగ్యము నాశ్రయించినారు. బ్రహ్మనాయుడు కోపించి అలరాజు చావునకు ఉత్తరోత్తర కారకు డయ్యె

నను సంగతి చెప్పలేదు; కాని అతని మనసులో ఈ ద్వేష మున్నది. కనుకనే అలరాజు తల్లియైన చెల్లమాదేవి తన కుమారుని నలగామరాజు వద్దకు రాయబారము పంపు నప్పుడు పాత పగలేమైన మనసున బెట్టు కొంటి వాయని బ్రహ్మనాయని ప్రశ్నించినది.

వీర భద్ర కవి రచన ప్రకారము - అలరాజు మృతికి బ్రహ్మనాయడు పరోక్ష కారకుడు. దాని ననుసరించిన విశ్వనాథ వారి దృష్టిలో కూడ బ్రహ్మనాయడే సూత్రధారి. అనగా అలరాజు ప్రాణములు పోగొట్టుకొనుటలో బ్రహ్మన్న పాత్ర ఉన్నదను విషయమును ధ్వని పూర్వకముగా జెప్పినారు.

ఈ విషయమును బ్రహ్మన్న ప్రతి కదలిక లోను విశ్వనాథ వారు ధ్వనింప జేసినారు.

ముఖ్యముగా ఆది మధ్యాంతములంతయు భుజంగ ప్రస్తావన ధ్వనిలోని భాగములే.

లక్ష్యము :-

అశ్వములకు గూడ పౌరుష మొగ్గడింపబడుట అట్టిది నేటి మన తెలుగు వారికి లేకపోవుట సిగ్గు చేటని విశ్వనాథవారి ఎత్తిపొడుపు.

## యమ దంష్ట్రిక

చారిత్రక నేపథ్యము :-

విజయనగర చక్రవర్తులలో కన్నాకు వంటి వాడు - అళియ రామ రాయలు. 'అళియ' అనగా కన్నడమున 'అల్లుడు' అని అర్థము. శ్రీకృష్ణ దేవరాయల పుత్రికయైన 'తిరుమలాంబిక'ను వివాహ మాడుట కారణముగా రామ రాయలు అళియ రామరాయలుగా ప్రసిద్ధి కెక్కినాడు. ఇతడు నరపతి వంశజుడు. ఈ వంశీయులు. ఆరవీడు

మండలాధిపతులయిన తరువాత 'అరవీటి' వారయిరి.

రాజనీతికోవిదుడైన అళియ రామరాయలు కళ్యాణి దుర్గ మును జయించునప్పుడు కేళాది పురనాయకుడైన కెళది సదాశివ నాయకుడు ప్రధాన పాత్ర వహించెనని కెళది నృప విజయమను కన్నడ చరిత్ర గ్రంథము చెప్పుచున్నది.

కథా సంగ్రహము :-

కళ్యాణి దుర్గమును వశపరచుకొనుటకు అళియ రామ రాయలు నెలరోజుల నుండి విశ్వప్రయత్న మొనర్చు చుండెను. రాజు, మంత్రులు, దండనాథులేమి చేయుటకును పాలుపోక సభలో రక్తాక్షులై యుండిరి. ఆనాడు శుక్లాష్టమి. వెన్నెల అంతట నిండి యున్నది. అందుచే చంద్రకాంత శిలా పీఠమెక్కిన ప్రభువు శరీ రము చల్లబడినది. అంతలో రాయలు పీఠము నుండి లేచి దుర్గము దరికి నడక సాగించినాడు. సైన్యాధిపతులు రాజు ముఖము వంక చూచుచు ప్రక్కను నడువసాగిరి. రాయల సైన్యములు కోట ముట్టడి ఆపకుండగా ఏ బురుజుమూలకో నిచ్చెనలు వేయుచునే యున్నవి. లోపలి వారు శిలలచే మొత్తుచునే యుండిరి. రాయ లక్కడకు చేరి దుర్గ పార్శ్వభాగములను పరిశీలించి చూచెను. దుర్భేద్యమైన కోటను జూచి యే మార్గము కానరాక తనయొరనుండి కరవాలమును లాగి కోట లోపలకు విసిరి వేసెను. ఆ ఖడ్గము వెన్నెలలో గరుత్మంతు డెత్తుకొనిపోవు సర్పమువలె ప్రకాశించినది. సైనికులు నివ్వెరపోయిరి. దండనాథులు చిత్ర ప్రతిమలైరి. కోట లోపల సైనికులు త్రాచువలె నేదో వచ్చి పడినందులకు, తెలుగు సైనికులు ముట్టడిమాని నిల్చి నందులకు కారణ మెరుగనివారై కలతపడిరి. తన నేత్రములపై దృష్టి సారించి, నిలిచిన దండనాథులతో రాయలిట్లనినాడు.

అది యమదంష్ట్రిక. శత్రువుల కోటలో పడినది. మన జయ

ధము శతృవుల కోటలో నుండగా ఊరకుండుటా! విద్యారణ్యస్వామి బుక్కరాజున కిచ్చిన ఖడ్గమును మీలో సాహసులైన వారు ప్రతాపము చూపి, శతృవులను చీల్చి చెండాడి తీసికొని రావలెను. ఆ మాటలకు సైన్యాధిపు లందరు ఆశ్చర్యపడి ఆలోచనలో మునిగిపోయిరి. సదాశివ నాయకుడు ముందుకువచ్చి రాజునకు నమస్కరించి 'మీ యాజ్ఞయైనచో కళ్యాణ దుర్గ మెంతని యనెను. అంతట మందహాసముతో రామరాయులు బిజాపురమును జయించిన సదాశివ నాయకుని పరాక్రమమును ప్రశంసించెను. సదాశివ నాయకుడు రాజు ప్రక్కకు చేంగా తక్కిన సేనాధిపతులు గుడారముల చెంతకేగిరి. రాత్రి యగుటచే శతృ సైనికులు కోట గోడలపై తిరుగుట మానిరి. అష్టమి చంద్రుడు ఉస్తమించెను. చీకటులు వ్యాపింపగా కోట కావలావారు శతృవుల జాడలు తెలిసికొనుటకై సంధ్య మధ్యలో కాగాడాలు వెలిగించుచు నార్పుచుండిరి, కాగడా లారుటతో మరింత చీకటి క్రమ్మినది. కోట ద్వారము వద్దకు చేరిన ఏనుగులు చీకటిలో కలిసి పోయినవి. ఆ యేనుగులు వరుసగా ఢీకొనగా కోట తలుపులు ఛిద్రమైనవి. కోటలోని వారు ఆయుధములు వెదకికొని వచ్చులోపలే సదాశివ నాయకుని సైనికులు బురుజులపై కెగబ్రాకి భటుల శిరస్సులను తెగనరికిరి. ఇంతలో తెల్లవారినది.

సభ తీర్చిన రామరాయలకు 'యుద్ధ దంష్ట్రిక'ను తెచ్చి సదాశివ నాయకుడిచ్చెను. బొంకితో స్వర్గమును చేగుట్టుగా రాజు సంతసించెను. సదాశివ నాయకుని కౌగిలించికొని 'కోటి కోలాహల రాయ నాయక' అను బిరుదముతో నతనిని సత్కరించెను.

కేళాది పుర ప్రభువైన సదాశివ నాయకుని గుడారము నందు రాయనాయక, కోటి కోలాహల మొదలగు బిరుద నామములే మాగధ ధ్వానములుగా మారు మ్రోగినవి.

చరిత్ర - కావ్యముల సమన్వయము :-

'యమ దంష్ట్రిక' అనగా యముని నోటి కోర. శత్రువులకు మృత్యు ముఖము వంటిదనీ భావము. అళియ రామరాయల ఖడ్గము పేరు. కళ్యాణీ దుర్గమును 'నిజామ్ శాహు' నుండి రాయలు స్వాధీన పర్చుకొనుటలో సదాశివ నాయకుడు ప్రధాన పాత్ర వహించె ననునది చరిత్ర. దాని నాధారము చేసికొని విశ్వనాథవారు దీనిని రచించిరి.

కావ్య శిల్పము :-

ఇది అళియ రామరాయల ఉత్సాహ శక్తికి ప్రబల నిదర్శనము. దుర్గము స్వాధీనము కానందున సైన్యాధిపతులందరు చూచుచుండగా రాయలు రాజ వంశపరంపరగా వచ్చుచున్న 'యమ దంష్ట్రిక' ను కోటలోనికి గిరవేయుట జరిగినది. పారంపర్యముగా వచ్చు విశిష్టమైన ఏవస్తువైన ఇతరుల అధీనములో నుండుట ఆ వస్తువు గల వారికి తల కొట్టి వేసినట్లే. ఇచ్చట అట్టి 'యమ దంష్ట్రిక'ను స్వాధీన పరచుకొనవలె నంటే కోటను వశపరచు కొనవలెను. పూర్వము కంటె ఇప్పుడు బాధ్యత పెరిగినది. ఆ ఖడ్గమును తేగలిగిన వారెవరని సేనా నాయకులకు రాయలు సవాలు విసిరినాడు. ఈ సవాలు విసరడమే రాయలుపయోగించిన ఉత్సాహశక్తి. సదాశివ నాయకుడు ఖడ్గమును తెచ్చుటకు పూనుకొనినాడు. ఆ పనిని నెరవేర్చినాడు. కోట స్వాధీనమున సైనికులకు బాధ్యతను పెంచుటలో 'ఖడ్గము' ప్రధాన పాత్ర వహించుటచే ఈ ఖండికకు 'యమ దంష్ట్రిక' అను పేరు సార్థకమైనది.

వస్తువును పరిచయము చేయు నెత్తుగడలోనే పాఠకుని ముందొక సమస్యనుంచి తత్పర్యవసానమునకై ఆలోచింప జేయు నుత్సుకతను కలుగజేయుదురు విశ్వనాథవారు. కథ యెట్టిది గ్రహింప వలెను; ఎక్కడనుండి ప్రారంభింపవలెను; ఎట్లు నడిపింపవలెనను

విషయము వారికి తెలిసి నంతగా మరొకరికి తెలియదేమో!

ఒక గొప్ప యెత్తుతో నున్న యెత్తుగడ ఇది.

నెల నాళ్ళైనది కోటపట్టు బడలేనేలేదు కళ్యాణీ, రా
యలకున్ సిగ్గయి పోయెబో తెలుగు సైన్యంబుల్ వృథాక్రోధవ
హ్నులతో మండెడు నారెడున్ బతియు మంత్రుల్ దండనాథుల్ విని
శ్చల దీప్తాస్యులు పాలుపోక సభలో పారింతుర్ రక్తాక్షముల్

అసలీ పద్య మెత్తుగడ తెలుగు దన ముట్టిపడు వాక్య విన్యాసముతో ప్రారంభమైనది.

'నెల నాళ్ళైనది కోట పట్టుబడ లేనేలేదు'

'రోజై పోయినది పని కానేలేదు' అని సాధారణముగా వాడుచున్న పలుకుబడి పద్యములో చోటు చేసికొన్నది. వాడుకలో నున్న వాక్య విన్యాసమును దాని పదును చెడిపోకుండగా పద్యములో ఎంత సహజముగా పొదగ గలిగితే కవి యొక్క నేరు పంత గొప్పదని మనము భావించవచ్చు. పద్యమంత నొగసుగా ఉంటుంది.

అది అట్లు ఉండగా అళియ రామరాయలు నెలరోజుల నుండి కళ్యాణి దుర్గమును వశపరచు కొనుటకు ప్రయత్నించు చుండె ననియు, సాధ్యము కాలేదనియు; కాకపోవుట తలవంపులుగా నున్న దనియు. సైనికు లెంత క్రోధావేశముతో ప్రయత్నించి నప్పటికి వృథా అయిపోవు చున్న దనియు, మంత్రులు దండనాథులు నేమి చేయుటకును పాలుపోక ఎరుపెక్కిన కళ్ళతో చూచు చున్నారనియు ననుటచే కథా సందర్భమును చెప్పుటతో పాటు; దుర్గమును వశ పరచుకొనుటకు మంత్రులు, దండనాథులు తరువాత ఏమి చేసిరను నుత్సుకత పాఠకునిలో కలిగించుచున్నది.

సభలో నున్న రామరాయలు

చూచిన చూపుతిప్పకయ చూచుచు గద్దియి నుండి మెల్లగా
లేచి మదద్విప ప్రణుత లీల నరేంద్రుడు పోవజొచ్చె నా
త్మోచితవృత్తి సైన్యపతు లొక్కరు నొక్కరు రాజు పార్శ్వభూ
మీ చరుతౌచుమెల్లన గమించిరి తన్ముఖ లగ్న దృష్టులై

రామరాయలు హఠాత్తుగా సింహాసనము నుండి లేచి మెల్లగా మదించిన ఏనుగువలె ముందుకు పొగినాడు. సైన్యాధి పతులు తమకు తగినట్లు రాజు ననుసరించిరి. ఆ అనుసరించు నప్పుడు వారు తన్ముఖ లగ్న దృష్టులైరి.

ఈ పద్యమునందే అనగా రామరాయల గమనమునందే భవిష్యత్కథయైన కోట స్వాధీన మార్గమును విశ్వనాథవారు పొందు పరిచినారు.

మెల్లగా, మదద్విపద ప్రణుతలీల, తన్ముఖ లగ్నదృష్టులై అను పదము లిచట భవిష్యత్కథా సూచకములు.

బాగుగా చీకటి క్రమ్ముకొనగా చప్పుడు చేయకుండగా కోట ద్వారము వద్దకు చేరిన ఏనుగులు కోట తలుపులను బ్రద్దలు చేయుట ద్వారా కళ్యాణి దుర్గమును సదాశివ నాయకుడు వశము చేసికొనుట జరిగినది.

ఈ విషయ మంతయు రామరాజు గమనంబున గమనింప వచ్చును.

సడీ చప్పుడు లేకుండగా మదించిన ఏనుగులు, ఇచట తత్ అనగా కోట యనుకొనునప్పుడు కోట ముఖము – ద్వారము గాన – ద్వారమువద్దకు చేరుటను సూచించుట వర్ణనావైదగ్ధ్య మనకతప్పదు.

కోటలోనికి 'యమదంష్ట్రిక'ను రామరాయలు విసరి వేయు నప్పుడు దాని స్వరూపమును వెన్నెలలో మనకు జూపించినారు.

తెలితేవెన్నెల చాలులో తళ తళ్లై దీపించు వజ్రాల ప
చ్చల నీలాల హారంగు వన్నెల సరుల్ చాయల్ తలారింపుల్లై
తొలి కొక్కార్కరు మెరుంగు లట్టులయి యెంతో వైనతే యాహృతో
జ్జ్వల దివ్యాహి వలెన్ వెలంగె నసి రాజద్ధూమ కేత్వాకృతిన్

పచ్చలు, వజ్రాలు, నీలాలు పొదిగిన కత్తి యగుటచే యమ దంష్ట్రిక వెన్నెలలో తళుక్కున్న మెరిసినది. అప్పుడది గరుత్మంతు డెత్తుకొని పోవు దివ్యాహి వలె నున్నదట, ఇది వినూత్నమైన పోలిక. మరియు దీనిని ధూమకేతువుతో పోల్చుట – ఇంకొకటి.

విశ్వనాథవారి దృష్టిలో ధూమ కేతువు భయంకరమైనదని భావము. ఇది పరంపరగా వచ్చు భావము. అయితే నవీనుల దృష్టిలో ఈ భావము మారినది.

రామరాయల ఉత్సాహ శక్తికి నిదర్శనమైన పద్యమిది.

మీలో నెవ్వరు సాహసుల్ కదలుడీ, మీ మీ ప్రతాపాగ్ని తే
జోఽలంకారము గాగ శత్రుజన కళ్యాణంబు ఖడ్గానకు
ద్దాలించం జనుడీ, తెలుంగుముని విద్యారణ్య సన్యాసి ద
త్తాలంకారము బుక్కరాజు నసితెండా! పోయి సైన్యాధిపుల్

ఏ సందర్భమునచేచరిత్ర'ను కథాగతికి భంగము కలుగ కుండగా నెట్లు చెప్పవలెనో అను విద్యవారికి వెన్నతో బెట్టినది.

కళ్యాణి దుర్గము లోపల 'యమదంష్ట్రిక'ను పారవేసి 'అది విద్యారణ్యము నీశ్వరులు బుక్కరాయులకు ప్రసాదించినది; దానిని తీసికొని రావలసియున్న'దని సైన్యాధి పతులకు నాజ్ఞపెట్టుట రామ రాయలకే చెల్లినది. అట్లు సందర్భమును గల్పించి దాని ప్రాశస్త్య మును, చరిత్ర నుగ్గడించుట విశ్వనాథకే చెల్లినది.

క్రోధారుణ నేత్రులై యున్న సభాసదులతో ప్రారంభమైనది

ఖండిక మాగధ ధ్యానములతో ముగింపబడినది.

ఇది ఇట్లు ముగియునని ఊహించుట పాఠకుని కందనిది. కథ ప్రారంభమైనది మొదలు పరి సమాప్తియగువరకు పాఠకుని ఊహ కంద కుండగా కొనసాగించుట విశ్వనాథవారి కొక హేల.

లక్ష్యము :-

అళియ రామరాయల ఉత్సాహశక్తి తెలుగుజాతి స్వాతంత్ర్య సముపార్జనమైన కీర్తిపతాక కావలెనని కవి సమ్రాట్టుల ఆకాంక్ష.

---

# ఆంధ్ర ప్రశస్తి ప్రాశస్త్యము - అంకితాదులు

ఈ గ్రంథము వెలువడిన నాటి నుండి మొత్తముగా గాని ఇందలి ఖండికలు గాని ప్రతివత్సరము పాఠశాల మొదలు కొని విశ్వవిద్యాలయము వరకు పాఠ్యాంశములుగా నిర్ణయింప బడుటయే దీని శ్రీశస్తిని వేనోళ్ళ చాటుచున్నది. కనుకనే నేటి విద్యావంతులలో ఏదో తరగతిలో ఆంధ్ర ప్రశస్తిలోని కొన్ని పద్యములనైన చదువని వారెవ్వరు నుండరనినచో నతిశయోక్తి కాదు.

స్వాతంత్ర్య సంపాదన సముద్దేశముతో వెలువడి నప్పటికి పుబ్బలోపుట్టి మఖలో మాడుపోవునట్టిది కాదీ గ్రంథము. అనగా ఒక ప్రయోజనము కోసమవతరించి ఆ అవసరము తీరిన తర్వాత కాలము చెల్లిపోవువాటిలో చేరునది కాదు. ఇతివృత్త స్వీకరణము మొదలు కావ్యాంశములు సర్వములు సార్వకాలికములు; సార్వజనీనములు. మీదు మిక్కిలి వైవిధ్య విలసితములు. 'సంభవామి యుగే-యుగే' అన్నట్లుగా ఇందలి ప్రతి ఖండిక తెలుగువాడైన ప్రతివాడు; చదివి గతవైభవ స్మరణ ద్వారా 'పూర్వ పౌరుష మెరిగి బ్రతకాలి; కార్య శూరులు నేడు కావాలోయ్' అనిన సూక్తిని సార్థ

కము చేయవలసియున్నది. పై చెప్పిన భగవద్గీతలోని వాక్యము యుగ యుగానికి పరిమితిని విధించినది కాని ఇట్టి చైతన్యోద్దీపకమైన గ్రంథము తర తరమునకు ఆవసరమనుట నిర్వివాదాంశము.

ఏ గాథ విన్నచో మానవ హృదయము స్పందించునో, మీదు మిక్కిలి తెలుగు వాడి హృదయము వేడిని, వాడని పుంజుకొని చైతన్య వంతమగునో అట్టిగాథల నేరుకొని అవియును వైవిధ్య వైశిష్ట్యములుగా నుండునట్లు చూచుకొని ప్రతి పద సార్థక్యముగా రచించినారు విశ్వనాథవారు. ఇందలి పద్యములు రసశ్రీ హృద్యము లనుట విజ్ఞులకు విదితమే.

కనుకనే డాక్టర్ కోపల్లె శ్రీరామమూర్తి గారిట్లనినారు. 'వాక్యం రసాత్మకం కావ్యం' అన్న విశ్వనాథుని నిర్వచనం విశ్వనాథవారి విషయంలో 'ప్రతి వాక్యం రసాత్మకం' అని మనకు జ్ఞాపకంచేస్తుంది!'
విశ్వనాథ శారద. పే. 405.

యిక యిందలి ఖండికల ముఖ్య వైవిధ్య వైశిష్ట్యములను గూర్చి తెలిసి కొందము.

తొలి తెలుగు రాజైన ఆంధ్ర విష్ణువు మొదలు, అళియ రామ రాయల వరకు గల గాథలిందు చోటు చేసికొనినవి.

ఏ కథ కాకథయొక్క మొదలి చివళ్ళు జపమాల వలె మేరు పూస యందు లగింపబడి యుండునట్లు కూర్చగా - గంథాద్యంత ములు కూడ ఏకత్వమును పొంది యుండుట 'ఆంధ్రప్రశస్తి' వైశిష్ట్య కత. గ్రంథాది యందు గల తొలి పద్యము నందలి ప్రథమ పాదమిది "జో! సామీ, మము గన్న యేలిక! యిదో జోహారు జోహారు!" గ్రంథాంతమున గల తుది పద్యము నందలి చివర పాద మిది "కైకో సామి! పరాకటంచు పతిరాగా మాగధ ధ్యానముల్" గ్రంథాద్యంత పద్యములు రెండును స్తుతిరూపము లగుట గమనింప

దగినది. స్తుతికి పాత్రములైన వారిర్వురును రాజులే.

ప్రారంభమున యుద్ధోన్ముఖు డగుటకు రాజు స్తుతింపబడి నాడు. అంతమున యుద్ధ విజేతయైన రాజు స్తుతింపబడి నాడు.

ఇట్లు కావ్యమందలి ఉపక్రమము, ఉపసంహారము - ఏక సూత్రమున బంధింప బడియుండుట గ్రంథ విషయైక్యమును స్పష్ట పరచు చున్నది.

పూర్వ కావ్యప్రపంచ మంతయు నేక నాయకముగా సాగి యుండుటచే కథైక్యమునకు సాధారణముగా భంగము కలిగెడిది కాదు. ఆంధ్రప్రశస్తి అట్టిది కాదు. ఇది బహునాయకముగా సాగినది. ద్వాదశఖండికా విలసితము. అయినను ఏఖండికకు అఖండిక స్వయం సంపూర్ణముగా తీర్చబడి - చారిత్రక పురుషుల - క్షేత్రముల ప్రశస్తి ఇది వృత్తముగా స్వీకరింపబడి - అదియే ఏక సూత్రతగా ఖండిక లన్నింటిని గుది గుచ్చినారు.

ఇట్టి విశిష్టమైన ఆంధ్రుల చరిత్రకు నద్దము పట్టు 'ఆంధ్ర ప్రశస్తి' బంగారమునకు తావి యబ్బినట్లు చరిత్ర పరిశోధకులలో మహోత్తమ స్థానమును పొందిన మల్లంపల్లి సోమశేఖర శర్మగారి కంకిత మీయబడినది.

అంకితము :-

అంకిత పద్యములలో మల్లంపల్లివారిని గూర్చి విశ్వనాథవారు చెప్పిన విషయ మట్లుండగా వారి ఆత్మకథలో నున్న విషయ మిది.

"నేను కొన్ని యేండ్లు మాటి మాటికి చెన్న పట్టణమునకు పోవుచు వచ్చుచుండెడి వాడను. నా ప్రియమిత్రుడును సోదరుడును నైన శ్రీ మల్లంపల్లి సోమశేఖర శర్మగారి యింటిలో మకాము. శ్రీ చిలుకూరి వీరభద్రరావు పంతులుగారు ఆంధ్ర చరిత్ర చతురాసను

డైనచో మా అన్న అనగా సోమశేఖర శర్మ ఆంధ్రచరిత్ర పరమేశ్వరుడు.............. మా సోమశేఖర శర్మ యిల్లు సర్వ చరిత్ర పరిశోధకులకు, తీర్థక్షేత్రము వంటిది. కొమ్ములు తిరిగిన చరిత్రకారులు వచ్చి యాయన వద్ద బహులిపుల తోడి శాసనములెట్లు చదువవల యునో శాసనములలోని యేమాటకే యర్థమో తెలిసికొను చుండెడి వారు. నా యాంధ్ర ప్రశస్తి సోమశేఖర శర్మగారి కంకిత మిచ్చితిని. అది యెప్పటి మాట! 1924 – ఆ ప్రాంతముల నాటి మాట!... .... ఆ నాడు నేను వ్రాసెడి కవిత్వమునకు ప్రథమ శ్రోతలలో సోమ శేఖర శర్మ యొకడు. ఆయన కవి. ఆంధ్ర సాహిత్య జ్ఞానము చక్కగా కలవాడు" ఆత్మకథ, పే. 23

శర్మ గారనిన అంతగౌరవము, ఆత్మీయత. ఉండుటను బట్టి ఆంధ్రప్రశస్తిని వారి కంకిత మిచ్చినారు. అంతియే కాదు; శర్మగారు విశ్వనాథవారి గుండె నెత్తురులను కదిపిన వ్యక్తి. ఈ విషయమును విశ్వనాథ వారే 'ముఖలింగము' ఖండిక యందు వాకుృచ్చినారు.

ద్వార బంధాలపై వ్రాయబడిన తొంటి
తెలుగు లిపి పోల్చుకొని కూడ బలుకు కొనెడు
నా మహా మాతృదేశ బద్ధానురాగు
లెవరొ నా గుండె నెత్తురు లిట్లు కదుప

ఆయన, ఈయన కూడ మాతృదేశ బద్ధానురాగులు. ఒకరు తొంటి తెలుగు లిపిని పోల్చుకొని కూడ బలుకుకొని చరిత్రను త్రవ్వి పోయగా మరొకరు – ఆ చరిత్రలోని మధుర ఘట్టములకు కవితా రూపమిచ్చిన వారు. ఇరువురి హృదయములు మాతృదేశ దీనస్థితికి దుఃఖ దారితములై విషాద గీతికయందు శ్రుతి గలిపినవి. ఆయన అనుకొనలేదు; ఈయన చెప్పనులేదు. ఆ విషయమే విశ్వనాథవారి నోటివెంట ఇట్లు వెలువడినది.

నీవను కోనులేదు మరి నేనిది చెప్పమలేదు కాని అ
న్నా! వినవయ్య నేటికిది నా చిరువొత్తము నీకు నంకితం
బై వెలయింపజేతు హృదయంబులు నీకును నాకు మాతృదే
శావిల దుఃఖ దారితములై శ్రుతి గల్పె విషాద గీతికన్

ఆ చరిత్ర తపస్వికి ఈ కవితా తపస్వి యొసంగిన అక్షరమైన చిరుకానుక. ఆంధ్రప్రశస్తి కోసమహోరాత్రులు కృషిచేసిన ఆ వ్యక్తి ఋణము నాంధ్రుల పక్షమున విశ్వనాథవారు తీర్పయత్నించినారు.

సంస్కృతాంధ్రాంగ్ల భాషలలో డిగ్రీలు లేని సునిశితమైన ప్రజ్ఞ. మీదు మిక్కిలి శాసనలిపిని చదువను, అర్థము చేసికొనుటను వారికి వారేసాటి.

ఆ చరిత్రజ్ఞాన మూషరక్షేత్ర వర్షోదకమైనది. ధనవంతుడు కాదు; గొప్ప ఉద్యోగికాదు. ఆయన జీవలక్షణము చరిత్ర పరిశోధన. చాడీలకు ముఖ ప్రశంసలకు స్థానమైనట్టి లోకాన ఉండి కూడ జీవన గమనమున దుందుడుకులకు దూరమై మసలిన సహన శీలి. అది గుర్తించువారు లేక అడవిగాసిన వెన్నెలైనది. తరువాత ఎప్పటికో ఆయన చరిత్రజ్ఞాన నిర్మలాంభః పూరము - అప్పటి కులపతులైన కట్టమంచి రామలింగారెడ్డిగారి చొరవ వలన ఆంధ్ర విశ్వ విద్యాలయమున సస్యశ్యామలము గావించినది. ఆ సస్యమంజరులే 'ఎ ఫర్గాటన్ చాప్టర్ ఆఫ్ ఆంధ్రహిస్టరీ' 'ది హిస్టరీ ఆఫ్ ది రెడ్డి కింగ్డమ్స్'.

విశ్వనాథవారి వాక్కులోని వేదన-శర్మగారు విశ్వ విద్యాలయ ప్రాంగణము లోనికి అడుగు పెట్టుటకు దోహదము చేసి యుండ వచ్చును. ఆ-వేదన సామాన్యమైనది కాదు. విశ్వనాథవారు మాతృదేశము కోసమెంత విలపించినారో, మాతృదేశము కోస మలమటించి నీరుగారి పోవుచున్న వ్యక్తి జీవితము కోసమంత తెక్కువగా ఆవేదన వెలిబుచ్చిన పద్యమిది.

'డిగ్రీలు' లేని పాండిత్యంబు వన్నెకు
రాని యీపాడు కాలాన బుట్టి
నీ చరిత్రజ్ఞాన నిర్మలాంభః పూర
మూషర క్షేత్ర వర్షోదకమయి
చాడీలకు ముఖప్రశంసల కీర్ష్యకు
స్థానమైనట్టి లోకాన నుండి
నీయచ్ఛతర కమనీయ శీలజ్యోత్స్న
అడవి గాసిన వెన్నెలగుచుజెలగి

అంతెకాని గౌరీ శంకరాచ్ఛ శృంగ
తుంగము త్వదీయము మనస్సు పొంగి తెలుగు
నాటి పూర్వచరిత్ర కాణాచి యెల్ల
త్రవ్వి తలకెత్త లేదె యాంధ్ర జనములకు

చాడీలకు, ముఖ ప్రశంసలకు, ఈర్ష్యకు స్థానమైనట్టిది - లోక మంటే ముఖ్యంగా పత్రికా లోక మన్నమాట.

తెలుగునాటి పూర్వచరిత్ర కాణాచి యెల్ల త్రవ్వి ఆంధ్ర జనముల, తలకెత్తిన ఆ మహోద్యోగిని ఎన్ని జన్మములకైన మరువ లేననుచున్నారు విశ్వనాథవారు.

కొదమ తుమ్మెద రెక్కల గుస్తరించు
మీసముల నీ ప్రసన్న గంభీర ముఖము
కన్ను లంటగ గట్టి నట్లున్న నిన్ను
మరచి పోలేను జన్మ జన్మములకైన

అది రాబోవు జన్మలలో కూడ కన్నులకు కట్టినట్లున్న కృతి స్వీకర్త స్వరూపమును మరువ జాలనను కృతికర్త మాట. అసలు వారి స్నేహము పూర్వ మెన్ని జన్మముల నుండి వచ్చు చున్నదో! అది ఈనాటిది కాదు. పూర్వాంధ్ర స్వతంత్ర రాజ్యములందు తోడి

సైనికులు. అప్పుడు వారిరువురి వుద్యోగ మాంధ్ర విరోధి కంఠ దళన ప్రారంభ సంరంభము. వీటిని పురస్కరించు కొనియున్న విశిష్ట పద్యమిది.

ఇది నీకైయుడినట్టి నాయుపద మున్నే నాడొ ఘూసాగ్రముల్
పదనై యాంధ్రవిరోధి కంఠ దళన ప్రారంభ సంరంభమే
చుదినాలన్ మరి తోడిసైనికులమై చూరాడు ప్రేమంబులో
నిది లేశంబని యైన జెప్పుటకు లేవే నాటి స్వాతంత్ర్యముల్.

పూర్వమున్న స్వాతంత్ర్యము తరువాత - వారికి లేకపోయినది. ఉంటే ఎంతైన చెప్పవలపినదే. అప్పటి కిప్పటికి పోలికేమిటి? అవి ఘూసాగ్రములే పదునెక్కి విలసిల్లినరోజులు. ఇవి కత్తులమొనలు గడ్డిపరకకు కూడ కాకుండగ పోయిన రోజులు. కనుకనే తెలుగుజాతి దుస్థితికి క్షోభించిన మనస్సులు కలవారై ఇరువురు యోధుల వలె తెలుగుజాతి స్వాతంత్ర్య సంపాదనకు, పురోభివృద్ధికి నడుముగట్టిరి. ఆ యోధత్వమే వారి సుకుమార స్నేహదీపమునకు మూల తైలము.

నతి :-

ఇంతచేసి, విశ్వనాథవారు తమ గురువుగారిని మరచి పోవువారు కారు. ఆ గురువుగారు సామాన్యులు కారు; ఔచిత్య పద్యాగతులు. శబ్దాంభోధిని బంధించినవారు; అవధాన మృదూక్తి మరంద ధారచే తెలుగు నేలనుక్కిరి బిక్కిరి గావించిన చెళ్ళపిళ్ళవారు.

పుడమిని బెక్కు సత్కవులు పుట్టిరి, మట్టిరి సత్కవిత్వపుం
దొడిమలు, చెళ్ళపిళ్ళకవితో దల తూగెడు వారె? వానతో
దడియని వారు మద్గురు వధాన మృదూక్తి మరంద ధారలో
గడుగని వారు మాకెచట గానగ రారిల దెల్గునాడునన్

ఇది విశ్వనాథ గురువుగారికి సమర్పించిన పద్యోప హార

పూర్వ కాళివందనము.

లోకములో కవులెందరు పుట్టినప్పటికి వారు సత్కవిత్వపు తొడిమలు మాత్రము స్పృశింప గల్గిరి. మకరందము నందు కొనలేక పోయిరి. కనుకనే చెళ్ళపిళ్ళవారితో వారు తుల తూగ లేక పోయిరి.

వానలో దడియని వారనునది కవి చౌడప్ప పద్యమును గుర్తు చేయుచున్నది.

నా నీతి వినని వానిని
భానుని కిరణములు మీద బారని వానిన్
వానను దడియని వానిని
గానముురా కుందవరపు కవి చౌడప్పా



# విశ్వనాథ వారి భక్తి దేశభక్తి

## ఉపజీవ్యగ్రంథములు


| | |
|---|---|
| అభినవలోచనం | డా. జి. వి. సుబ్రహ్మణ్యం |
| ఆంధ్ర కవిత్వము<br>గాంధీ తత్త్వము | డా. వి. అంకయ్య |
| ఆంధ్ర పౌరుషము | విశ్వనాథ సత్యనారాయణ |
| ఆంధ్రప్రశస్తి | విశ్వనాథ |
| ఆంధ్ర రచయితలు | మధునాపంతుల సత్యనారాయణ శాస్త్రి |
| ఆంధ్ర శతక సాహిత్య వికాసము | డా. కే. గోపాలకృష్ణరావు |
| ఆత్మకథ | విశ్వనాథ |
| ఆధునికాంధ్ర కవితాసమీక్ష | ఆచార్య కాకర్ల వెంకట రామనరసింహం |
| ఆధునికాంధ్ర కవిత్వము సంప్రదాయములు ప్రయోగములు | డా. సి. నారాయణరెడ్డి |
| ఋగ్వేదము | |
| కథా సరిత్సాగరము | సోమదేవభట్టు |
| [redacted]ట భాషా భూషణము | నాగవర్మ |
| కవి చౌడప్ప శతకము | కవి చౌడప్ప |
| గీతాంజలి | రవీంద్రనాథ టాగూరు |
| తర్క సంగ్రహము | అన్నంభట్టు |
| తెలుగు వీరగాథా కవిత్వము | డా. తంగిరాల వేంకటసుబ్బారావు |
| ప్రతిభాలహరి | డా. దివాకర్ల వేంకటావధాని |
| బ్రహ్మాండ పురాణము | వ్యాసుడు |
| భగవద్గీత | వ్యాసుడు |

| | |
|---|---|
| భారతి (వ్యాసకర్త) | శ్రీపాద గోపాలకృష్ణమూర్తి |
| భావకవులు-ప్రతిభావిస్ఫూర్తి | డా. శివలెంక ప్రకాశరావు |
| మా స్వామి | విశ్వనాథ |
| ముత్యాల సరములు | గురజాడ అప్పారావు |
| లక్ష్మీరంజన వ్యాసావళి | ఖండవల్లి లక్ష్మీరంజనం |
| లలితా త్రిశతీ భాష్యమ్ | శ్రీశంకర భగవత్పాదులు |
| శ్రీమద్రామాయణము | వాల్మీకి |
| వృషాధిప శతకము | పాల్కురికి సోమనాథుడు |
| విజ్ఞాన సర్వస్వము | తెలుగు భాషాసమితి |
| విశ్వనాథ కవితా వైభవము | జువ్వాడి గౌతమరావు |
| విశ్వనాథ శారద | విశ్వనాథ స్మారక సమితి |
| విశిష్ట సభ్యుల ప్రశంస | డా. దివాకర్ల వేంకటావధాని |
| వైతాళికులు | ముద్దుకృష్ణ |
| శివతత్త్వసారము | మల్లికార్జున పండితారాధ్యుడు |
| శ్రీకాళహస్తి మాహాత్మ్యము | ధూర్జటి |
| శ్రీమద్రామాయణ కల్పవృక్షము | విశ్వనాథ |
| సంగ్రహాంధ్ర విజ్ఞానకోశము | (సం) మామిడిపూడి వేంకటరంగయ్య |
| సారస్వత వ్యాసములు | సాహిత్య అకాడమి |
| సుభాషిత రత్నావళి | భర్తృహరి |
| హరవిలాసము | శ్రీనాథుడు |

